# మోహనాంగి



# మోహనాంగి

(శ్రీ R. S. సుదర్శనం, M. A. గారి సమీక్షా సహితము)

*

శిల్ప సాహిత్యములు నాకు జీవగఱ్ఱలు,
ఔపనిషద వనాలు విహారవీథులు—
ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము;
నడపు మిటు నాదు జీవిత నాటకమ్ము!

*

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు
తెనాలి

తొలికూర్పు 1973
రెండవ కూర్పు 1976
మూడవ కూర్పు 1977
నాలుగవ కూర్పు 1978
ఐదవ కూర్పు 1981
ఆరవ కూర్పు 1983

వెల 30/-

కాగితము రేట్లు, ప్రింటింగు రేట్లు విపరీతముగా పెరిగినందువ వెల కొలదిగా పెంచవలసి వచ్చినది.

ప్రతులకు :
గ్రంథకర్త, గాంధీనగర్, తెనాలి.

ముద్రణ :
సర్వోదయ ప్రింటర్స్, తెనాలి.

# ఈ నవల



సాహితీ సమరాంగణ సార్వభౌము డైన శ్రీకృష్ణదేవరాయల పుత్రిక తిరుమలాంబ. ఆమెను రాయలు మోహనాంగి యను ముద్దుపేరున పిలుచుకొనువాడు.

మోహనాంగి సంగీత సాహిత్యములందు అపర సరస్వతి; చిత్ర కళానిధి; మారీచీపరిణయమును వ్రాసిన మహాకవయిత్రి; అరవీటి రామ రాజునకు అర్ధాంగియైన సాధ్వీతిలకము.

విజయనగర సార్వభౌములలో కృష్ణరాయల పిమ్మట చెప్పదగిన వాడు అళియ రామరాయలు.

మోహనాంగీ రామరాజులను నాయికా నాయకులనుగా వరించిన చరిత్రాత్మకమగు నవల యిది. అయినను మోహనాంగి కథకే ప్రాధాన్య మెక్కువ.

సందర్భానుసారముగా భువనవిజయ సభాదృశ్యములు, సంకుసాల నృసింహకవి, రామరాజభూషణాదుల కథలు – ఇందు యథోచితము తావు చేసికొన్నవి.

తిమ్మరుసు కృష్ణరాయల కుమారుని చంపినాడన్న నిందను ఇందలి ప్రతినాయకుడు సలకము చినతిరుమలరాజు తొలగించి పున్నెము కట్టుకొన్నాడు.

పలకను చివతిరుమలరాజు, రాజ్యతృష్ణతో మేనల్లుడైన వేంకటాద్రిని చంపుట, రామరాజుచే విహతుడగుట చరిత్ర ఘోషించుచున్న సత్యములు.

జీవరత్నముల మహాప్రభావము కలవనుట రత్నశాస్త్ర ప్రసిద్ధము, అనుభవగోచరమునైన సత్యము. ఇట్టి మహిమకలదే ఇందలి మహేంద్ర నీలాలంకృత తారహారము.

బసివిరాండ్రను గూర్చి వేమన యోగి సైతము ప్రస్తావించి యున్నాడు. బసివిరాలగు నాగిని మోహనాంగికి కూర్చుచెలియై కథ మొదటినుండి చివరిదాక తారహారమువలెనే వ్యాపించినది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు 1967 లో ప్రకటించిన కవి కర్ణరసాయన కావ్యమునకు శ్రీ మోచర్ల రామకృష్ణకవిగారు ఉపోద్ఘాతము వ్రాసియున్నారు. అందు వారు మోహనాంగి మారీచీ పరిణయమును గూర్చియు, సంకుసాల నృసింహకవిని గూర్చియు కొంత వ్రాసినారు. నృసింహకవి కథ పండితపరంపరలోగూడ అనుశ్రుతముగా వినబడు చున్నదే. మా పితృపాదులు నా బాల్యమునుండియు కవులకు, శిల్పులకు, సంబంధించిన యిట్టి కథల నెన్నింటినో చెప్పుచుండెడివారు. నృసింహకవి పురుషోత్తమ స్థపతుల కథలనుగూడ వారు చెప్పగ విన్నాను.

శ్రీ మోచర్లవారి ఉపోద్ఘాతములో మోహనాంగి మారీచీపరిణయ వృత్తాంతమును చదివినప్పటినుండియు ఈ కథ ఒక చక్కని చరిత్రాత్మక మగు నవల కాగలదని తలంచి విషయములను సేకరింప యత్నించు చుంటిని. వేటపాలెము సారస్వత నికేతనములోనున్న శుక్లనామసంవత్సర (1929-30) "సమదర్శిని" ఉగాదిసంచికలో కీ. శే. పెట్టి లక్ష్మీవరసింహము గారు ప్రకటించిన మారీచీపరిణయమును చూచితిని. ఆ పుస్తకము సంపూర్ణ మైన లిఖిత ప్రతి ఎవ్వరివద్ద నేని దొరకునేమో తెలుపవలసినదని 1970

ఏప్రిల్ "భారతి"లో "మోహనాంగి మారీచీపరిణయము" అను వ్యాసమును వ్రాసి ప్రకటించితిని. ఎవ్వరినుండియు సమాధానము రాలేదు. ఇక సమదర్శిని వ్యాసమే ఆధారమైనది.

ప్రబంధాంకము సూరపరాజు వేంకటరాయభూషణు డగుట, భట్టుమూర్తి రామరాజభూషణు డగుట పండితుల ఆమోదము నందిన విషయములే! పెద్దన నృసింహకవికి అసూయతోనే రాయల దర్శనము చేయింపలేదని ప్రతీతి. మోచర్లవారును ఈ విషయము విప్లి వ్రాసినారు. అయినను పెద్దనపైగల ఈ నిందను తొలగించుటకే ఇందు యత్నింపబడినది. పెద్దనగారి "నిరూపహతిస్థలంబు ......." అన్న పద్యమునకు కన్నడ మూలము కలదని విద్యారత్న కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు "భారతి" మూలమున బయలుపఱచినారు. అయినను ఇది పెద్దన కవితా ప్రతిభలకు అపకర్షహేతువేమీ కాదు. శ్రీనాథునివంటి కవిసార్వభౌముడే తన కావ్యములలో సంస్కృత గద్య పద్య భాగములను ఆంధ్రీకరించి పెట్టుకొన్నాడు గదా!

కీ. శే. పెదగాడ గంగయ్యగారు "ఐదుగురు కవుల చరిత్ర"లో సంకుసాల నృసింహకవి విశ్వబ్రాహ్మణుడని నిరూపించినారు. అందుచే అతనిని మహాశిల్పిగా గూడ చిత్రించినాను. తపస్వియు, యోగియు నగు పురుషోత్తమస్థపతి నా లేపాక్షి నవలలోనివాడే. ఇందు వర్ణించిన అహోబిలక్షేత్ర శిల్పదేవతా విశేషములు నే నచ్చటకుపోయి స్వయముగా పరిశీలించినట్టివే సంగ్రహింపబడినవి.

ఈ నవలలో మోహనాంగి గొప్పదనమును ప్రకటించుట కుపకరించు వఱకే రామరాజునకు ప్రాధాన్యము. అందుకే రామరాయల రాజకీయ ప్రతిభాదికము ప్రాధాన్యము పడయలేదు.

మోహనాంగి ప్రాధాన్యమునకే - నాగినీ, తారహార, మారీచీ పరిణయ కావ్యముల ప్రస్తావము లుపకరించినవి. ఆమె సాధ్వీత్వ ప్రకటనమునకే తళ్ళికోట యుద్ధప్రశంస, నాగిని రామరాయల శిరస్సును తెచ్చి యిచ్చుట జరిగినవి.

ఈ విధముగా-కవయిత్రి, మహాసాధ్వి, సంస్కారవతి అయిన ఒక నారీతిలకమును నాయికగా చేసికొని నా నేర్చిన విధమున యీ నవలను తీర్చుటమైనది. గుణాగుణములను నిర్ణయింప సహృదయులే వలంతులు.

ఇందు ప్రస్తావింపబడిన రాజకీయాంశములకు ఆధారము "తెలుగు విజ్ఞాన సర్వస్వము - సంస్కృతి సంపుటి"లో శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు వ్రాసిన "విజయనగర సామ్రాజ్యము" అను వ్యాసము. వారికీ, ఈ నవలకు సంక్షిప్తమగు సమీక్షను వ్రాసి యిచ్చిన సహృదయ మిత్రులు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం, ఎం. ఏ. గారికి కృతజ్ఞుడను.

ఈ మోహనాంగి నవలను బరంపురం, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర, నాగార్జున, ఆంధ్ర విశ్వవిద్యాలయములందు ఉపవాచకముగా పఠనీయము చేసిన పాఠ్యగ్రంథనిర్ణాయక సభ్యులకు కృతజ్ఞతా పూర్వక నమోవాకములు.

—గ్రంథకర్త

# సమీక్ష

కళాప్రపూర్ణ కొండూరు వీరరాఘవాచార్యులుగారు లబ్ధప్రతిష్ఠులు. వారు రచించిన యీ నవ్యచారిత్రక నవలలో చరిత్రాంశముల కెక్కువ ప్రాధాన్య మివ్వబడినది.

"మారీచీపరిణయము"ను కావ్యముగ వ్రాసిన మోహనాంగి, శ్రీకృష్ణ దేవరాయల కొమార్తె యీ నవలలో నాయిక. ఆమె కవితాశక్తినీ, ప్రజాపాటవాలనూ, విద్యావినయ సంపత్తినీ, పితృభక్తినీ చిత్రించుటకే నవల పూర్వార్థము - కృష్ణరాయల నిర్యాణము వరకు - వినియోగింప బడినది. ఈ చిత్రణలో గ్రంథకర్త, కల్పనకంటె తాను పరిశోధించి తెలుసుకొన్న చరిత్రాంశముల పైననే ఎక్కువగా ఆధారపడి, శాస్త్ర గౌరవముతో రచన సాగించుట ఒక విశిష్టత.

కవులలో సాటివారిపై అసూయ సహజము. మోహనాంగికి అటువంటి స్పర్థ లేదు. ఆమె చదివిన నృసింహకవి పద్యము ద్వారా (ఉద్ధతుల మధ్యమున బేద కుండ(దర మో?)రాయలకు ఆ కవి ఉదంతము తెలియవచ్చుట, మోహనాంగి సహృదయతకు, ఔదార్యానికి వన్నెపెట్టుట అయినది. ఇట్లామెను గురువునుమించిన శిష్యురాలిని చేసినారు గ్రంథకర్త.

నవల ఉత్తరార్థము సలకము చినతిరుమలరాజు దుశ్చర్యలతో, స్వామి ద్రోహముతో రాజ్యములో ఏర్పడిన అవ్యవస్థనూ, అది అళియ రామరాయల విజయముతో అంతమై, మరల విజయనగర పూర్వవైభవము పునరుద్ధరింపబడుటనూ వర్ణిస్తున్నది. రామరాయల సభలో భట్టుమూర్తి సాహిత్యగౌరవాన్ని నిలబెట్టినాడు. రామరాయలు రాజ్యతంత్రజ్ఞుడు, సంస్కర్త. పొరుగు నవాబులతో ఆయన సాగించిన రాజకీయ వ్యవహారాల

వివరణకు పూనుకోలేదు. గ్రంథకర్త. తళ్ళికోట యుద్ధములో రామ రాయలు మరణించుటతో గ్రంథ సమాప్తి జరిగినది. ఇట్లా విజయనగర సామ్రాజ్య చరిత్రను శ్రీకృష్ణదేవరాయలనుండి రామరాయలవరకు అవలోకనము చేస్తూ మోహనాంగిని పూర్వార్ధములో కృష్ణదేవరాయల తనయగా, ఉత్తరార్థములో రామరాయల భార్యగా, సామ్రాజ్యవైభవానికి ప్రతీకను చేశారు. మధ్యకాలంలో ఆమె పొందిన శారీరకమైన అస్వస్థత కూడా, రాజ్యానికి పట్టిన అవ్యవస్థకు దీటుగానే ఉన్నది.

నవలలో నాగినీపాత్ర మోహనాంగితో సమానమైన ప్రాధాన్యము వహించినది. తొలికాన్పు ఆడపిల్లను వివాహము లేకుండ "బసివి" అనుపేర యథేచ్ఛానువృత్తికి వదలివేయుట నాటి ప్రజలలో ప్రబలిన ఆచారము. అట్టి యువతులకు రక్షణలేదు. నాగిని అటువంటి 'బసివి'. మోహనాంగి దాసీగణములో చేరి తన ప్రతిభావిశేషముచేత ప్రియసఖీ స్థానము నాక్రమించినది. ఈమె మోహనాంగికి నర్మసఖిగా నుండుటతో తృప్తిచెందక, పురుషవేషము దాల్చి, రామరాయలకు నమ్మినబంటు కూడ నైనది; మోహనాంగి రామరాయల వివాహ సందర్భమున కీలక మైన పాత్ర వహించినది. సలకము చినతిరుమలరాజుచేత భంగపాటునకు లోనై, పగ సాధింప ప్రతిజ్ఞబూని, "నా గి ని" సార్థక నామధేయ అయినది. యుద్ధరంగములో రామరాయల చెంగట నిల్చి సలకము చినతిరుమలుని గుండెలో చివరిపోటు పొడిచి ప్రతిన నెరవేర్చుకొన్నది. తళ్ళికోట యుద్ధములో దివి కేగిన రామరాయల మరణవార్త నాతని ఛిన్నమస్తకముతోగూడ రాణికి నివేదించి, ప్రాణత్యాగ మొనర్చినది. 'నాగిని' పాత్ర రచయిత కల్పన. 'బసివి' సంప్రదాయానికి చేసిన ఒక ఉదాత్తమూర్తి కల్పన. రామరాయలు ఆ సంప్రదాయాన్ని ముగింప జేస్తూ రాజశాసనము చేసినాడనుట చరిత్రాంశము. అదే 'నాగిని' అన్న బసివి, తన సంకల్పదీక్షచే రాజదంపతులను మెప్పించి శాసనము

చేయించినదన్న కథాంశముగా నవలలో రూపొందినది. చారిత్రక నవల స్వరూప మిట్లేర్పడుననుట కిది మంచి ఉదాహరణము. మరొక విధముగా చూచినచో "నాగిని" ప్రజాశక్తికి ప్రతీక. సామాన్యప్రజ - భటులు, ఉద్యోగులు, అంతఃపుర దాసదాసీజనము, రాజునకు అంతరంగికులు- అంగరక్షకులు వంటివారు. రాజ్యవ్యవస్థలో, యుద్ధములో, రాజుల దైనందిన వ్యవహారములలో నిర్వహించే పాత్ర ఒక్కొక్కసారి కీలక మైనదిగా ఉంటున్నా, చరిత్ర కందదు. వీరంతా చరిత్రలో నామరహితులు. చారిత్రక నవలలో ఆ ప్రజాశక్తికి కల్పనద్వారా ప్రవేశం లభిస్తుంది. రచయిత నాగిని పాత్ర కల్పనలో సాధించిన ప్రయోజనం యిదే. చరిత్ర కెక్కిన మోహనాంగి విజయనగర సంస్కృతి ప్రాభవాలకు ప్రతీక అయితే నవలలో ఆమెతో సమానమైన ప్రాధాన్యాన్ని పొందిన కల్పిత పాత్ర నాగిని చరిత్రకెక్కని ప్రజాశక్తికి ప్రతీకకావడంలో ఆశ్చర్యంలేదు.

రాజ్యాన్ని నడిపించేది మానవసంకల్పం కాదు. దైవసంకల్పం అని హైందవ విశ్వాసం. విజయనగర రాజ్యానికి విద్యారణ్యునినుండి ధర్మంతో, ఆస్తికవిశ్వాసంతో సంబంధం ఉన్నది. కృష్ణదేవరాయలశిల్పాది కళాపోషణ, సాహిత్యపోషణ "ఆముక్త మాల్యద" కావ్యరచన, కేవలం "భువనవిజయ"విలాసంగా, వినోదంగా, క్రీడగా అనుకోవడానికి వీలులేదు. అది ఆస్తికతయొక్క అభివ్యక్తి. ఈనవలలో కృష్ణరాయలు మోహనాంగి వెంట రాగా దివ్యక్షేత్రాలను సందర్శించుట అభివర్ణింపబడినది. ఆ సందర్భంలో తపస్వియైన పురుషోత్తమ స్థపతి తన మెడలో రాజువేసిన ముత్యాలహారాన్ని తీసి రాజకుమారికి ప్రసాదిస్తాడు. నవలలో ఈ హారానికి విశేషప్రాధాన్యం యివ్వబడినది. ఈ హారం రాజ్యాన్ని నడిపించే దైవ సంకల్పానికి ప్రతీకగా చిత్రించబడినది. ఒక విషయం దాని వైవిధ్యం వల్లగాని, బాహుళ్యం వల్లగాని : అనిర్వచనీయత వల్లగాని మేధాశక్తికి

అతీతంగా ఉంటూ పరిగ్రాహ్యం కానప్పుడు ప్రతీకరచన అవసర మౌతుంది. ప్రతీక మేధాస్పృష్టమైన విశిష్ట నామరూపగుణాదులతో బాటు అవిశిష్ట గుణవిశేషాలను స్ఫురింపజేస్తుంది. జ్ఞానస్వరూపము మేధాతీతమై స్పందనగా, సంవేదముగా కూడా ఉంటుంది. ప్రతీక అటువంటి జ్ఞానాన్నే కాక, మేధాతీతమైన శక్తినీ, లేక సంకల్పాన్నీ నిక్షేపించే సాధనం కావచ్చు. అప్పుడది మంత్రమో, యంత్రమో, లేక మహిమాన్వితమైన వస్తువో అవుతుంది. కథలోని ముత్యాలహారం అటువంటిది. రాజ్యవిస్తరణ ముగిసి కృష్ణరాయల జీవితం ప్రొద్దువాలిన సమయంలో ఈ హారం పురుషోత్తమ స్థపతి ద్వారా కృష్ణరాయలనుండి మోహనాంగికి సంక్ర మిస్తుంది. తదుపరి రామరాయల మరణసమయంలో తర్వాత రాజైన తిరుమలరాయల భార్య వేంగళాంబకు సంక్రమిస్తుంది. చివర జరిగిన ఈ మార్పులో ఒక చమత్కారమున్నది. మోహనాంగికి హారముయొక్క మహిమ తెలిసినందువల్ల ఆమె దానిని ఎడబాయదు. రామరాయల విజయ వార్త, కోడికోడలి కోరిక, మరిదిగారి అనారోగ్యము, మోహనాంగి సౌజన్యాన్ని ఒత్తిడిపెట్టి ఆమె హారాన్ని కోడికోడలికి యిచ్చేటట్లు చేస్తాయి; అది జరిగిన మరుక్షణమే రామరాయలు యుద్ధరంగంలో నిహతుడు కావడం జరుగుతుంది. మోహనాంగి ప్రాణత్యాగం చేస్తుంది. తిరుమల రాయలు విజయనగరం నుండి పెనుగొండకు తరలి వెళ్ళి పట్టాభిషిక్తు డవుతాడు. హారాన్ని ప్రవేశపెట్టడంద్వారా రచయిత మానవశక్తినీ, సంకల్పబలాన్నీ కించపరచలేదు. మానవునిలోని దైవాంశకు సహజమూ రమణీయమూ అయిన రూపకల్పన చేశారు.

చిత్తూరు,
6-10-1973

అర్. ఎస్. సుదర్శనం

# ఆశంస



ఈ "మోహనాంగి"ని సృష్టించిన కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు వట్టి కవులు కారు. విద్వత్కవులుగా, విమర్శకులుగా, దార్శనికులుగా, శాస్త్రవేత్తలుగా దేశంలో సుప్రసిద్ధులు. విశేషించి "శిల్పసాహిత్యములు నాకు జీవగఱ్ఱ – లావవిషదవనాలు విహారవీథులు – ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము...." అని వీరి ప్రతిజ్ఞ. అంతేకాక చారిత్రకాంశాలపై వీరికి ఆదరాభిమానా లెక్కువ.... "మహితాంధ్ర సంస్కృతి కథా రమ్యాంకముల్ చిత్తమందే వో యూహల మేలు కొల్పు...." సర్వ విద్యారహస్యాలు కుప్పలు వోసి ప్రకృత రచనను తీర్చిదిద్దారు.

పద్యం విర్మించినా, గద్యం విర్మించినా ఆచార్యులుగారి అల్లికలో ఒకే ఊపూ, ఒకే ఒడుపూ ఉరవడిస్తాయి. అదే జగ్గూ, అదే నిగ్గూ అందగిస్తాయి. ఎన్నో శాస్త్రసంప్రదాయాలూ, ఎన్నెన్నో శిల్పమర్యాదలూ, మరెన్నో సాంఘిక ధర్మాలూ, ఇంకెన్నో విద్యారహస్యాలూ ప్రకరణో-చితంగా, పాత్రోచితంగా కథాగతిలో కమనీయ శిల్పమహితాలుగా వీరి రచనలో ఖచితా లవుతుంటాయి. వీరి ఇతర నవలలు – "కళారాధన"ను పరీక్షించినా, "లేపాక్షి"ని సమీక్షించినా, ఈ సర్వలక్షణాలూ వీటిలో కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. ఇదే వరుసలో కళాప్రపూర్ణుల కళాసృష్టిలో ఆవిర్భవించిన ఈ "మోహనాంగి" రసికజన సమ్మోహనాంగిగా రాణించ గలదని ఆశంస।

వాల్తేరు
10—11—73

ఆచార్య డా॥ తూమాటి దోణప్ప
తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం

# MOHANANGI

Sri Vira Raghavacharya, a renowned Telugu writer, poet, critic, philosopher and a keen student of Indian art and sculptur has once again embellished Telugu literature with this historical novel, the main theme of which revolves round Tirumalamba, otherwise known as Mohanangi. daughter of Srikrishna Devaraya and wife of Aliya Ramaraya Tradition has it that she wrote a Prabandha "Marichi Parinayam" and dedicated it to her father. The former part of the novel is mainly devoted to that aspect of her life aud her marrige with Aliya Ramarayalu disregarding the love overtures made to her by Salakam Timmaraju. The veracity of this tradition is now questioned. But it does in no way detract the novel from its merits. While Mohanangi with her poetic skill, filial affection, chastity and love for virtues captivates our hearts. Nagini, an invented character, trained in warfare and endowed with virtues of fidelity, chastity and devotion to duty in addition to righteous indignation and rengeanced enraptures and grips our hearts. Portrayal of other characters is also fair.

Picturesque description of Bhuvana Vijaya, an assembly of poets, beautiful quotes from Telugu Prabandhas, description of sculpture in the Ahobila temple, discourses on Indian culture and philosophy, and references to the origin and development of the social system named "Basivi" give us a deep insight into the culture and social set up of the times and add immense charm to the work. Written in a simple and sweet style the novel is informative, educative and pleasing.

TRIVENI Vol. XLIII No. 3–1974

# అంకితము

శా॥ అన్నా వేంకటసుబ్బయాఖ్య ! భవదీయ ప్రజ్ఞ, సౌజన్య సం
పన్నత్వంబు, నుదారతాగరిమ, విద్వద్భక్తి, విద్యాప్రచా
రౌన్నత్యంబును, ధర్మకర్మ నియమా భ్యాసైకశీలంబు-నా
కన్నారంగని మెచ్చి యిచ్చితిని కాన్కన్ ప్రీతిఁ గైకోగదే !

ఉ॥ రామపదాంబుజద్వయి నిరంతరభక్తి భజించునట్టి శ్రీ
రాములు-అక్కమాంబయు పురాకృత పుణ్యఫలమ్ముగాఁగ నిన్
గోమున గాంచి పెంచి తమ కోర్కులు పండ తరించినారు; శ్రీ
రాముల పేర నిల్పితి, తిరంబుగ విద్దెలసాల నొద్దికన్.

గీ॥ రామతులసమ్మ నీగేస్తురాలు, మగువ
లందు తలమానికమ్మయి యందగించి
అయిదుగురు బిడ్డల నొసంగి యరిగె దివికి;
మఱువలే రెవ్వరాయమ్మ మధురహృదయ.

సీ॥ ఆత్మనాథుఁడు మెచ్చునట్టి యిల్లాలయి
షట్కర్మయుక్తగాఁ జలిపె వ్రతము,
సాధ్వీమతల్లిగా చానల మిన్నగా
చుట్టపక్కాల సంస్తుతులు వడసె,
అతిథిదేవతలను, అభ్యాగతావళి
నన్నపానాదుల నాదరించె-
తలలోని నాల్కగా మెలఁగి నల్వురిలోన
ఔనని మెప్పుల నందుకొనియె.

గీ॥ దీనుల కనాథులకు దయాధీనబుద్ధిఁ
బెక్కు-రీతులఁ దోడ్పడి పెరిగెఁ గీర్తి
రామతులనమ్మఁబోలెడి రామ లవని
అరుదుగా నుందు రవి జను లాడుకొనఁగ.

క॥ శ్రీతాగ్నులవలె వెలిగెడి
నీ తనయులు - సకలసుగుణ నియమ చరిత్రో
పేతులు, విద్యాధికులు, న
మాతత పితృభక్తియుక్తు, లార్యవిధేయుల్ ॥

క॥ జయలక్ష్మియు, ధనలక్ష్మియు
నయలక్ష్మివిధులు వా రనన్యాదృశలౌ
వినయమోపేతలు తనయ లు
భయ వంశోద్ధారికలు శుభస్తుతచరితల్.

గీ॥ చైతురాజులు హాలికప్రతిభఁ బేర్చు
మనుజు లున్నారు పెక్కు-రు; మాననీయ
గురుకులంబును నెలకొల్పి కూర్చువార
లెందఱో లేరు వినుబోలు విద్ధమతులు ॥

శా॥ తల్లిం దండ్రికిని బోలి బాలురను నిత్యంబెట్టి లోటేనిఁ బా
టిల్లం జేయక సాకి విద్యలను బోటీ పెట్టి నేర్పించుచుం
ఔల్లంటో ॥ మెటు తీర్పఁజాలెదవు సౌశీల్యాబ్దుల ల్లున్న ॥ నీ
యుల్లంబందు సుధాస్రవంతు లనిశం బుప్పొంగుఁబో నెచ్చెలీ॥

గీ॥ చదువుకొనవచ్చు పెద పెద్ద చదువు లెన్నొ :
సత్ప్రవర్తన యబ్బుట చాల యరుదు;
శీలవంతులుగా దిద్దు శిక్ష నిచ్చు
గురుకులము పాదుకొల్పి సద్గురుఁడ వైతి :

గీ॥ అగ్రసూనుఁడు మధుసూదనాహ్వయుండు
పాఠశాలాధిపత్యంబు పరిఢవింప
నూటికిని నూరుపాళ్లు అందుదురు విజయ
మిచట విద్యార్థు లన్నచో నేమి వింత :

ఆ॥ అన్నగారి కండయై ఉపాధ్యాయత
నెఱపుచుండి లోటు వఱలనీక
నీ ద్వితీయసుతుఁడు నిండు గౌరవమును
శ్రీనివాసరావు శీలశాలి :

ఆ॥ చిన్న కొమరుఁడైన శ్రీరామమూర్తి దా
పాఠశాలపనుల బాసట యయి
అర్భకులకు భోజనాది సౌకర్యమ్ము
లందఁజేసి మెప్పు లందుచుండు.

శా॥ శ్రీరామాహ్వయు చిహ్నమై వెలసి, వాసిం గాంచు నీ పాఠశా
లారామంబున నెన్నియో సభలు, కావ్యాలాపముల్. ప్రాజ్ఞ స
త్కారంబుల్ సుకవీంద్రపూజలు జగత్కల్యాణ సంధాయులై
ధారాళంబుగ సాఁగుచున్నవన నీ ధర్మైకదీక్షం గదా :

గీ॥ రామరూరల్ కళాశాల ధీమహితుల
నాదరించు విద్యాసంస్థ యన్న పేరు
గరప చేసెను తెన్నుజగాప, దీని
స్థాపకుడవైన నీదెంత సార్థజన్మ ॥

ఉ॥ రాయల పుత్రియై అళియ రామునికిం గడుఁ గూర్చు పెండ్లమై
"శోయజ సన్మరందరస తుందిల సుందర కందళోక్తి" రా
మాయణగాథ వ్రాసిన మహామహిళామణి మోహనాంగి తా
నాయమ పచ్చరిత్రమును అంకిత మిత్తును నీకు నెచ్చెలీ ॥

ఉ॥ ఏ కొలపావివంగడ మమేయ యశోవిభవాభిరామమై.
ఆకమలాప్తతారక మహర్నిశ మవ్యయ భవ్య భోగ భా
గ్యైక నికేతనంబయి 'చిరాయు రుదీర్ఘ గుణాలవాలమై'
నైక జయోన్నతిన్ భువన నాథుని సత్కృపఁ జూఁజలాడుతన్.

—గ్రంథకర్త

:o:—:o:

# మోహనాంగి

## 1

"రాముడు పెండ్లికొడు కాయెనే ! మన
సీతమ్మ పెండ్లికూతు రాయెనే !!"

అది మోహనాంగి ప్రసాధనగృహము. ఆమె యలంకరించు కొనుచున్నది. ఇంకెవ్వరును ఆ ప్రదేశమున లేరు. బసివి వెకిలి తనము వెల్లివిరియునట్లు మాటిమాటికి పై పాటనే పాడుచున్నది. తనలో తాను వికటముగా నవ్వుకొనుచున్నది. బసివికి మోహనాంగివద్ద చనవు మెండు. ఆమె వచ్చిన వేళావిశేష మెట్టిదోగాని, మొదట నామె మోహనాంగికి దాసిగా చేరినది. క్రమముగా ప్రియసఖీ స్థానము నందుకొన్నది. "సూది వలె వచ్చి దబ్బనమువలె తేలుట" యన నిదియే కాబోలును ! బసివి యిప్పుడు మోహనాంగికి కథలు చెప్పును. కావ్య ప్రసంగములో పాల్గొనును. సంగీత విద్యా మర్మములను చర్చించును. చిత్ర లేఖనమున సాయపడును. మోహనాంగి రేఖలను గీసిన, బసివి రంగులను మెళవించును. ఆమెతో చదరంగ మాడును. కొంచె కొంచెగా సమస్య లిచ్చును. ఇంకను ఏమేమో పరియాచకములాడును. మోహనాంగివద్ద ఆమె యేమి చేసినను చెల్లుబాటే! కాని, అనాడు బసివి నెఱపు నాగడము మోహనాంగిని కదలింప జేసినది. ఆమె బసివిని కోపించినది. తిట్టినది. కొట్టినదిగూడ. ప్రయోజనము కలుగలేదు. ఆమె "రాముడు పెండ్లికొడు కాయెనే" అను పాటను పాడుచునే యున్నది.

బసివికి పిచ్చిపట్టినదా యనుకొని మోహనాంగి ఆమెను బుజ్జగించుచు నన్నది.

"బసివీ ! సంగతేమిటో చెప్పవే ! నీకు పున్నెముండును. నీవేదో మనసులో పెట్టుకొని నన్నిట్లాటలు పట్టించుచున్నావు. అంతి పురమునుండి నే నీవలకు వచ్చినపిమ్మట, అక్కడ ఏవో ప్రసంగములు నడిచియుండును, అందుకు నీ విట్లు పాడుచుందువు. నా బసివి కాదూ ! చెప్పవే తల్లీ, నీవు కోరిన దేదైనను బహుమాన మిత్తును; చెప్పవే!"

ఈ మాటలనునప్పుడు మోహనాంగి మోమున జాలి జాలువారినది. ఆమె కన్నులలో నీరుసైతము తిరిగినది. ఆమె పొందిన యీ స్థితికి బసివిమనస్సు కరగినది; దయ కలిగినది. "పాడుదానను ఏల ఇంత సేపు రాకుమారి నేడ్పించితినా!" అని బాధపడుచు నామె యిట్లన్నది.

"రాజకుమారికి పెండ్లి చేయుదురటమ్మా! మాకు పప్పన్నములు; మీకు అందలములపై ఊరేగింపులు. పౌరులకు పరమానందములును గదా! మఱి నే నుత్సాహము పట్టజాలక పెండ్లిపాటలు పాడుకొనక యేమి చేయుదును? ఎవరి ఆనందము వారిది."

"ఓసి పోవే! నాకిప్పుడు పెండ్లి యేల? నా విద్యావ్యాసంగము కడముట్టపిదే నేను వివాహ మాడను."

"విద్యాపరిశ్రమకు కడ యున్నది గాబోలు. నాకు తెలియదులే. ఒక్క జన్మ మంతయు చదివినను చదువులు పూర్తియగునా? అందును ఒక్క సంగీతమో, సాహిత్యమో కాదాయె. సంగీత సాహిత్యములను డక్కగొన్న అపర సరస్వతివి కాదలంచుచుంటివి గదా! వానికి తోడు చిత్రకళాసముద్రమును గూడ ఆపోశనపట్ట దలంచితివాయె. మొన్న వరదాదేవమ్మగారు నీ చదువులనుగూర్చి అక్కలతో చెప్పి మురిసిపోవు చుండగా విన్నాను."

"ఔను. ఒక్క జన్మములో చదువులు పూర్తిగావిమాట నిజమే. చక్కని కవిత్వము వ్రాయుటకు వలసిన సాహిత్యజ్ఞానము నా కలవడిన జాలును."

"సాహిత్య సంపత్తిని సంపాదించి కావ్యములు వ్రాయుదువా యేమిః"

"ఔను. వ్రాయుదును. ఒక కావ్యమును వ్రాసి నా పితృదేవుల కంకిత మిచ్చి, వారి ఋణమును తీర్చుకొనవలయు నని నా సంకల్పము. నాన్నగారికి పెద్దనగారు మనుచరిత్రమును, తిమ్మనగారు పారిజాతాప హరణమును అంకిత మిచ్చి ధన్యులు కాలేదా!"

"ఓహో! అటులనా! మంచిదే. అప్పుడు నాన్నగారు, నిన్ను "నవమన్మథ మొలక" వంటి వరుని కిచ్చి పెండ్లిచేయుదురు. నీ కోరిక తీర్చుకొనుటకు మంచి యెత్తే వేసినావులే!"

"ఛీ! దుర్మార్గురాలా! పెద్దనాదులు లౌకికప్రయోజనముల నాశించి నాన్నగారికి కావ్యకన్యల నొసంగినారు. నే నట్టి ప్రయోజనముల నాశించుట లేదే. నేనుకోరునది కేవలము విశ్వశ్రేయమునే. ఇంకొకటి పారమార్థిక ప్రయోజనము. కవి యశస్సనునది కావ్యమున గుణమున్న వచ్చును, లేకున్నలేదు."

"అబ్బో! గొప్ప ఆదర్శమే పెట్టుకొన్నావే!"

"వాల్మీకి మహర్షి, యే ప్రయోజనమును గోరి రామాయణమును రచించెనో యెఱుగవా? ఒక్క విశ్వశ్రేయమే ఆ అర్షకవి లక్ష్యము. అయాచితముగ అతనికి మోక్షమును సిద్ధించినది. నాయనగారు నన్ను పెంచిన పెంపకమునకు, ముద్దుచేసిన చేయుటకు ఒక కావ్యము అంకిత మిచ్చియైనను వారి ఋణమును కొంతవఱకు తీర్చుకొందును."

ఈ మాట లన్నప్పుడు మోహనాంగి కన్నులానందబాష్పములతో నిండిపోయినవి. ఆమె గద్గద కంఠముతో ఆకసమువంక చూచుచు నిట్లు చెప్పినది. ....

"తిర్మలదేవికేఁ బొడమితిన్ గనుకన్, మును తిర్మలాంబయం
చర్మిలిపేరు నా కిడియు, నట్లుగఁ దాఁ బిలువంగరామి, నన్
గూర్మిని మోహనాంగి యను క్రొత్తపనామ్యను బిల్చుతండ్రికిన్
బర్మముఁ గోసి యిచ్చినను జాలదు గాదె ఋణంబు తీర్పఁగన్."

"ఏ మమ్మా నీ పితృభక్తి! వయసు వచ్చిన కన్నెమిన్నలు మగనికోసమై మనసు పడుచుండగాని, కన్నతండ్రిపై నిట్టి భక్తి విశ్వాస ములు చూపుట ఎక్కడను చూడనైతిని."

"బసివీ! నాతండ్రి నన్నెంతగా ముద్దుచేసి పెంచినాడో నీ కేమి తెలియునే!"

"వసితవనమందు నేను తన ప్రక్కను జిందులు ద్రొక్కుచుండ గ్రొం
బసిడి వనందుటందియలు పల్కెడు మువ్వల మ్రోఁత వింటకున్
విసువఁడు; నాదు పద్దెములు విద్దెల ముద్దియ పైడియందెలం
దెనఁగెడి మ్రోఁత లంచు విను నిప్పుడు మజ్జనకుండు ప్రేమచే!"

"సరే, ఇంతకూ నాయనగారి కే కావ్యము వ్రాసి యంకిత మీయ దలచితివో! అదిపాత చింతకాయ పచ్చడి కాకుండ చూచుకొనుము."

"ఆ సంగతి నా కెఱుకయే బసివీ! చింతకాయ పచ్చడి పాత దయినను, అందు చేర్చెడి సంబారముల చేత దానికి క్రొత్తదనము హెచ్చుపచ్చునే మొన్న నలపాకశాస్త్రములో చదివినది మఱచితివాయేమి? గట్టిగా పచ్చడి చేసెడిరీతి నెంతచక్కగా వివరించినాడు నలమహారాజు.

నా యుద్దేశ్యమును వినవే. కృతినాథుని ఆశయమును గూడ కవులు పాటింపవలయును.

"నాయన కిష్టమౌ కథయె నాదు ప్రబంధముగా నొనర్తు,రా
మాయణ మన్న నాయనకు మక్కువ మిక్కిలి యెక్కు డౌట, నే
నాయది కొంచు, కల్పితము నందు నొకించుక చేర్చి కూర్చెదం
దోయజ నమ్మరందరస తుందిల సుందర కందశోభితలన్"

మోహనాంగి యీ పద్యములను ఆశువుగానే చెప్పినదని బసివి గ్రహించినది ఆమె సంగీత సాహిత్య సరస్వతియే కాక, గొప్ప ఆశుకవయిత్రి యని కూడ తెలిసికొన్నది. ఇక పెండ్లి ముచ్చటలో నీక దింపనెంచి యిట్లన్నది.

"బానమ్మా! తనయలకు పితృదేవుడు పూజార్హుడే. కాదనను. అంత కంటెను పూజనీయుడు భర్తృదేవుడు కదా! స్త్రీకి పితృ స్నేహమనునది పెండ్లి యగునంతవరకే. తరువాత భర్తయే ఆమె కేడుగడయు, సర్వ స్వమును గదా! అట్టి మగనిని గూర్చియే నేనిప్పుడు చెప్పబోవుచున్నాను. నీ వేమో నాకడ్డువాట్లు వేయుచున్నావు."

"ఇన్ని శ్రీరంగనీతులు చెప్పుదానవు నీ వింతవఱకేల పెండ్లి చేసికొనలేదు? నాకంటెను పెద్దదానవు గదా! నీదంతయు ఆచరణములేని వట్టి పరోపదేశ పాండిత్యమే."

మోహనాంగి ఈ మాట లనునప్పటికి బసివి కన్నులలో నీరు తిరిగి నది. ఆమె గుండెలో నిప్పుకొండలు బ్రద్దలయినవి. ఆమె తన పూర్వ జీవిత మొకసారి మదిలో మెదలగా, ఏడ్చుచు నన్నది.

"అమ్మా! దాసీదానను. నాకును, మహారాజుల అల్లారుముద్దు బిడ్డవు నీకును పోలికయా! నావంటి నిర్భాగ్యురాలు పెండ్లాడియు, అడ కయు ఎవరి నుద్ధరింపగలదు? మీవంటి గొప్పవారిసేవలో నేను రాలి పోయినచో నా కదియే పదివేలు, నా కాపాటి యవకాశమును కుమారీ మణి యిచ్చిన చాలును. నా కే కోరికలునులేవు తల్లీ! నీవే....నీవే నాసర్వస్వము. నీవంటి సరస్వతీమూర్తి కు డిగముచేయు భాగ్యమును కలిగించినందులకు నే నా హజార రామస్వామి కేటికోళ్లు పెట్టుకొను చున్నాను."

తట్టుకొనలేని గుండెబరువుతో బసివి యీ మాటలన్నది. ఆ పలుకులు మోహనాంగికి బసివిపై నెక్కడలేని అక్కటికమునొదవించినవి. అంతఃపురాంగనలలో మోహనాంగి కనేకులాప్తురాండ్రున్నారు. కన్నతల్లి అన్నపూర్ణాదేవి; ఎక్కువ మక్కువతో చూచుకొను వరదాదేవి; ఇంక నెందఱో సఖీజనము, రాజబంధువర్గము. అయినను వీరందఱి మీదను మోహనాంగికి బసివిమీద నున్నంతయాదరము లేదు. బసివి యన్నచో ఆమెకు ప్రాణము. దాని కన్ని రహస్యములు చెప్పును. తనమనస్సులో నున్న యూహలు, ఉద్దేశ్యములు, సంవేదనలు, ఆవేదనలు—అన్నియు బసివికి చెప్పుకొన్నగాని ఆ రాజకుమారికి తృప్తిలేదు. ఇది యెక్కడి పూర్వజన్మసంబంధమో ఇరువురు నెఱుంగరు. ఇదీ వింతలలో వింత! బసివి, ఎక్కడనుండియో వచ్చిన దిక్కులేని పిల్ల. ఆమె చరిత్ర మోహనాంగి కింత వఱకును దెలియదు. అయినను ఆమె తాను చేయు మంచిపనులచేతనే రాజకుమారి హృదయము నాకట్టుకొన్నది. తల్లి దండ్రులకన్నను, అప్తులకన్నను మోహనాంగికి కూర్చునది బసివియే.

* * *

నాడు సాహితీసమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల వారి మలయకూట ప్రాసాదముమీది చంద్రశాలలో రాయల పట్టమహిషి తిరుమలదేవియు, అన్నపూర్ణాదేవియు, అచ్యుతదేవరాయల భార్య వరదాదేవియు సాహిత్యగోష్ఠి సలుపుచున్నారు. వారిచెంగట తిరుమలదేవి కూతురు తిరుమలాంబయు, అన్నపూర్ణాదేవి కూతురు వేగళాంబయు నున్నారు. రాయలవారు పెద్దకూతురు పేరును తన భార్య పేరును ఒక్కటే అయినందున ఆమెను మోహనాంగియను ముద్దుపేరున పిలుచు కొనుచుందురు. చిన్నకూతురు పేరు వేంగళాంబయైనను, ఆమెను అంతఃపురాంగనలేమి, సఖీజనమేమి కృష్ణాంబ యనియు పిలుచుకొనుచుందురు. ఈ రూపమున నైనను తమ ఒడయని పేరు ఉచ్చరించి ఆయనకు కృతజ్ఞత నెఱపినట్లగునని వారి ఆశయము.

అంతవఱకును మోహనాంగి తనతండ్రి రచించిన ఆముక్తమాల్యద లోని గోదాదేవి వర్ణనమును చదివి అర్థవివరణ మొనర్చి వారి నానందమున ముంచితేల్చినది. పిమ్మట వేంగళాంబ కొంతసేపు వీణ వాయించినది. అటు తరువాత మోహనాంగి మఱల విష్ణుచిత్తీయ పఠనములో నిమగ్నయయినది. వేంగళాంబ రేఖాచిత్రములను గీసికొనబూనినది. బసివిరాణులేమియాజ్ఞ లిచ్చెదరోయని వేచియున్నది తిరుమలదేవి, కూతుర్ల విద్యాభ్యుదయమునకు లోలోన సంతసించుచున్నది. ఆమె తన ముద్దుల కూతురైన మోహనాంగి చక్కదనమునకు మురిసిపోవుచు, ఆమె నోరగంట చూచీ చూడనట్లు చూచుచు తృప్తిపడుచున్నది. ఆమెను రాయలవారు మోహనాంగియని తగినపేరుననే పిలుచుచున్నారని కూతును చూచుచున్న కొలదిని తోచినది. ఆమె కుమారీసందర్శన జనితానందమును బయలుపడనీయక హృదయములోనే అడంచుకొన్నది.

మోహనాంగి యిప్పుడు నవయౌవన సౌధ సోపానముల నధిరోహించుచున్నది. పుట్టుకచేతనే ఆమె సౌందర్య లావణ్యముల రాశి. ఆ సౌందర్యమునకు ఎల్లప్రాయ మొక వింత చెలువమును సంతరించినది. అందును మహారాజ పుత్రిక యాయెను. ఆమె కేమి కొఱత? ఆహార విహారము లేమి, పాలన పోషణ లేమి అన్నియు ఆమెకు సమృద్ధిగా జరుగును గదా! అందుచేత నామె రెండవ రతివలె, ఆ యౌవనారంభ వేళ ప్రకాశించుచున్నది. ఆమె యన్నచో, అంతఃపురాంగనల కందఱకును ప్రాణమే. తిరుమలదేవి కన్నతల్లియే కావున, ఆమె తన బిడ్డను ముద్దుచేయుటలో వింతలేదు. అన్నపూర్ణాదేవి కూడ తనకూతురైన వేంగళాంబికంటెను, మోహనాంగినే యెక్కువగా ప్రేమించెడిది. ఆమె పట్టమహిషి కూతురనియో, లేక జన్మాంతరసంబంధమువలన కలిగిన యనురాగమో తెలియదుగాని, అన్నపూర్ణాంబ మోహనాంగిని ప్రేమించురీతి చూచువారికి వింతగానే యుండును. ఒక్కొక్కపట్టున మోహనాంగి అన్నపూర్ణాదేవికి ఔరసపుత్రి యేమో అనిపించు నంతగా ఆ పిల్ల నామె ముద్దుచేసెడిది. ఆ ప్రేమకు ఆ యా కారణములు చెప్పుకొనుట కంటెను, అన్నపూర్ణాదేవి యొక్క సహజ సౌజన్య మాతృత్వములే హేతువులని చెప్పుకొనుట యుచితము. లోకమున పెక్కురైన సవతులు, తమ బిడ్డలనియు, సవతుల బిడ్డలనియు భేదము చూపనిమాట వాస్తవము.

ఇక అచ్యుతదేవరాయల భార్య వరదాదేవి, మోహనాంగి నెంత ముద్దు చేయునో చెప్పవలెనన్న మాటలు చాలవు. అచ్యుతదేవరాయలు శ్రీకృష్ణదేవరాయల సవతి తమ్ముడు. రాయలవారి తండ్రి నరసరాయలకు తిప్పాంబ, నాగాంబ, ఓబాంబ అని మువ్వురు భార్యలు. వారిలో తిప్పాంబకు వీరనరసింహరాయలును, నాగాంబకు శ్రీకృష్ణదేవరాయలును ఓబాంబకు రంగనాయకులును, అచ్యుతదేవరాయలును జన్మించినారు.

అచ్యుతదేవరాయలు తన సుగుణసంపదచే కృష్ణరాయల ప్రేమను చూఱ గొన్నాడు. ఇక ఆయనభార్య వరదాదేవి, రాయలవారికి ముద్దుల మఱంద లగుటలో ఆశ్చర్యమమి? బావగారి పుత్రికలన్న వరదాదేవికి తీరని మమకారము. మహాసమ్రాట్టును, మహాకవియు నగు రాయల ప్రేమాదరములను చూఱ గొనుటకు ఎవ్వరు మార్గముల నేర్పవదు కొనరు? ఇట్టివైన పెక్కుకారణముల చేత వరదాదేవి బావగారి కూతుండ్ర నెక్కుడుగా ప్రేమించు చుండెడిది.

ఆమె ప్రేమ కింతకంటెను బలమైన కారణ మింకొకటి గూడ లేక పోలేదు. ఆమె సలకమువారి ఆడపడుచు:సలకరాజుకూతురు. పెదతిరుమలరాజ,*చినతిరుమలరాజులకుఅక్క. ఈతిరుమలరాజద్వయములో పెద్దవానికి పెండ్లియైనది. చినతిరుమలుడు అవివాహితుడు.అతడురూపజితమన్మథుడు. రూపమునకు దగిన శౌర్యపరాక్రమములుగూడ అతనికున్నవి. ఈతిరుమలరాజసోదరద్వయము రాయలవారికి దండయాత్రలలో తోడుపడి విజయము చేకూర్చినవారే. అచ్యుతరాయలపై కృష్ణరాయల ప్రేమ నినుమడింప జేయుటకు ఇదికూడ నొక కారణమని లోకులు భావించు వారు. కాని ఆ భావము సరికాదు. రాయలవారు ఎవ్వరి నే కారణముచే ప్రేమించునో, ఆదరించునో ఊహించు టంత సులభము కాదు; రాయలహృదయమట్టి గాంభీర్యము కలది. అయినను లోకులు మాత్రము తాము చక్కగానే ఊహించుచున్నామనుకొనువారు. వరదాదేవికి తనతమ్ముడగు చినతిరుమలరాజునకు మోహనాంగిని చేసికొందమను భావ మున్నది. అందుకని యామె మోహనాంగి నంతగా ప్రేమించెడిది. తిరుమలదేవి హృదయ మానంద భరితమై యుండుటను గనిపట్టిన వరదాదేవి, మోహనాంగి

*ఇతనిని తిరుమలయ్య, తిర్మలరాజు, తిమ్మరాజు, తిమ్మన, తిమ్మడు అనియు వ్యవహరింతురు.

వివాహ ప్రస్తావమునుదెచ్చి యామెతో "అక్కయ్యా! మన మోహనాంగి పెండ్లియీడు వచ్చినదిగదా! బావగారు సంబంధములనుగూర్చి ఆలోచించు చున్నారా!" అన్నది. వరదాదేవి, మోహనాంగి వివాహప్రశంస మాత్రమే చేసి, తన కూతురైన వేంగళాంబ పెండ్లిసుద్ది నెత్తనందుకు అన్నపూర్ణాదేవి మోముకొంచెము చిన్నవోయినది. అయినను ఆమె గాంభీర్యమును నటించి వికారమువయల్పడకుండుటకేయత్నించినది. మనోవికారములు కప్పిపుచ్చు కొనజూచినంతమాత్రమున కప్పువడునా? ఏదో మానవులు ప్రయత్నములు మాత్రము చేయుచుందురు. తన వివాహప్రసంగ మారంభము కాగనే మోహనాంగి యటనుండి లేచి ప్రసాధన గృహమునకు పోయినది. వెంగళాంబమాత్రము చదువుకొనుచున్నట్లు నటించి వారి ప్రసంగముల నాలకించుచున్నది. తిరుమలదేవి యన్నది.

"ఏమో చెల్లీ! మీ బావగారు తమ అంతర్య మెవ్వరికిని చెప్పరని నీకు తెలియును గదా! వారి హృదయమేమో నాకును దెలియదు. నిన్న మొన్నటి దనుకను విష్ణుచిత్తీయ రచనములో మునిగి కుటుంబవిషయము లనే మఱచియున్నారు. సమయము చిక్కినప్పుడెల్లను తండ్రీ కూతుం డ్రిరువురు సమస్యాపూరణములు, సాహిత్య చర్చలు చేయుట, అందలి బాగోగులను విమర్శించుకొనుట — వీని తోనే ప్రొద్దులు పుచ్చుకొను చుందురు; ఇక మన మోహనాంగికి ఈడు వచ్చినదన్న మాటయే గాని పెండ్లిగొడవమే పట్టలేదు. ఇట్టి స్థితిలో నే నేమి చేయజాలుదును వరదా! నీవు మోహనాంగిని గూర్చియే ప్రశంసించితివి. వేంగళాయికి మాత్రము పెండ్లి ఈడు రాలేదా? ఇద్దఱికిని మంచి సంబంధములు వెదక వలయును."

పట్టమహిషి తిరుమలదేవి సూక్ష్మగ్రాహిణి. పరుల యభిప్రాయ ముల నవ్వైపనికట్టగలదు. వరదాదేవి చేసిన మోహనాంగి వివాహప్రశంస

అన్నపూర్ణాదేవికి కష్టము గలిగించినదని ఆమె తెలిసికొన్నది. కావుననే ఇద్దఱు బిడ్డలును పెండ్లి ఈడు వచ్చియున్నారని పలికి అన్నపూర్ణకు సంతోషము కలిగించినది. ఇంతలో వరదాదేవి, సంగతిని గ్రహించి అన్నది.

"అవునక్కా! ఇద్దఱును పెండ్లియీడు వచ్చినవారైనను, ఇద్దఱి వివాహములు ఒకేసారి చేయరని నేను కృష్ణాంబ సంగతి తడవలేదు. ఆ పిల్లకుగూడ వివాహవయస్సు వచ్చినదని నే నెఱుగనా?"

తన పెండ్లి ముచ్చట వచ్చునప్పటికి వేంగళాంబ గూడ అచ్చటి నుండి వెడలిపోయినది. బసివి మాత్ర మటనుండి కదలలేదు. మఱల వరదాదేవి యన్నది.

"అక్కగారి కభ్యంతరము లేనిచో, మోహనాంగిని మన చిన తిరుమలరాజునకిచ్చి చేసిన బాగుండు ననుకొనుచున్నాము. ఇది కేవలము నా యభిప్రాయమే కాదు, మీ మఱదిగారి యుద్దేశ్యము గూడ. వారెంత గానో ఇట్లు జరిగిన బాగుండునని ముచ్చటపడుచున్నారు. బావగారితో ఈ సంగతిని ప్రస్తావించు ధైర్యము వారికి లేదు. నేనేదో నీవద్దనున్న చనవుచే భయపడుచునే ఈ పాటిగా నా కోరికను వెల్లడించితిని."

"భయ మెందులకు చెల్లీ! మనము పరాయివారమా యేమి? అడుగదగిన యోగ్యత మీకును, ఇవ్వదగిన యర్హత మాకును కలదు గదా! వధూవరు లిరువురును వయసులోను, చక్కదనములోను సరి పడుదురు. కాని ఈ సంగతిని బావగారి చెవిని వేయున దెవరా యను నదే నా ప్రశ్న."

"అదేమిటక్కా! ఎవరో ఏల వేయుదురు? మగనివద్ద అర్ధాంగి కన్న చన వెవరికుండును? అందునను బిడ్డల వివాహ విషయములను గూర్చి భార్యాభర్తలు కాక మతెవ్వ రాలోచింపగలరు?"

ఇంతలో అన్నపూర్ణాదేవి కల్పించుకొని "వరదాదేవి యభి ప్రాయము సముచితముగానే యున్నది. మోహనాంగి తిరుమలరాజులు అన్ని విధములను తగిన దంపతులుగా రాణింపగలరు. ప్రభువులతో ప్రస్తావింపుమక్కా!" అని తిరుమలదేవితో నన్నది.

* * *

బసివి ఈ ప్రసంగముల నన్నింటిని శ్రద్ధమెయి విని వచ్చియే యిప్పుడు మోహనాంగి నాటలు పట్టింప బూనినది. బసివి దైన్యమునకు కరగి పోవుచు మోహనాంగి యన్నది.

"బసివీ! నీవు కంటతడి పెట్టుకొనవద్దు. నీ కన్నీటిని నేను సహింపలేను. ఇప్పుడు నీకేమి బాధ గల్గించితినని యేడ్చెదవు? నేను నీ మనస్సును నొప్పించినానా? నిన్ను కానిపోని మాటలన్నానా? అట్లైన క్షమింపుము. నీవు చెప్పదలచిన దేదో చెప్పుము. ఇష్టమున్నను లేకున్నను నీ తృప్తికై నే నోపికతో విందును.

బసివి నలుదిక్కులను పరికించి అటనెవ్వరును లేకపోవుటను గమనించి చెప్పుచున్నది :-

"వరదాదేవిగారితమ్ముడు చినతిరుమలరాజుగారులేడూ, అయనకు నిన్నిచ్చి పెండ్లి చేయుదురట. చంద్రశాల నుండి నీ విటకు వచ్చిన పిమ్మట జరిగిన ప్రసంగ మిదియే. నేను గమనించునంతవరకు అమ్మ గార్లందరకు ఈ సంబంధ మిష్టమైనట్లే గ్రహించినాను. ఇక మహారాజు గారి అభిప్రాయము కోసమే వారెదురు చూచుచున్నట్లు నాకు తోచినది. నీకేమి! అదృష్టవంతురాలవు! చినతిరుమలరాజును పెండ్లాడి భోగములతో తలమునకలై అంతఃపురములో కులుకుచు కూర్చుందువు. నా స్వామిని

నాకు దూరమగునుగదా యని నా చింత. నేనింకెవ్వరికి సేవలు చేసి నా జన్మను తరింప జేసికొందును!"

"అదేమే, పిచ్చిదానా! నా అంతఃపురమునకు అరణపుదాసిగా నిన్ను తీసికొని పోనా? నీ యెడబాటు నేను మాత్రము సైచ గలుగుదునా? బసివి మోహనాంగికి బహిఃప్రాణము. నీడవలె వెంట నుండవలసినదే. రాజులు, తమ పుత్రికలకు అరణముగా కవులను, ప్రియసఖులను పంపుటఆచారమేగదా! కనుక, నీకెట్టి సందియమును వలదు. నిశ్చింతగా నుండుము."

"నన్నరణపుదాసిగా స్వీకరించుటకు నీభర్తగా రంగీకరింప వలయును కదా!"

"వారేల అంగీకరింపరు? అసలు అంగీకరింపరని నీకు సందేహ మేల కలిగినది? అట్లంగీకరించు భర్తనే నేను వరింతును. అటు నూతైనను నూటాతైనను నీవు నాతో నుండవలసిన దానవే!"

ఈ మాటలు విని బసివి మోము విప్పారినది. ఆమె "మాకన్నతల్లికి గుణవంతుడు, పరాక్రమవంతుడు, కళాప్రియుడు అయిన భర్త రావలయునని నేను వేయి దేవుళ్ళకు మ్రొక్కుకొనుచున్నాను. అమ్మా! ప్రొద్దు గ్రుంకబోవుచున్నది. నే నిక సెలవు పుచ్చుకొందును" అని వెడలిపోయినది.

బసివి అంతఃపురములో జేరునప్పుడొక ఒడంబడిక జరిగినది. సాయంకాలము నాలుగు గడియల ప్రొద్దున్నదనగా నిక బసివి అంతఃపురములో నుండదు. ఎక్కడికో పోయి మరల రాత్రికిగాని చేరుకొనదు. ఆమె పోవు ప్రదేశమును గూర్చిగాని, చేయు పనిని గూర్చిగాని ఎవ్వరును ఆమెను ప్రశ్నింపరాదు. తొలుతనే పట్టమహిషి నుండి ఇది

యొక వరముగా బసివి పొందినది. అందుకు తిరుమలదేవి యంగీక రించినది.

"బసివి ప్రతిదినమును సాయంకాల మెచ్చటికి పోవును? అట నేమిచేయును?" అను ప్రశ్నలు మోహనాంగి మదిలో నుదయించినవి.

## 2

మోహనాంగీ వేంగళాంబ లిరువురును అల్లసాని పెద్దనగారి వద్దనే విద్యాభ్యాసము చేసినారు. వేంగళాంబ తెలుగు మాత్రమే చదివినది. మోహనాంగి తెనుగుతోబాటు సంస్కృతమున నైషధాంతము కావ్యములు చదివినది. కాళిదాస భవభూతుల నాటకములను పఠించినది. శూద్రక మహాకవి వ్రాసిన "మృచ్ఛకటిక" మన్న ఆమె కభిమానము మెండు. ఆ నాటకము సమాజములోని గుణ దోషములను చిత్రించుటంబట్టియే ఆమె అభిమానమును చూఱగొన్నది. సాహిత్యజ్ఞానసంపూర్తికి కావలసిన ఆ యా శాస్త్ర రహస్యములను ఆమె గ్రహించినది. "గురువులేని విద్య కూడదెన్నటికిని" అన్నారుగాన, పెద్దనగా రామెకు పేరునకు మాత్రమే గురువు. విద్యలన్నియు పూర్వజన్మ సుకృత విశేషము వల్లనే లభ్య మయినవి. తెలుగు ఛందస్సునామె కవిజనాశ్రయము నాధారముగా గొని తెలిసికొన్నది. ఛందస్సు తెలియనప్పుడే మోహనాంగి పద్యములను వ్రాయుచుండెడిది. అదేమి చిత్రమోగాని, ఆమె వ్రాసిన పద్యములు గణబద్ధములుగానే యుండెడివి. పద్యగమనమునుబట్టియే ఆమె పద్యరచన మొనర్చు చుండెడిది. ఉత్పలమాల యున్నదనుకొనుడు.

"నానన నాననా ననన నానన నానన నాననా ననా"

అని హ్రస్వదీర్ఘములను కూర్చుకొన్నచో సరిపోవును. ఆ బాణీ ననుసరించియే మోహనాంగి సర్వవృత్తములను రచించెడిది. వృత్తము

లకు ప్రాసనియమ మున్నదని ఆమె యెఱుంగును. కనుక ప్రాసమును గూడ ఆమె సమకూర్చెడిది. ఇక యతులను తెలిసినంతవఱకు పాటించెడిది. తెలియనివి తప్పులు పడెడివి కాని ఇప్పుడు ఛందఃపరిజ్ఞానము కలిగినది గనుక ఆ యిబ్బందిగూడ తొలగిపోయినది పద్యరచనములో గణ యతిప్రాసము లామెకు లోబడినవి. దేశిచ్ఛందములైన సీసము, గీతము, ఆటవెలది, తరువోజ మున్నగు పద్యములు మోహనాంగి వ్రాయ నేర్చినది. ఆశుకవన మన్నను, సమస్యాపూరణ మన్నను ఆమెకు ప్రీతి మెండు. అంతిపురమున తల్లులకును, చెలికత్తెలకును ఆశుకవితతోనే సమాధానము లొసంగుటామె కొక వినోదము. ఎల్లప్పుడును ఏదోయొక సమస్యను కల్పించుకొని దానిని పూరించుటకై ఆమె యాలోచించుచుండెడిది. నాడు బసివి యిచ్చిన యొక విచిత్ర సమస్య నామె పూరించుటకు ఆలోచనా నిమగ్నయై యున్నది.

"స్తనములు లేని పూరుషుఁడు సంస్తవనీయుఁడు గాఁడు పృథ్విలో"

బసివి రాజకుమారియెదుటనే కూర్చుండి ఏదో చదువుకొనుచున్నది. మోహనాంగి ఆలోచించుచున్నది. ఈ సమస్య నెట్లు పూరించుట? పురుషులకు స్తనములున్నట్లు చెప్పవలయునే! సమస్యను గూర్చి యాలోచించుచున్నప్పుడు మనస్సుఅన్య విషయచింతనమువీడి ఏకాయత్తమగును. మనస్సు ఆలోచనలోనున్న తఱి ఇంద్రియములు ఎదుటి విషయములను గ్రహింపలేవు. ఒక వస్తువును కంటితో చూచుచున్నను "అది ఇది" యని తెలియదు. ఆ ఇంద్రియ విషయముతో మనస్సు జతపడినగాని, ఆ విషయము యొక్క పరిజ్ఞానము మనకు కలుగదు. ఒకానొకప్పుడు ఆలోచించువ్యక్తి మింటివైపు చూడవచ్చును. ఏవేవో భావములు తోచి కనుబొమ్మ లెగురవేయవచ్చును. తోచెడి తలపులనుబట్టి

ముఖములో ఆ యా వికారములు కలుగుచుండును. ఇట్టిదశల నన్నింటిని మోహనాంగి పొందుచునే యున్నది. ఆమె చేతితో కొంచెము సేపు చిబుకమును సవరించుకొనుచున్నది. కొంతసేపు తెప్పలార్పక దిక్కులు చూచుచున్నది. కొంతవడి వీపుపై వ్రేలాడువాల్జడను ముందునకు తీసికొని అందలి పూలపై దృష్టి పరపుచున్నది. కుడిచేతి బొటనవ్రేలి కొనను పండ్లతో నొక్కుచున్నది. పైటచెరగుకొనను మెలివేయుచున్నది. తాను కూర్చుండిన పీఠమునుండి లేచి కొంతసేపు అటు నిటు పచారులు చేయుచున్నది. సమస్య జటిలమైనది గనుక, ఆమె ఇంతగా శ్రమ పడవలసి వచ్చినది. కొంతసేపటి కామె అటనున్న తాటియాకును, గంటమును చేతిలోనికి తీసికొన్నది. ఆసనముపై నుపవిష్టురాలైనది. తాటియాకుపై గంటముపెట్టి వ్రాయబూనినది. అందుకొన్ని పదములను వ్రాయును. మఱల ఆలోచించును. మఱికొన్నిపదములను వ్రాయును. వ్రాత సాగుచున్నకొలదియు ఆమె మోములో ఒక సంతోషరేఖ విప్పారు చున్నది. అది వికసించుకొలది పూర్వపుటాలోచనాగ్రంథి సడలు చున్నట్లున్నది. క్రమక్రమముగా పద్యము మూడవపాదమును చేరుకొను నప్పటికి ఆమె మోమున వేయిచంద్రులు వెలదివెన్నెలలను కాయించినారు. ఆమె ఆనందసాంద్రురాలైనది. ఆమె తన సర్వేంద్రియములనువేదో బరువు దించుకొని తేలికపడినట్లనుభూతి పొందినది. బసివి తన చదువులో మునిగి ఇది యంతయు గమనించుటలేదు. ఇంతలో రాయలవారు మోహనాంగి విద్యామందిరమునకు విచ్చేసినారు. ఆయన ఆమె కగపడకుండగనే వెనుకనుండి మెల్లగా ప్రవేశించినారు. బసివి రాయలు రాగానే అటనుండి వెడలిపోయినది. రాయలు రాకనుగాని, బసివి పోకనుగాని మోహనాంగి గమనింపనేలేదు. రాయలవారు కూతు చేతిలోని తాళపత్రము మీది వ్రాత నిట్లు తనలో తానే చదువుకొనినాడు. మోహనాంగి చేతిలిపి

ముత్యములు కూర్చినట్లు ముద్దులు గురియుచున్నది. చదువుకొనుటకు రాయలవారికెట్టి ఇబ్బందియు కలుగలేదు.

"ధన మధికంబు కల్గినను, దచ్చికడల్ ఘనుఁడై జయించినన్,
దనురుచిచేత మన్మథుని దర్ప మడంచిన, విల్వలేని నూ
తన వసనంబు లెన్నయినఁ దాల్చి బడాయిగ నున్న, వాక్సతీ
స్తనములు లేని పూరుషుఁడు సంస్తవనీయుడు గాఁడు పృథ్విలో."

రాయలు సమస్యయొక్క క్లిష్టతను, మోహనాంగి చేసిన సుందరమైన పూరణమును మనస్సులోనే మెచ్చుకొనినాడు. అసలు సమస్యలో నున్న చమత్కారమే అట్టిది. సమస్య వినగనే గడ్డుగా దోచును. ఏదో విరోధము, అనుపపత్తి ప్రకటమగుచుండును. ప్రతిభాశాలియైన కవి, తన నేర్పుచేత ఆ సమస్యలోని ముడిని విప్పగా, శ్రోత లానంద మందుదురు. వారికేదో వెలుగు తోచినట్లగును. పదునెనిమిదేడులు నిండీనిండని తనయ ఇంతటి వైదుష్యమును సంపాదించుట, కవిత్వము నలవఱచుకొనుటయే గాక, జటిలములగు సమస్యలను పూరించుటలో గూడ వలతి యగుట రాయల వారి కాశ్చర్యము గొల్పినది.

మోహనాంగి సమస్యాపూరణము వలన కలిగిన సంతోషముతో ఆ పూరణమును బసివికి వినిపింపదలచి ఆసనమునుండి లేచి చూచునప్పటికి పితృదేవుడు సాక్షాత్కరించినాడు. ఆమె భక్తినమ్రయై అయనకు అంజలి ఘటించినది. రాయలవారు కూతును చేరదీసి, తలను మూర్కొని ఆనందబాష్పములతో ఆమె శీర్షమును తడిపి ఇట్లనినారు.

"ఏకాంతముగా ఈ సమస్యను గూర్చి ఎంతసేపటి నుండి యాలోచించుచున్నావమ్మా!"

"నే నిటకు వచ్చి గడియసేపైనది నానగారూ! కొంచెము నే పాలోచించునప్పటికి సమస్యకు పరిష్కారము చిక్కినది."

"ఇంతకును ఈ జటిలసమస్యకు నీవు పూరణము నెట్లు కనుగొన జాలినావు తల్లీ!"

"మొన్న సంగీతాచార్యులు కృష్ణగాయకులు, సంగీత సాహిత్య ములకు గల భేదమును దెల్పుచు—

"సంగీత మపి, సాహిత్యమ్, సరస్వత్యాః కుచద్వయమ్,
ఏక మాపాతమధురం, అన్య దాలోచనామృతమ్."

అను శ్లోకము నుదాహరించినారు. దాని నాధారముగ జేసికొని ఈ సమస్యను పూరింపగల్గినాను నానగారూ!"

"అయనగారు ఒక్కసారి చదువగనే నీ కీ శ్లోకము కంఠస్థ మైనదా? లేక వ్రాసికొంటివా?"

వ్రాసికొనలేదు నానగారూ! అనుష్టుప్పు ముప్పది రెండక్షరముల పద్యమే కావున, ఒక్కసారి వినగనే నాకు గుర్తుండును. ఇట్టిదే మఱొక శ్లోకమును గూడా కృష్ణగాయకులా సమయమున చదివినారు.

"శిశు ర్వేత్తి, పశు ర్వేత్తి వేత్తిగానరసం ఫణీ,
సాహిత్యరస మాధుర్య మీశ్వరో వేత్తివా న వా!"

సంగీత సాహిత్యములకెంత భేదము నానగారూ! నిజముగా కావ్య రస మాధుర్యమును, సాహిత్యములోని గంభీరార్థములను, ఈశ్వరుడుగూడ నెఱుగలే డన్నమాటలో నా కతిశయోక్తి తోచుటలేదు. సంగీతమును శిశువులు, పశువులు, పాములుగూడ ఆనందించును గదా!"

"అట్లు కాదమ్మా! సంగీతము సర్వజీవకోటికి ఆనందము నిచ్చుట నిజమైనను తదభ్యాస మెంతటి శాస్త్రపరిశ్రమ సాధ్యమో ఎఱుగవా తల్లీ! గురువులు చెప్పుటలేదా!"

"అయినను నాకు సాహిత్యము మీదనే గౌరవ మెక్కువ. శబ్ద తత్త్వజ్ఞానము కలుగవలెనన్న సాహిత్యోపాసనమే గదా శరణ్యము."

"సాహిత్యము రసప్రధానము, సంగీతము నాదసుధారసప్రధానము. రెంటి నుపాసించియు సిద్ధిని పడయవచ్చును. వైష్ణవమతములో గానమున కెక్కుడు ప్రాధాన్య మున్నది తల్లీ! శ్రీమన్నారాయణుడు సామగాన లోలుడు. ఆయన సంగీతమునకు కరగును. తుంబురు నారదాదులు సంగీత సాధనము చేతనే నారాయణానుగ్రహమునకు పాత్రులైనారు. ఆముక్త మాల్యద యందలి మాలదాసరి కథలోని మంగళకైశికీ గాన మహిమను గూర్చి చదివితివి గదా!"

"అది సరియేగాని నానగారూ! కవిత చెప్పుటకు ఏవేవో సౌకర్యములు కావలయునని పెద్దనగా రన్నారు గాని, నా కేమియు నక్కఱ లేనట్లే తోచుచున్నదే. నేనెట్టి యలజడిలో నైనను పద్యములను వ్రాయగలుగుచున్నానే!"

"పెద్దనగారే మన్నారమ్మా!"

"ఆయనగారు—

"నిరుపహతి స్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన, ముయ్యెలమంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే!"

ఈపద్యమున పేర్కొన్న వన్నియు నున్నగాని, కమ్మ వి కవిత్వము రాదన్నారే మఱి?"

"నీవివియన్నియు లేకుండగనే కవిత చెప్పుచున్నావు గదమ్మా! మఱి ఈ పద్యమెక్కడిదో?"

"పెద్దవగారు వ్రాసినదే నాన్నగారూ!"

"కాదమ్మా! కన్నడభాషలో "సూక్తిసుధార్ణవము" అను నొక వంకలవ గ్రంథము కలదు. అందలి యొక పద్యమున కిది ఛాయగా నున్నదే చూడుము.

"విరువహాత్తిస్థలం, మృదుతరాపవ మెళ్లణిసింపు దంబులం,
వరపిద, పుస్తకవ్రతతి, లేఖకవాచక సంగ్రహం, విరం
తర గృహవిశ్చితస్థితి, విచారకసంతతి, సత్కవిశ్రుతసా
దరత యిమళ్ళ సత్కవియు మీసువ దాగదె కావ్యవార్థియుం."

"ఛాయ యేమిటి నాన్నగారూ! అనువాదముగానే యున్నదిగదా! మఱి అన్యకవుల పద్యములకు ప్రతిబింబములు తీయుటయు, అను కరించుటయు గ్రంథచౌర్యదోషము క్రిందికి రాదా?"

"అవమర్థులగు వారిట్టివవి చేసిన దోషమే గాని, మహాకవు లిట్టి యనుకరణములు చేసినచో, ఆదిమూలకారులపై వారికిగల గౌరవమునకు నిదర్శన మందురు. వ్యాస వాల్మీకి ప్రభృతులును, కాళిదాసాదులును ఇట్టివవి చేసినవారే! వేదములలోని కావ్యములవంటి ఘట్టముల నుండి వ్యాసాదు లెంతయో స్వీకరించినారు. అట్లే వ్యాస వాల్మీకుల నుండియు కాళిదాసాదులును కొంత గ్రహించి స్వీయశిల్పముచే, తమ కావ్యములను మనోహరము లొనర్చుకొన్నారు."

"మీరు చెప్పునది వేఱు విషయము. ఈ పద్యము మాత్రము ముమ్మూర్తులను కన్నడ పద్యము కడుపున పుట్టినట్లే యున్నది. ఇది యనువాదము గాక మఱేమి?"

"సరేకాని తల్లీ! నీ వీ సాహిత్య జగత్తులో మునిగి సంగీతము మాటనే మఱచినట్లున్నానే?"

"లేదు నాన్నగారూ! నాకు సంగీతసాహిత్యములు రెండును రెండు కన్నులు. ప్రతిదినమును మన గురువుగారు కృష్ణగాయకులు వచ్చి సంగీతపాఠములు చెప్పిపోవుచునే యున్నారు. ఇప్పటికి గీతగోవిందము లోని అష్టపదులు కొన్నియైనవి."

"మంచిది తల్లీ! కృష్ణగాయకులు నేటికాలపు మహావైణిక శిరోమణులు. వయోవృద్ధులైనను, శిష్యవాత్సల్యముచేత నామాట కాదనలేక, నీకు సశాస్త్రముగా సంగీతము చెప్పుటకు అంగీకరించినారు. వారివద్ద వీణావాదన రహస్యముల నన్నింటిని నీవు గ్రహింపవలయును."

అట్లే నాన్నగారూ! చిత్రశిల్పి నాగాచార్యులవారుగూడ చిత్రమునకు ముఖ్యములైన షడంగములను గూర్చి చెప్పినారు. అభ్యాసముగూడ చాలవఱకు చేయించుచున్నారు. సంస్కృతములో "చిత్రబాహుళ్య" మని ఒక శాస్త్రగ్రంథ మున్నదట. దానిలోని ముఖ్యాంశములను రేపటినుండి బోధింతుమన్నారు. వర్ణమేళన ప్రక్రియ చాలవఱకు అలవడినది నానగారూ! ఈ రేఖాచిత్రములను చూడుడు. ఇది, మాతాతగారు నరసరాయలవారి చిత్రము. ఇవి, మా నాయనమ్మల బొమ్మలు. ఒకటి తిప్పాంబది. ఇంకొకటి నాగమాంబది. మఱొకటి ఓబమాంబది. అంతిపురిలోని చిత్తరువులను చూచి ఈ రేఖాచిత్రములను గీసి గురువుగారికి చూపినాను. వారెంతగానో మెచ్చుకొని ఈ చిత్రములకు నా చేతనే

రంగులు వేయించి సర్వాంగసుందరము లొనరింపజేయుదువన్నారు. మన బసివిగూడ నాతోపాటే సంగీత సాహిత్యములను, చిత్రశిల్పమును నేర్చు కొనుచున్నది నాన్నగారూ! నాకు గురువులు నేర్పుచుండగా, దానికి విన్నంతమాత్రముననే ఈ కళ లలవడుచున్నవి.

"ఓహో! అటులనా! ఈ బసివివృత్తాంతము తెలిసికొనవలయు నని చాలకాలమునుండి తలంచుచున్నాను. ఎప్పుడును వీలైనది కాదు. ఇంతకును ఈమె శైవ బసివియా! వైష్ణవ బసివియా?"

"మా బసివికి శైవవైష్ణవభేదములు లేవు నాన్నగారూ! అది సర్వ మతసహనము కరగిపోసిన బంగారుముద్ద. మీ పలుకులలోని యర్థము నాకు తేటపడలేదు."

"అది కాదమ్మా! మన దక్షిణాపథమున తొలికాన్పు ఆడపిల్ల లను వివాహము లేకుండ వదలిపెట్టెడివారు. వారు బసివిరాండ్రను పేర పశుప్రవృత్తితో బ్రతుకు త్రోయుచుండెడివారు. ఈ ఆచారము మొదట శైవమతములో ఏనాడు పుట్టినదో తెలియదు. బసవన్న లనుపేర వృష భములను స్వేచ్ఛగా వదలుట నేటికిని జరుగుచున్నది గదా! శైవము లోని ఈ ఆచారము క్రమముగా వైష్ణవ మతములోనికి ప్రవేశించినది. అందుచేత నీమెకూడ బసివిరాలేమో యనుకొని శైవ బసివియా! వైష్ణవ బసివియా అని నే నడిగినాను."

"ఆడుపిల్లలను వివాహముచేయక బసివిరాండ్రనుగా వదలుచున్నారా వార లేమి! ఇయ్యది ఘోరముగా నున్నదే! ఏ మహానుభావుడు, ఏ మతము, ఈ ఆచారమును కల్పించినను, ఇది స్త్రీలపాలిటగొడ్డలిపెట్టు. ఆ వనితలు పెండ్లిండ్లులేక పశుప్రవృత్తితో జీవించుటయా? సంఘ ములో నీ దురాచార మున్నను సంఘశాసకులమని చెప్పుకొను బ్రాహ్మణ క్షత్రియు లేల దీనిని ఖండించి మాన్పలేదు! ఈ దురాచారమును వారు

స్వార్థమున కుపయోగించుకొందమని, అట్టెయుంచి దానిజోలికి పోలేదా? పోనీ రాజులైనవారేల ఇట్టి దురాచారము పనికిరాదని శాసనము చేయలేదు? అవును! వారేల చేయుదురు. వారు సంప్రదాయములు చేసిన కీలుబొమ్మలు. వారికి సాంఘిక విషయాలలో స్వాతంత్ర్యము లేదు. పెద్దలనబడు గురువులు చెప్పినట్లు చేయుటయే పాలకుల లక్షణము. ఒక దురాచారము సమాజములో నున్నచో, అది దురాచారమని జనుల మనస్సులకు కొట్టవచ్చినట్లు పొడకట్టును గదా! ఇందుకై ప్రజలేల తమ యసమ్మతిని తెలుపలేదు? పోనీ. ఆ కన్నెమిన్నలైనను "ఇది విధివ్రాత" యనుకొని యిట్టి మూర్ఖాచారమున కేల బలియై పోవుచున్నారు.? "మేము పెండ్లాడుదు మనియు, మాకు పెండ్లిండ్లు చేయుడనియు" తమ తల్లిదండ్రుల మీదను బంధువర్గము మీదను తిరుగుబాటు చేయలేదా? అయ్యయ్యో! ఆలోచించిన కొలది గుండె పగిలిపోవుచున్నదే. పాప మాయెల ప్రాయపు కన్నెమిన్న లెన్నెన్ని కష్టములకు గుఱియైపోయి తమ బ్రతుకును బండలు చేసికొనుచున్నారో, భావింపజాలము నాన్నగారూ! పోనీ, ఇట్టి దురాచారము సమాజములో పాదుకొనిపోయి యున్నదనియు, దానిచే అనేకానర్థములు కల్గుటయేగాక కుటుంబమున కొక స్త్రీ దానికి బలియైపోయి బన్నములు గుడుచుచున్నదనియు నెంచి మీరైనను దీనిని తొలగించి సంఘమును సంస్కరించుట కేల శాసనములు చేయలేదు? మీవంటి స్వతంత్ర ప్రభువులే-ప్రజాహితైషులే దీని నుపేక్షింతురా? అయ్యయ్యో! ఎంత ఘోరము!"

ఈ మాటలను మోహనాంగి ఆవేశముతో నన్నది. ఆ సమయమున ఆమె మోమెఱ్ఱబారినది, పెదవులు వణకినవి. శోక క్రోధపరితాపములతో ఆమె గుండె నిండిపోయినది, తా నొక అపర దుర్గాదేవివలె, ఆమె ప్రకాశించినది. అంతటి యావేశము తన కూతునకు

కల్గి మాటాడు టెన్నడు రాయలవారెఱుగరు. ఆమె వినయశీలి నుండెడిది. ఆ వినయ విధేయతలు, ఈ దురాచార విషయము చెవిని బడి నప్పటి కేమైనవో తెలియదు. ఆయన కే జవా బిచ్చుటకు తోచలేద ని స్తబ్ధుడై యూరకుండినాడు.

"పలుకరేమి నాన్నగారూ! ఇంతటి ధర్మప్రభువులు మీ రే యూరకున్నారు,"

"నా బుద్ధి కెన్నడును ఇది తోచనే లేదమ్మా! ఇప్పటి నీయుపన్యాసమునుబట్టి ఇది ఒక దురాచారమనియు, దీనిచే కొందఱు స్త్రీ జీవితములు భ్రష్టము లగుచున్నవనియు గ్రహించితిని, నా కింతవఱకును కర్ణాట సామ్రాజ్యము నొంటి గొడుగు క్రిందికి తెచ్చుట, కవితా కళా రంగములను విస్తరింప జేయుట, మున్నగు కార్యములే కర్తవ్యములుగా దోచినవి. ఆ పను లొనర్చుటకే నా జీవితమును వెచ్చించినాను. నీక తెలియనిదేమున్నది! ఒక వంక గజపతులును, ఇంకొకవంక అశ్వపతులైన సుల్తానులును, దక్షిణదేశము నాక్రమించుటకు చేయుప్రయత్నములు, ఎప్పటికప్పుడు వారిని పాఱద్రోలి ఈ మహాసామ్రాజ్యమును ముక్కలు గానీయకుండ రక్షించుకొనుటకు నేను చేయు యత్నములు, దండయాత్రలు బుద్ధి తెలిసినప్పటినుండియు నీవు చూచుచునే యున్నావుగదా! ఏమాత్రమో సమయము మిగిలిన కావ్యరచనముతో సరిపోయెడిది. ఇట్టినాకు సమాజ దురాచారములను భావించి వానిని మాన్పుటకు వీలెక్కడ చిక్కెడిది తల్లీ! నిజముగా నిసివి ప్రస్తావన మన కొక మేలేచేసినది, ఆమె కారణముగా నీ హృదయము నాకు వ్యక్తమైనది. "బాలాదపి సుభాషిత" మన్నారు. మంచిమాట పిల్లలు చెప్పినను వినవలసినదే, రాజ్యమునకు నేను చేయ దగిన సేవలు ముగిసినట్లే. ముందు రాబోవు మీ తరములో ఇట్టి సంస్కార

కార్యములు జరుగునని ఆశించుచున్నాను. ఇంతకును బసివిసంగతి చెప్పకే పోయితివి. అస లామె ఎవరు? రూపరేఖలవలె విద్యాబుద్ధులు కూడ భగవంతుడామె కొసంగినాడు. ఆ పిల్ల నిన్ను నీడవలె నెడబాయక నీ క్షేమమునకై పాటుపడుచున్నదని విద్యానగరమున నేగాక, అహోబల క్షేత్రమునను చూచి గ్రహించినాను. తల్లిదండ్రులమైన మాకంటెను మిక్కిలిగా నీ విషయమున నామె ప్రేమాదరములను చూపుట వింతగా నున్నది."

"బసివి సంగతి నాకును తెలియదు నానగారూ! మేము దాని వృత్తాంతము నడిగినప్పుడెల్లను, అది కంట తడి పెట్టుకొనుటచే దానిని వృథగా నేడ్పింపనేల యని యా సంగతి నెత్తెడివారము కాము."

"అయిన, ఆమె పేరేల మార్చలేదు?"

"మా అమ్మ' పేరు మార్పజూచునప్పటికి బసివి "వల దమ్మా! ఇప్పటికి జరిగినమార్పులు చాలును. ఇంక నే మార్పులును నాకువల దని ఏడ్చినది. దానితో అమ్మ మిన్నకున్నది."

రాయలవారి అంతఃపురములోని పరిచారికలకు వారు ఉద్యోగములో చేరిన పిమ్మట పేరులు మార్చి వ్యవహరించుట ఒక యాచారము. మరాళిక, ఏకావళి, హరిణి, మనోజ్ఞ, స్రగ్విణి, వాసంతిక, నాగిని — మున్నగునవి ఆ పేరులు.

# 3

మోహనాంగి కళలలో నేర్పరి యగుటయేకాదు. సమాజశ్రేయ మును గూర్చియు ఆమెకు ప్రత్యేకాభిప్రాయము లున్నవని ఈ సంఘట నము ఋజువుచేసినది. ఆమె ప్రతిభ ఇట్లు వికసించుటకు అలనాడు

పురుషోత్తమస్థపతి యొసగిన ముత్యాలహారమే కారణమని రాయలు తలంచినారు. దాదాపు నాలుగేండ్ల నాటిమాట :-

*

శ్రీకృష్ణదేవరాయలు మహావైష్ణవ శిఖామణి గదా! దక్షిణాపథమున ఆ నాడాయన దర్శింపని దైవక్షేత్రము కాని, ఆయన సేవ లందుకొనని దైవతములుకాని, ఆయన చేయించిన శిల్ప సంస్కారములు పొందని దేవాలయములు కాని లేవనుట అతిశయోక్తి కాదు. దేవతాసేవ లనునప్పటికి రాయలవారికి శైవ, వైష్ణవ, బౌద్ధ, జైనాది మతభేదములు గూడ నుండవు. సర్వదేవతాక్షేత్రములకును ఆయన తన సేవలర్పించి ధన్యుడయినాడు. అసలు విద్యానగర మహారాజుల దృష్టియే మత ద్వేషము లేనట్టిది. మొదటినుండియు వారు సర్వమతములను సమదృష్టి తోడనే చూచుచు వచ్చినారు. ప్రౌఢదేవరాయలు అలనాడు "జెనిమాదేవి, అమనొక జైనమతస్థురాలిని పెండ్లాడి తన సమదృష్టిని ప్రకటించినాడు. ఆమె కారణముగా అంతఃపురములో కలహములు కలుగుటకు మాఱు సామరస్య సహాకారములే వర్ధిల్లినవట. రాగద్వేషములు కలుగుటకు హృదయ సంస్కారములు కారణము గాని. కుల మత వర్గములు కావు!

ఆ నాడు రాయలవారు అహోబిల దేవాలయ శిల్పసౌందర్య సందర్శనార్థము అంతఃపురముతోను, పరివారముతోను తత్‌క్షేత్రమునకు విచ్చేసి యున్నారు. అహోబిలము దైవ క్షేత్రమే కాదు; గొప్పవైష్ణవ గురుపీఠము కూడ. కొన్ని తరములనుండి యచ్చట ఒక్కొక్క వైష్ణవాచార్యుడు పీఠాధిపతిగా నుండి మతప్రచారము చేయుట సంప్రదాయమై యున్నది. అహోబిలమఠ ప్రథమాచార్యుడు శ్రీ మదాదివణ్ శఠకోప జీయ్యరు గారు. వీరు మహాగురువులు. ఆ గురుపరంపర అవిచ్ఛిన్న

ముగా నాటినుండియు వచ్చుచునే యున్నది. రాయలకాలమున మహో ద్దండపండితుడును, పంచమతభంజన బిరుదాంకితుడునునగు శ్రీ తాతాచార్య జియ్యరుగారు తత్పీఠాధిపతి. ఆయన భారతదేశమునందలి నూటయెనిమిది వైష్ణవక్షేత్రములకు శ్రీకార్యనిర్వాహకుడు. శ్రీకార్యమనగా, వైష్ణవమత పరిభాషలో తిరువారాధన మన్నమాట. రాయలవారు విష్ణుచిత్తీయమును రచించుచున్న రోజులవి. రాయలును, తాతాచార్యులును చాలసేపు శ్రీ సంప్రదాయ రహస్యములను గూర్చి మాట్లాడుకొన్నారు. వైష్ణవ సంప్రదాయమునకు శ్రీసంప్రదాయమనియు పేరు. దీనిని శ్రీమన్నారాయ ణుడు తొలుత లక్ష్మీదేవి కుపదేశించెను. ఆమెనుండి ఈ విద్యను విష్వ క్సేనుడు పొందినాడు. అతనినుండి ఆచార్యపరంపరగా ఈ విద్య ప్రచారమునకు వచ్చినది. శ్రీదేవినుండి ప్రవర్తిల్లినందున దీనికి శ్రీసంప్రదాయమని పేరువచ్చినది. కృష్ణరాయ తాతాచార్యు లిరువురు మాటాడుకొను విషయములను మోహనాంగి శ్రద్ధతో వినుచున్నది. ఆమె అహోబలక్షేత్ర మహిమనుగూర్చి సెలవీయ వలసినదని తాతాచార్యుల వారిని కోరినది. ఆయన రాజకుమారి దైవభక్తికి మెచ్చుకొని తద్రహస్య ములను గూర్చి చెప్పుచున్నాడు.

"తిరుపతినుండి శ్రీశైలప్రాంతము వఱకును వ్యాపించియున్న కొండల చాలునకు నల్లమలలని పేరు తల్లీ! ఒక వరుసగానున్న ఈపర్వత సమూహము నంతటిని శేషాద్రియని పిలుతురు. అనగా ఆదిశేషుని రూపముగా నున్న పర్వతపంక్తియని భావము. ఈ శేషాద్రియొక్క శిరస్సుమీద అనగా, ఏడు కొండలు ఏడు ఫణములుగా భావింపబడిన తల (తిరుమల) మీద శ్రీ వేంకటేశ్వరస్వామి కొలువై యున్నాడు శేషుని వక్షఃస్థలముగా పేర్కొనదగిన మధ్యభాగమగు ఈఅహోబల పర్వతపంక్తి మీద శ్రీ లక్ష్మీనరసింహస్వామి వేంచేసియున్నాడు. ఈ అహోబల

మునకు అహోబిలము, గరుడాద్రి, వేదాద్రి, అనియు నామాంతరములున్నవి. ఇక శేషాద్రిగా భావింపబడిన శ్రీశైలముమీద మల్లికార్జునస్వామి నివసించి యున్నాడు. ఈ విధముగా ఈ కొండలచాలు తనపై శివ కేశవులను నిలుపుకొని శైవ వైష్ణవ మత సామరస్యమునుగూడ చాటుచున్నది. ఇట్టి దైవసాన్నిధ్య మనెడి భాగ్యము మన ఆంధ్రదేశమునకు మాత్రమే కలదని గ్రహింపవలయును.

"భూలోకమున భగవంతుడు అర్చారూపములో నిత్యనివాసము చేయు పుణ్యక్షేత్రములు పదునేడున్నవి. వానిలో ఈ అహోబిలక్షేత్ర మొకటి. తిరుమంగైయాళ్వారు, "దైవమల్లాల్ శెల్ల వొణ్ణా శింగవేళ్ కుంద్రమే" అని ఈ క్షేత్రమును స్తుతించి యున్నాడు. అనగా "దేవుడు తప్ప మఱెవ్వరును ప్రవేశింపలేని నరసింహక్షేత్రము" అని భావము తల్లీ! ఈ క్షేత్రము దిగువ అహోబిలమనియు, ఎగువ అహోబిలమనియు రెండు రీతులుగా నున్నది"

మఱునాడు జియ్యరుగారు రాయలవారిని సకుటుంబముగా దిగువ అహోబిలమునకు క్రోశము దూరములోనున్న భార్గవతీర్థమునకు తీసికొని వెళ్ళినాడు. వా రందు స్నానముచేసి, దానికి దాపున గల కొండమీది గుహలో నున్న భార్గవ నరసింహమూర్తిని దర్శించిరి. ఈ స్వామిని పరశురాముడు ప్రతిష్ఠించినందున ఈయనకు భార్గవ నరసింహుడని పేరు వచ్చినది. తరువాత, వారు అచ్చటికి కొలదిదూరములో నున్న యోగానంద నరసింహస్వామిని దర్శించినారు. ఈ స్వామి యోగపట్టమును దాల్చి భక్తుల యభీష్టములను దీర్చుచుండును. ప్రహ్లాదునకు యోగవిద్యను గఱపినది ఈ యోగనరసింహస్వామియే యట.

అటుపిమ్మట వారు ఎగువ అహోబిలమునకు పయనమై పోవుచు త్రోవలోనే కరంజవృక్షము క్రిందనున్న కారంజ నరసింహుని పూజించిరి.

కరంజ మనగా కానుగుచెట్టు. ఆ వృక్షము క్రింద నున్నందున ఆయన కారంజనరసింహుడైనాడు. అచ్చటి భవనాశినీ జలపాతపు సొగసును రాయలు చిరకాలము తెప్పవాల్చకచూచి ఆనందించినాడు ఈ తీర్థోదకమునందు తాన మాడి దేవుని పూజించువారికి సర్వతోముఖజ్ఞానము కలుగునని జియ్యరు చెప్పగా, మోహనాంగియు, బసివియు భక్తి మెయి నట్లొనర్చిరి. అటనుండి కొంత దూర మేగి, వారు దశబాహువులతోనున్న అహోబల నరసింహుని దర్శించిరి. ఇతడు హిరణ్యకశిపు సంహార మూర్తిగా భక్తులకు దర్శనమిచ్చును. ఇతడే ఈక్షేత్రమున పురాణప్రసిద్ధిగన్న ప్రధానమూర్తి ఈ స్వామిని తిరుమంగైయాళ్వారు మంగళాశాసనము చేసినాడు. ఈ స్వామివద్దకు వచ్చుదారిలో భవనాశిని యొడ్డున వరాహరూపమున శ్రీ లక్ష్మీనరసింహస్వామితోబాటు దర్శనమిచ్చు దివ్యమూర్తియే క్రోడాకార నరసింహస్వామి. రాజకుటుంబ మా యిరుమూర్తులకు ఏటికోళ్ళు సమర్పించినది,

అచ్చటినుండి వారు అర్ధక్రోశ మెగువకు నడచి మాలోల నరసింహుని సేవించినారు. 'మా' అనగా లక్ష్మీదేవి కదా, ఆమెకు లోలుడైన ఈ నరసింహుని ప్రసన్న నరసింహమూర్తిగా గూడ నెన్నవచ్చును. ఈ ప్రదేశమునకే లక్ష్మీక్షేత్ర మని పేరు. ఇచ్చట లక్ష్మీనరసింహ మంత్రము జపించువారికి ఐహికఫలములే గాక, మోక్షసుఖము గూడ చేకూరు నని చెప్పగా, రాయలవారు కొంతసేపు ధ్యాననిమగ్నుడైనాడు. మోహనాంగి ఆ స్వామి నేమిమ్మని కోరుకొన్నదో మనకు తెలియదు, అచ్చటకు క్రోశము దూరములో నున్న జ్వాలానరసింహస్వామి వద్దకు పోవుట స్త్రీలకు కష్టమైనందున, రాయల రాణివాసము వెనుకకు మరలివచ్చినది. రాయలును, జియ్యరును మీది ప్రయాణమును సాగించిరి.

జ్వాలానరసింహ విగ్రహము గరుడాద్రి, వేదాద్రి- అను రెండు కొండల నడుమ నున్నది. ఈ గరుడాచలమునకు దక్షిణముగా రెండు క్రోసుల దూరములో పావన నరసింహస్వామి యున్నాడు. ఇతడు ఇష్టార్థములను సమకూర్చు దివ్యమూర్తి. రాయలవా రా మూర్తులను గూడ కొలిచినారు. ఎగువ అహోబిలములో అవశ్యము చూడదగినది – ఉగ్ర స్తంభమును, "ప్రహ్లాదమెట్టు"ను ఒక కొండ రెండుగా చీల్చినట్లున్నది. ఈచీలికనడుమ నరసింహావతార సన్నివేశముతో భగవంతుడు దర్శన మిచ్చుచుండును. స్తంభము బ్రద్దలయి గదా నరసింహస్వామి యవత రించినది. దీనినే ఉగ్ర స్తంభమనియు, హిరణ్యకశిపుని గృహ స్తంభ మనియు అందురు. నృసింహానికిని, ఉగ్ర స్తంభమునకు నడుమ నొక గుహలో ప్రహ్లాదుని మూర్తి యున్నది. దీనినే "ప్రహ్లాదుని మెట్టు" అను చున్నారు. అంతటి సుకుమారుడైనను రాయలు అతికష్టప్రయాణముచేసి అహోబిల భవ్యదృశ్యముల నన్నింటిని బొడగాంచినాడు.

ఈ నవనరసింహాలు గాక, ప్రహ్లాద వరదుడుగా ప్రసిద్ధి నంది, దిగువ అహోబిల దేవాలయమున వేంచేసి యున్న స్వామియే ఎల్లరు సేవింపదగిన లక్ష్మీనరసింహమూర్తి. ఇచ్చటకు వచ్చు భక్తు లీ స్వామినే దర్శించి యిష్టసిద్ధుల నందుచుందురు.

ఎగువ అహోబిల దివ్య దృశ్యములను చూచి వచ్చిన పిమ్మట తాతాచార్యులవారు రాజకుమారి భక్తిశ్రద్ధల కబ్బుర పడినారు. ఆయన కేదో దైవప్రేరణ కలిగినట్లు కాగా, ఆనందబాష్పములతో నిండిన కన్ను లతో మోహనాంగిని గాంచుచు వాత్సల్యము పొంపిరి పోవగా, ఆమె నుద్దేశించి యిట్లనినారు.

"అమ్మా! వైష్ణవమతములో పన్నిద్దఱాళ్వారు లున్నారు. నాయన గారు వ్రాయు కావ్యములోని విష్ణుచిత్తునకు పెరియాళ్వారని పేరు. ఈయన కూతురే గోదాదేవి. ఈమెను సంస్కృతమున ఆముక్తమాల్యద యనియు తమిళమున చూడికుడుత్త నాచ్చియార్, కోత్తై, ఆండాళ్ అనియు నందురు ఆళ్వారులలో స్త్రీరత్న మీమె యొక్కతయే. ఈమె శ్రీరంగ నాథునే పెండ్లియాడిన మహాభక్తురాలు; మహాకవయిత్రియు. ఈమె స్వామినిగూర్చి కొన్ని పాశురములను వ్రాసినది. వానిలో "తిరుప్పావై" శ్రేష్ఠమైనది. గోదాదేవి వ్రాసిన పాశురములలో స్త్రీ సహజమైన సౌందర్య మాధుర్య లాలిత్యములు పరవళ్లు ద్రొక్కుచుండును. వీనిలో నుండు తత్త్వము భగవంతునికి చెందిన భక్తి ప్రపత్తులు. గోదాదేవి భగవంతుని తోడి విరహము సహింపలేక తత్సాంగత్యమునకై విరహ గీతికలు గానము చేసినది. అమ్మా! మోహనాంగీ! నిన్ను చూడగనే చూడికుడుత్త నాచ్చియార్ నాతలపున మెదలుచున్నది తల్లీ! నీ వామెవంటి కవయిత్రివి, మహిళారత్నమవు కాగలవని నాకు తోచుచున్నది. నీ చరిత్రము లోక సమ్మాన్య మగునట్లు భగవానుడు నన్నాశీర్వదింప మనుచున్నాడు. బిడ్డా! నీ కివే శ్రీమన్నారాయణుని అమోఘాశీస్సుల నందించుచున్నాను." అని యా వైష్ణవ పీఠాధిపతి, ఆనందాశ్రువులు క్రమ్ముచుండ మోహనాంగి శిరముపై సేసలు చల్లినాడు. ఈ అపూర్వ సంఘటనమునకు రాయల వారును, దేవేరులును ఆశ్చర్యానందముల నందినారు. మోహనాంగి భక్తిభరితమగు చిత్తముతో ఆ మహాపురుషుని దీవెనలను తలయొగ్గి స్వీకరించినది.

రాయలవారు అహోబిలము లోని లక్ష్మీ నరసింహస్వామివారి ఆలయపు ముఖమండప మహా మండపాదులను, లోకోత్తర శిల్పసుందర ములుగా నిర్మింపజేసినారు. వానిని నిర్మించిన శిల్పాచార్యులు విద్యానగర

శిల్పవిద్యా గురుకులమునకు చెందినవారు. ఈ శిల్పిగణమునకు ప్రధానాచార్యుడు పురుషోత్తమస్థపతి. ఆయన వేదవేదాంగవేత్త. శిల్పవాస్తుశాస్త్రములలో నిధి యగుటయే కాదు; సర్వతంత్ర స్వతంత్రుడు. ఆయన ఆయా దేవతలను ఉపాసన చేయుచు, వారి మూర్తులను శిల్పించుచుండును. శైవ, వైష్ణవ, శాక్త, సౌర, గాణాపత్య జైన, బౌద్ధాది మతములకు చెందిన సర్వమంత్ర తంత్రములను ఆ యాచార్యుడు సరహస్యముగా నెఱుంగును. శిల్పవిద్యా గురుకులపతి యైనవెంకణాచార్యునికి పిమ్మట అంతటివాడు పురుషోత్తమస్థపతియే. ఆయన రాయలవారికిని తత్కుటుంబమునకును మహా మండప స్తంభ శిల్పములను గూర్చి వివరించుచున్నాడు.

"ఈ మహామండపమును కల్యాణ మండపముగా గూడ నుపయోగించుకొన వీలగునట్లు శిల్పించుటయైనది. ఇందిఱువదినాలుగు స్తంభములున్నవి. ప్రతి స్తంభము మీదను వైష్ణవ గాథలు చిత్రింపబడినవి. ఈ దక్షిణ దిశనున్న స్తంభములమీది శిల్పము శ్రీనివాస కల్యాణము. ఆకాశరాజు కూతురగు పద్మావతీ దేవితో శ్రీ వేంకటేశ్వర స్వామికి వివాహము నిశ్చయింపబడినది. కాని పద్మావతీదేవి ఆయనను "తాము భగవదారాధనము (తదారాధనము) భాగవతారాధనము (తదీయారాధనము) చేసిన పిమ్మటనే నన్ను పెండ్లాడ వలసిన"దని కోరినదట. అప్పు డా స్వామి అహోబిలమునుండి శ్రీ లక్ష్మీ నరసింహస్వామిని తిరుమలకు రప్పించుకొని శాస్త్రరీతి నారాధించినతరువాత భాగవతసమారాధనముగూడ జరిపి పద్మావతీదేవిని వివాహమాడినాడు. ఆ శిల్పసంపద యంతయు ఈ స్తంభములపై నున్నది. ప్రభువులును, దేవేరులును తిలకింపవచ్చును. దీనికి శ్రీనివాసపద్మావతీ కల్యాణ మండపమనియు పేరిడినాము. ఇటు దయచేసి, ఈ స్తంభము శిల్పములను భావింపుడు లక్ష్మీనరసింహస్వామి చెంచులక్ష్మిని పెండ్లాడిన కథాశిల్పము లివి.''

రాయలవా రా శిల్పములను, వాని సౌందర్య రసమును కన్నులతో త్రాగుచున్నట్లు తెప్పవాల్చక చూచుచు ఇట్లనినారు. "ఆహా ! ఈ శిల్పము లెంత మనోహరము లాచార్యవర్యా ! చెంచులక్ష్మి యనుగ్రహము చూఱ గొనుటకు నరసింహస్వామి, ఆమెను బ్రతిమలాడుచున్న శిల్పము నెంత రసవంతముగా నిర్మించినారయ్యా ! నరసింహస్వామి ఎంతటి ప్రణయ మర్మజ్ఞుడో స్పష్టపఱచినారే ! కటికిటాలమీచ నింతటి సుకుమార రసము లను, భావములను తీర్చిన మీ శిల్పులు అపర విశ్వకర్మలనుకొందును. ఇదియేమి ? నృసింహస్వామి ఎనిమిది చేతులతో హిరణ్యకశిపుని చీల్చి మ్రందించుచున్నాడే. ఓహో ! ఇదెంతటి గొప్ప శిల్పము ! రౌద్రరస భూయిష్ఠమైన ఈ శిల్పములను పిల్లలు చూచిన భయపడుదురనుకొందును. వీరెవరు ? రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులా ? యీమె సీతాదేవియా ! ఎంత సహజముగా నున్నారు ! వీరు సుగ్రీవ విభీషణ హనుమదాది రామ భక్తులా ! ఓహో ! వీరు శ్రీమద్రామానుజులా ! మేము వీరి నందఱిని అక్షరములలో చూచి తృప్తిపడుచుందుము. శిల్పిబ్రహ్మలైన మీరు యుగ యుగములనాటి కథలను; వ్యక్తులను స్వ స్వరూపములతో చూపుచున్నారు. మీ శిల్పయోగమెంత ఘనమైనది ! మీ రెంతటి శిల్పతపస్వులు! వీరిచ్చటి వైష్ణవాచార్యులు జీయరులా ! ఇది వెంకణాచార్యులవారి మూర్తి యను కొందును ! ఈ ఆచార్యద్వయము నిట్లు శిల్పించి లోకమున కెంతో యుపకారము చేసినారు. మా శిల్పవిద్యా గురుకులాధిపతుల దర్శనము రాబోవు తరములవారి కగునట్లు చేసిన మీ ఋణమును తీర్చుకొన జాలము." అనుచు అయన తన మెడలోని ముత్యాలహారము నొకదానిని తీసి పురుషోత్తమస్థపతి మెడలో వేసి నమస్కరించెను.

మోహనాంగి స్థపతివర్యులు తపోమూర్తియనియు, శతాధిక మహా మంత్రములను జపించి వాక్కును పవిత్రము చేసికొన్న మహనీయు

డనియు గ్రహించెను. ఆమె ఆ స్థపతివర్యునకు నమస్కరించి దీవెనలు కోరినది. పురుషోత్తమస్థపతి "కల్యాణ సమృద్ధి రస్తు" అని దీవించి "కుమారీ! నీవు కారణ జన్మురాలవు. నీ పితృదేవుల వలె నీవును మహాకావ్య విర్మాత్రివి కాగలవని నాకు తోచుచున్నది. ఇదిగో, ఈ ముత్యాలసరమును స్వీకరించి దీవి నెల్లప్పు డేమఱక ధరించు చుండుము. ఇందైదు ముత్యములు సజీవములు, శుభలక్షణోపేతములునై యున్నవి. ఈ మహేంద్ర నీలనాయకమణి మహిమ కలది. ఈ హారము మీ వంటి వారు ధరింపవలసినదే. అందుకే నాయనగారు నాకు బహూకరించినను, మఱల నా ఆశీస్సులతో దీనిని రా జ కు మా రి కొసంగుచున్నాను. "విజయోఽస్తు" అనెను. మోహనాంగి ఆ ముత్యములపేరును భక్తిమెయి స్వీకరించి వెంటనే కంఠము నలంకరించుకొన్నది. పురుషోత్తమస్థపతి శిలల గుణాగుణముల నెఱింగిన శాస్త్రవేత్త మాత్రమే కాదు; రత్న పరీక్షాదక్షుడును.

ముత్తెములు, ఆణిముత్తెములు, ముక్తారాజములు అని ముత్యములు ముప్పేధములుగా నుండును. ఆ దండలో స్థపతి యూహించిన ఐదు ముత్యములను ముక్తారాజజాతికి చెందినవి. అవి ఐశ్వర్యము నినుమడింప జేయును. నీలములు కూడ మూడు విధముల నొప్పుచుండును. నీలములు, ఇంద్రనీలములు, మహేంద్రనీలములు నని. కా ళి దా సు స్తుతించిన మాతంగకన్య నెఱుగుదుము కదా! ఆమె చేతిలోనిది మాణిక్యవీణ. ఆమెయో, *మహేంద్ర నీలద్యుతి కోమలాంగి. ఆ జగజ్జనని శరీరము, నీ ల వ ర్ణ ము కాదు. ఇంద్రనీల సుందరమును కాదు. మహేమన, మహేంద్ర నీలద్యుతి కలది. ఈ మహేంద్రనీలములు దొరకుటరుదు.

---

*మాణిక్యవీణా ముపలాలయంతీమ్, మదాలసాం మంజుల వాగ్విలాసామ్
మహేంద్రనీలద్యుతి కోమలాంగీమ్, మాతంగకన్యాం మనసా స్మరామి.

దొరకుటవనేల; గనులలో వాని పుట్టుకయే కోటి కొకటిగా సంభవించును. ఇట్టి అనర్ఘ జీవరత్నముల ప్రభావములను రత్నశాస్త్రవేత్త లెఱుంగుదురు. ఈ మహేంద్ర నీలము మనుజునిలో జన్మసిద్ధముగా నున్న గుణములకు, సంస్కారములకు అభివృద్ధిని చేకూర్చును. ఒకడు దుష్టుడైనచో, అట్టి వాడు మహేంద్ర నీలమును ధరించిన యెడల, ఇంకనెక్కువ దుష్టుడు కాగలడు. ఒకడు శిష్టుడై, శిల్పసాహిత్య కవిత్వాది సత్సంస్కారములు కలవాడగుచో, అట్టివాడు మహేంద్రనీలమునుదాల్చిన, వానిలోని శిష్టత్వాది సత్సంస్కారములు క్రమ వికాసము నందును. ఈ రహస్యముల నా స్థపతివర్యుడంతలో నెట్లు గ్రహించెనో మఱి: అట్టి మహేంద్రనీలనాయక మణితో నొప్పుచు పంచముక్తారాజ ప్రభావితమైన ఆ ముత్యముల పేరును రాజకుమారికి ఆశీఃపురస్సరముగా నొసంగును.

రాయలవారు పురుషోత్తమస్థపతికి తాను పసదనముగా నిచ్చిన ముక్తాదామమును, ఆయన వెనువెంటనే రాజకుమారి కొసంగినందుల కాశ్చర్యపడినారు. ఆయన తన మెడలోని హారముల నొకసారి తడవి సవిమర్శముగా చూచుకొనినాడు. ఆయనకు పూర్వ విషయము జ్ఞప్తికి వచ్చినది. అవి జెంకణాచార్యులవారి అపూర్వ కళాసేవలకు మెచ్చు కొని తానా మహాశిల్పికి కనకాభిషేకముచేసి రత్నహారమును సమర్పించి సమ్మానించిన దినములు. ఆ దినములలో ఆ జెంకణశిల్పి తన కీ మహేంద్రనీలమును, పంచముక్తారాజములను నొసంగి వీని సమ్మేళనము అద్భుతైశ్వర్యముల నొడగూర్చుననియు, వీనితో ముత్యాలసరమునుగూర్చి ధరింపుడనియు చెప్పినాడు. ఆ శిల్పసత్తమునకు ఆ రత్నద్వయ సంయోగ మహా మహిమ ఎట్లు తెలిసినదో ! తానట్లే, ఆ రత్నములతో హారమును నిర్మింపజేసి, నాటినుండి ధరించుచుండెను. తదాది తాను పొందిన దిగ్వి జయములకు, చేసిన కళాసేవలకు లెక్కలేదు. సామ్రాజ్యము, ప్రజలు

సర్వసంపదలతో తులతూగజొచ్చిరి. అట్టి ప్రభావముగల తారహారమును తానీనాడు ఆనందము పట్టలేక శిల్పాచార్యుని మెడలో వేసినాడు. ఏదో హారమును వేయుదమనుకొనగా, ఆ హారమే శిల్పికంఠమునలంకరించినది. అయినను, అది మరల ఆ శిల్పీశ్వరుని యౌదార్యముచేత తన కుమారీ రత్నమునకే దక్కినది ఈ విషయము రాయలవారి కానందము చేకూర్చినను, చేసిన బహుమానమునే తిరిగి పరిగ్రహింపవలసి వచ్చెనే యని ఆయన బాధపడకపోలేదు. అయినను అట్లు ప్రతి గ్రహించినది తాను గాక, తన పుత్రిక గదా యని ఒక సంతృప్తిని గూడ రాయలు పొందినాడు. పై రెండు సంఘటనలను బసివి జాగరూకతతో గమనించు చునే యున్నది.

రాయలవారు విద్యానగరమున ఉగ్రనరసింహస్వామిని ప్రతిష్ఠించి తదాలయమును దివ్య శిల్ప విరాజితము చేసి యున్నందున, ఆయనకు అహోబల నరసింహుని మీద భక్తి యధికము. ఒకవేళ రాయలు నరసింహోపాసకుడైనను కావచ్చును. శత్రువిజయమును గోరువారు నృసింహోపాసనము, నృసింహ ప్రతిష్ఠలు చేయుట సహజము.

మరునాడు రాయలవారు సకుటుంబముగా దిగువ అహోబిలము నందలి లక్ష్మీనరసింహస్వామిని దర్శించెను. ఆ స్వామి ఎడమ తొడమీద లక్ష్మీదేవిని కూర్చుండబెట్టుకొని, ఎడమచేతితో ఆమెను చుట్టి ప్రహ్లాదవరదుడై దర్శన మొసగెను. రాయలు ధర్మపత్నీ సమేతముగా ఆ దేవరకు సహస్రనామాది పూజలొనర్చెను. మోహనాంగి "లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్" అను మకుటముగల శ్రీ శంకరాచార్య విరచిత శ్లోకములతో ఆ స్వామిని స్తుతించినది.

కాకతీయ రాజ్యాధీశ్వరుడైన ప్రతాపరుద్రుడు తాను శైవుడైనను ఈ స్వామిని సేవించి కానుక లిచ్చుట ధన్యుడయినాడు. ఆ నాడాయన

ససైన్యముగా విడిది దిగిన గ్రామ మొకటి అప్పటి నుండియు 'రుద్రపర' మను పేర ప్రసిద్ధిగన్నది. రాయలవారచ్చటికిగూడ బోయి, ఆ ప్రాంతపు ప్రజల బాగోగులను విచారించినాడు. రాయలే దైవక్షేత్రమున కేగినను అచ్చటి ప్రజల కష్టనిష్ఠురతలను విచారించి వారికి సాయము చేయుట పరిపాటి.

అహోబలక్షేత్ర సందర్శనము మోహనాంగిలో ఒక అపూర్వ వికాసమును సంపాదించినది. కొండలతోడను, అడవులతోడను నిండిన ఆ ప్రకృతి రామణీయకము, నానా నృసింహ దైవతముల సందర్శనము, భవనాశినీ తీర్థ స్నానపానములు, శిల్ప, వైష్ణవాచార్యుల ఆశీర్వాదములు, పురుషోత్తమస్థపతినుండి ముత్యాలదండను పొందుట - ఇవన్నియు ఆమె మనస్సు నందేవో ముద్రలను హత్తినవి. ఆమె చెప్పనలవి గాని ఒకానొక దివ్యానుభూతి నందినది. రాయల కుటుంబ మంతయు నీ అహోబలక్షేత్ర యాత్ర సఫల మైనదని తృప్తిపడినారు. బసివి, తాను సర్వస్వముగా ప్రేమించెడి మహారాజకుమారికి ప్రాప్తించిన పెద్దల యాశీస్సులును, మహేంద్ర నీలాలంకృత తారహారధారణమును సఫలము కావలయునని తనలో తానే ఎంతగా మురిసిపోయినదో మనకేమి యెఱుక!

మోహనాంగి విద్యానగరమునకు విచ్చేసిన పిమ్మట ఎఱ్ఱాప్రెగడ రచించిన నృసింహ పురాణమును చదువుకొని నరసింహస్వామికి సంబంధించిన విశేషములను సమగ్రముగా తెలిసికొన్నది.

## 4

విజయనగరరాజుల కాలమున అంతఃపురమునందలి దాసీజనమేమి, వేశ్యలేమి ఒక వింతయైన రీతి దుస్తులను ధరించువారు. లోపల గుత్త

మైన లాగులను తొడుగుకొనువారు. అట్లే గుత్తపు రవికలను తాల్చెడి వారు. ఆ లాగులమీద జరీ పూలతోను, రంగురంగుల అద్దకపు పూలతోను ఒప్పునట్టి పావడాలను ధరించెడివారు. అందమైన రవికలను ఆ పై తాల్చెడివారు; వానిమీద సన్నని దువ్వలువలను ఓణీలు వేసికొనెడివారు. ఓణీలు వారివారి సంపత్తినిబట్టి తరతమ భేదముగలవై యుండెడివి. నట్టువరాండ్రు నృత్యము చేయునప్పుడు కట్టిన లంగాలేమి, చీరలేమి పైకి లేచినను లోపలి లాగులు మాన రక్షణము చేయుచుండెడివి; ఒకానొకప్పుడు లంగాలను విప్పివేసినను, లోపల కట్టిన లాగులు అవయవ గోపనము చేయజాలెడివి.

బసివి తన యింటికి వచ్చిన పిమ్మట లోపలిలాగును, గుత్తపు రవికను అట్టే యుంచుకొని పురుషవేషమును ధరించెడిది. ఆ వేషముతో నగరమంతటను సంచరించి అనేక సాంఘిక రాజకీయాది రహస్యములను గ్రహించుచుండెడిది. ఆమెకు కొంతకాలము క్రిందట అరవీటి రామరాజుతో పరిచయము కలిగినది. ఈ పరిచయము విచిత్రముగా జరిగినది. ఆనాడు పురుషవేషములోనున్న బసివి, గుఱ్ఱముపై స్వారీచేయుచు సైనిక శిక్షణాలయమున్న వీథిని పోవుచున్నది. ఆమె గుఱ్ఱమును పలురీతులైన చిత్రగతులతో నడపుచున్నది. ఆనాడామె, సైనికోచితమైన వేషమునే దాల్చి యున్నది. దైవవశమున అరవీటి రామరాజుకూడ ఆ మార్గముననే అశ్వము నెక్కి పోవుచున్నాడు. బసివి గుఱ్ఱము ముందు పోవుచున్నది. రామరాజు గుఱ్ఱ మా యశ్వమునకు కూతవేటు దూరము వెనుక నున్నది. రామరాజు ముందుపోవునది ఎవరో సైనికుడై యుండునని ఊహించెను. అతనిని సైనికుని గలియుటకు తన ఘోటకమును తొందరగనే పరువెత్తింప సాగినాడు. అయినను ఆ గుఱ్ఱము నందుకొనుట రామరాజు గుఱ్ఱమునకు కష్టమే అయినది. ఈ అందుకొనజాలకపోవుట రామరాజున

కొకందుకు మేలే యైనది. అతడు ముందుపోవు గుఱ్ఱపు రేచితాదిగతులను గమనించుటకు వీలు చిక్కినది. దాదాపొక క్రోశమాత్ర దూరము ఆ యిరువురును పయనించిన పిమ్మట, బసివి గుఱ్ఱపునడకను మందము చేసినది. దానితో రామరాజు హయము బసివి గుఱ్ఱముతో గలియ వీలుచిక్కినది. ఇంతలో నక్కడ తిరుగాడు జనులు "అరవీటి రామరాజుగారు అశ్వారూఢులై వచ్చుచున్నా"రని యనుకొనుచు లేచి కేలుమోడ్చి నిలబడ సాగిరి. గుఱ్ఱముపై నున్న బసివిగూడ అజానేయమును దిగి రామరాజునకు నమస్కరించినది. రామరాజు గుఱ్ఱమునాపి పౌరులను ప్రతి నమస్కారముచే సంభావించి, పురుష వేషముతోనున్న బసివిని "మాయింటికి పోవుదము రమ్ము. అశ్వము నెక్కుము" అని తనవెంట తోడ్కొని పోయెను.

ఈ క్రొత్తసైనికుని వాలకము రామరాజునకు విచిత్రముగా తోచినది. అతనికి దాదాపు ఇరువది వసంతములు గడచిన వయస్సున్నట్లున్నది. ఇంకను నూనూగు మీసములైనను మొలకెత్తలేదు. దబ్బపండువంటి యేనిచాయ. ఏనుగు తొండములవలె వృత్తాను పూర్వములైన చేతులు. వలసినంత వెడల్పును, సమున్నతములైన వక్షము, నీడచూచు కొనదగిన లేజెక్కిళులు. దానిమ్మ గింజలవంటి పలువరుస. ఖడ్గధారణము చేత కాబోలును, అఱచేతులు సహజకోమలత నెడబాసి ఈషత్కఠినములై యున్నవి. పొడుగు, దానికి తగినలావు "సమపాళ్ళ"లో నున్నవి. ఇట్టి యాకారము రామరాజు నట్టె యాకర్షించెను. ఆ సైనికునితో రామరాజన్నాడు.

"మీ దే యూరు?"

"మా దొక పల్లెటూరు."

"ఇక్కడి కేల వచ్చితివి ?"

"యుద్ధభటుడుగా శిక్షణ పొందుటకు,"

"శిక్షణ పూర్తియైనదా ?"

"చాలవఱ కైనట్లే !

"ఏ యే విద్యలలో నేర్పు గడించినావు ?"

"కఱ్ఱసాము నేర్చుకొన్నాను. ఖడ్గము త్రిప్ప నలవాటైనది, కుస్తీ పట్లను కొంతవఱకు నేర్చితివి."

"కొంతవఱ కనగా నెంతవఱకు ?"

"ఎదిరిపీటీ మన్నుచేయు నంతవఱకు"

"ఇంక ?"

"గుఱ్ఱముపై స్వారీచేయుచు కత్తి విసరుట, ఏనుగు నెక్కి బల్లెముతో యుద్ధ మొనర్చుట అలవడినది. కుంతములను ప్రయోగింప గలను. ఈటెలను విసరగలను. చక్రాయుధములను వాడగలను. చంద్ర హాసముతో విహరింపగలను. పదాతినై యుద్ధస్వామిని కాపాడు మార్గము లను గూడ నేర్చితివి."

"చాల సాధించినావే ! మఱి సైన్యములో చేరగలవా ? మంచి వేతన మేర్పాటు చేయింతును."

"చేరజాలను. నాపై ప్రభువుల కింత యనుగ్రహ మెందులకో ఊహింపలేకున్నాను."

"అది నీ కనవసరము. నీ కుపకారము చేయవలయునని సంకల్పము కలిగినది. చేయదలచినాను. అంతే !"

"నే నెవరికై నను అంగరక్షకుడుగా పని చేయ దలంచుచున్నాను గాని, యుద్ధభటుడుగా చేరదలంచుట లేదు."

"ఎందుచేతనో ?"

"యుద్ధభటునికన్న, అంగరక్షకుని బాధ్యత దొడ్డది. అతడు స్వామి ప్రాణములను రక్షించునట్టి యుత్తమకార్యమును బూనియుండును."

"మఱి అంగరక్షక శిక్షణముగూడ నందినావా ?"

"ప్రధానముగా అందినది అదే !"

"మఱి నా కంగరక్షకుడుగా నుందువా ?"

"దేవర అనుగ్రహమున్న !"

"నీ పేరేమి ? నీవు ఆంధ్రుడవా ? కర్ణాటకుడవా ?"

"నా పేరు రుద్రప్ప, నాకు ఆంధ్ర కర్ణాటకములు రెండును తెలియును."

"నీవు దినమున కొక్కసారియైనను నాతో గలియుచుండ వలయును."

"అట్లే"

నాటినుండియు రుద్రప్పకును, రామరాజునకును పరిచయము గాఢమైనది. వారి స్వామి భృత్యభావము దినక్రమమున స్నేహముగా పరిణమించినది. రోజున కొక్కసారి యైనను రుద్రప్ప యగపడకున్న రామరాజున కేమియు తోచదు. రుద్రప్ప ఎప్పుడును సైనిక వేషముతోనే రామరాజు వద్దకు రాకపోకలు సేయుచుండును. రుద్రప్ప కంఠస్వర మించుక కోమలముగా నున్నను, అది యాతని గొంతు తీరనుకొన్న రామరాజు రుద్రప్ప స్త్రీ యని ఎన్నడు నూహ చేయలేదు.

రామరాజున కిప్పుడు పెండ్లివయస్సు మీఱినది. ఎన్నో మనువులు వచ్చుచున్నను, ఆత డెందులకో అంగీకరించుట లేదు, తండ్రి శ్రీరంగ రాజు పెండ్లి చేసికొమ్మని తొందర పెట్టుచున్నాడు. ఇంటిలో తల్లి ప్రతి దినమును పోరుపెట్టుచునే యున్నది. వా రిరువు రీ సంగతిని రుద్రప్పతో చెప్పి, రామరాజు హృదయమును పెండ్లిపైకి త్రిప్పవలసినదని కోరి నారు. ఒకనాడు రామరాజు రుద్రప్పతో చదరంగ మాడుచుండగా రుద్రప్ప పెండ్లిప్రస్తావన తెచ్చినాడు. రామరాజు తనకు తగిన కన్నె దొరకినచో వివాహమాడుదు నన్నాడు.

"తగినకన్నె యనగా, దేవకన్యయా? అప్సరసయా? నాగ విలాసినియా? లేక వీరి యందఱి చక్కదనములను కలిపి కరగపోసి చేసెడి బ్రహ్మదేవుని భావిసృష్టిలో వగలాడియా?"

"వారెవ్వరును కారు: వారందఱి లక్షణములు ఏ స్త్రీ యందుండునో, అట్టికన్నె దొరకిన నా బ్రహ్మచర్యము వివర్తించును."

"అబ్బా! పెద్ద కోరికయే యున్నదే! అట్టి యామెకు చదువు రాకున్నను ఇష్టమగునా?"

"ఆమె కొక్క చదువేకాదు. సంగీతము, కవిత్వము, చిత్ర లేఖనము, చదరంగము ఇత్యాది కళలన్నియు అలవడి యుండవలయును. అట్టి యామె దొరకకయే ఇంతవఱకును పెండ్లి ప్రయత్నమునకు పూన లేదు.

"ఒకవేళ, అట్టి స్త్రీ దొరకదనియే అనుకొందము; అప్పుడు దేవర వా రేమి చేయుదురో?"

"ఏమి చేయుదురు? వివాహమే మానుకొని ఏ జంజాటము లేకుండ సామ్రాజ్య కార్యములు చూచుకొందురు"

"అంతటి దీక్ష పూనినారా ప్రభువులు !"

"అవును"

"మఱి, అట్టికన్యను వెదకుడని తండ్రిగారికి చెప్పవచ్చునుగదా !"

"నా కోరికను విన్న నవ్విపోదురు గదా ! ఎట్లు చెప్పుదును ?"

"మఱి నా కేల చెప్పినారు ?"

"అర్హతను బట్టి !"

"అయినచో, నన్ను కన్యాన్వేషణము చేయుమందురా ?"

"సాధ్యమని తోచిన, చేయవచ్చును."

రామరాజు తనకు కావలసిన అర్ధాంగలక్ష్మివిగూర్చి ఇన్ని కోరికలు పెట్టుకొన్నాడని విన్న రుద్రప్పకు అతడు రాకుమారిమీద మనసుంచి నాడా ! అని అనుమానము కలిగినది. అయన కోరిన లక్షణములుగల పిల్ల ఒక్క మోహనాంగియే !

# 5

శ్రీ మన్మమహా రాజాధిరాజ రాజపరమేశ్వర విద్యానగర వజ్రసింహాసనాధీశ్వరులైన శ్రీకృష్ణదేవరాయలకు సాళువ తిమ్మరుసయ్య సర్వశిరఃప్రధాని. రాయలవారివద్దనేమి, సామ్రాజ్యమున నేమి తిమ్మరుసు మంత్రీశ్వరుని అధికార ప్రాభవములు సాటిలేనివి. అయన మాట కెవ్వరును ఎదురు చెప్పరు. ఒకనాడు ఒకభట్టరాజు పదిరెండేండ్లవాడయిన తన కుమారుని వెంటనిడుకొని తిమ్మరుసు మంత్రీశ్వరుని దర్శనమునకు వచ్చి తన రాకనుగూర్చి నివేదించుకొనుచున్నాడు.

"అయ్యా ! మాది భట్టుపల్లె యను గ్రామము. నా పేరు ప్రబంధాంకము సూరపరాజు. నేనేదో కావ్యములవీ చదువుకొన్నాను.

కవిత్వము గూడ కొలదిగా వ్రాయగలను. అయా గ్రామములలో పురాణములు చెప్పుచుందును. ఇతడు నా ఏకైక పుత్రుడు. పేరు భట్టుమూర్తి. నా వద్దనే తెలుగు చదువుకొనినాడు. అంతో యింతో కవిత్వము వ్రాయగలడు. సంగీతము చక్కగా పాడగలడు. నిఱుపేదలమయినందున ప్రభుదర్శనము నపేక్షించి వచ్చినాము. తాము దయ చూపి రాయలవారి దర్శనము చేయించు నెడల, పిల్లవాడు వారి యనుగ్రహముచేత తన సంగీత సాహిత్యములను వృద్ధి చేసికొనగలడను కోరికతో వచ్చినాను. తాము మా యందు కరుణ చూపి ప్రభుదర్శన మిప్పింతురని ప్రార్థించు చున్నాను."

తిమ్మరుసు దండనాథుడు మంచివాడే; సాహిత్యాభిమానియే. అభిమానియే యేమి! సంస్కృతాంధ్రములయం దసామాన్య పాండిత్యము కలవాడు. అగస్త్యకృతమగు సంస్కృత 'బాలభారతము'నకు 'మనోహర' మను పేరుగల వ్యాఖ్యానమును వ్రాసి, సాహిత్యనిర్మాతల శ్రేణిలోచేరిన వాడు. అష్టదిగ్గజములతో విలసిల్లు రాయలవారి భువన విజయమును నడపు ధీశాలి గదా యతడు! ఆనాడాతనిబుద్ధి రాజకీయాలోచనతో వ్యాకులమై యున్నది. ఆ పితా పుత్రులు వచ్చిన దుర్ముహూర్తమెట్టిదో గాని, వారిపై తిమ్మరుసునకు ఆగ్రహము కలిగినది. ఆతడిట్లనినాడు.

"రాయలవారు కవులను పోషించుచున్నారని ప్రతివారికిని, నేడిది యొక ఆట యైనది. నేడందఱును కవులే. ఏ మహాకవినో ఆశ్రయించి రెండు పద్యములు వ్రాయించుకొని వచ్చుట, అవి రాజుగారికి వినిపించుట, బహుమానములు పొందుట, మేము రాజ బహూకృతులమని డప్పు వాయించుకొనుట-నేడు నాలుగక్కరములు నేర్చిన ప్రతివానికిని పరిపాటి యైనది. రాజదర్శనమట! రాజదర్శనము! మాకు రాజ్య కార్యములు

చూచుకొను పనిపాటు లేవియు లేవన్నమాటః మీవంటివారిని స్రమాట్టుల వద్దకు కొంపోవుటకే మే మీ మంత్రిపదవి నధిష్ఠించి యున్నామన్నమాటః షో ః పొండు, ప్రభు దర్శనము లేదు, గిభు దర్శనము లేదు."

మొదట తిమ్మరుసుకూడ నిఱుపేదయే. వారిది గుత్తిదుర్గము. అక్కడ ఆయన తల్లి నాగమ్మ భర్తచనిపోయిన పిమ్మట విస్తళ్ళు కుట్టుకొని జీవించుచు తన బిడ్డలను పోషించుకొన్నది. అటనుండి చంద్రగిరికి వచ్చి వారములు చెప్పుకొని తినుచు తిమ్మరుసయ్య చదువుకొనినాడు. తరువాత పెనుగొండలోని యొక సత్రమున భుజించుచు విద్యలు నేర్చినాడు. ఆ యా దుర్గాధిపతుల ప్రాపువలన వృద్ధినందినాడు. పిమ్మట సాళువ నరసింహరాయలకడ ప్రధానమంత్రిగనున్న చిట్టిగంగనామాత్యుని యండ దండలు సంపాదించుకొని యుద్యోగములో చేరినాడు. అటు పిమ్మట తుళువనరసరాయలయు, వీరనరసింహరాయలయు అనుగ్రహమునకు పాత్రుడై కృష్ణరాయలనాటి కాయన చెంత సర్వశిరఃప్రధాని పదము నలంకరించినాడు. రాయలవారి నాశ్రయించినప్పటినుండియు ఆయన దశ ఎత్తుకొన్నది. ఆయనయే కాదు, రాజులనాశ్రయించిన యెవ్వరు కాని అసాధారణైశ్వర్యములతో తులతూగవలసినదే ః పెద్దనాదులేమి, చెంకణాది శిల్పులేమి, తక్కుంగల కళారాధకులేమి ఇందుకు నిదర్శనము. అందుకనియే ప్రతివారును రాయలవారి దర్శనమును, వారి ఆశ్రయమును సంపాదింప నువ్విళ్ళూరు చుందురు. నేడు సూరపరాజుగూడ ఆ యుద్దేశ్యముతోనే వచ్చినాడు. సూరపరాజు వచ్చునప్పుడు, దారిలో కుమారునికి తిమ్మరుసుగారి చిన్ననాటి వృత్తాంతమంతయు చెప్పినాడు. కడు బీదటికము నుండి ఆయన పైకి వచ్చినాడనియు. అట్లే నీవును ఉన్నతోన్నత స్థానమును పొందవలయు ననియు కుమారునికి బోధించినాడు. కష్టముల నెదుర్కొనుచు గట్టెక్కిన తిమ్మరుసయ్య కష్టములలోనున్న తమకు

సాయపడడా యని ఆ తండ్రీకొడుకులు తలంచినారు. చివరకు కథ యిట్లడ్డము తిరిగినది. ఈ సంఘటనము కుఱ్ఱవాడగు భట్టుమూర్తి కాగ్రహ మొదవించినది. అతడు ముందువెనుక లారయక అశుకవిత్వముతో తిమ్మరుసు చిన్ననాటి కడగండ్లనుగూర్చి యిట్లెత్తిపొడిచినాడు.

"గుత్తిం బుల్లెలు కుట్టి, చంద్రగిరిలో కూడెత్తి, పెన్గొండలో
హత్తిన్సత్రమునందు వేడి, బలు దుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైన ఘనులన్ దీవింప...."

పద్య మింతవఱకు వచ్చునప్పటికి తిమ్మరుసయ్య చకితుడైనాడు. ఈ భట్టుపిల్లవానికి తన చిన్ననాటిచరిత్ర మెట్లు తెలియునా యని ఆశ్చర్య పడినాడు. పద్యములో నున్నదంతయు తనకథయే! ఆతడు వేగిరపాటుతో

"బాబూ, తిట్టకుము. మీరు కోరినట్లు ప్రభుదర్శనము చేయింతును. మీ పిల్లవానికి సంగీతముకూడ వచ్చునంటివిగదా! సంగీత సాహిత్యము లున్న వారిని రాయలవారు మిక్కిలిగా ప్రేమింతురు." అని బుజ్జగింప బూనుకొనెను. అప్పు డానందముతో భట్టుమూర్తి మిగిలిన పద్యభాగము నిట్లు పూరించినాడు—

.... .... .... .... .... దీవించెదన్
మత్తారాత్యభియాతి నాగమ సుతున్ మంత్రీశ్వరున్ దిమ్మనన్."

పిల్లవాని దుడుకుతనమునకు సూరపరాజు చాల బాధపడుచుండెను. తిమ్మరుసయ్య, రాయలవారితో చెప్పి తమ కెట్టి శిక్ష వేయించునో యని యాతడు కలతపడుచుండెను. కాని చివరకు తిమ్మరుసు కొండ దిగి వచ్చుట, కుమారుడు పద్యమును శుభాంతము చేయుట, సూరపరాజునకు సంతోషము గూర్చినవి. అంతట భట్టుమూర్తి తిమ్మరుసు నింకను ప్రశాంతచిత్తుని చేయదలంచి ఇట్లు పొగడినాడు.

"అయ్య యనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయ నృపకుంజరుచే
అయ్యా, నీ సరి యేరీ !
తియ్యని విలుకాఁడ వయ్య, తిమ్మరుసయ్యా !"

ఈ పద్యమును వినునప్పటికి తిమ్మరుసు పొందిన యానందమింత యని వర్ణింపలేము. ఆ కాలము వారికి పొగడు పద్యములు చెప్పించుకొను నుత్సాహ మెక్కుడు. కవులుగూడ పొగడ్తలచేతను, అవసరమైనచో తెగడ్తలచేతను తమ పనులను నెఱవేర్చు కొనుచుండెడివారు.

భట్టుమూర్తి సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడును, కవియును కావలయునని సూరపరాజు నుద్దేశ్యము. అయన అల్లసాని పెద్దనా్నాశ్రయించి తనకుమారునికి సంస్కృతమును బోధింపవలయునని ప్రార్థించెను. అందులకా ఆంధ్రకవితాపితామహుడు సంతోషముతో నంగీకరించెను.

# 6

మహారాజ్ఞి తిరుమలదేవి శ్రీకృష్ణదేవరాయలవారితో మోహనాంగి వివాహమునుగూర్చి ప్రస్తావించినది. ఆ ప్రస్తావనలో వరదాదేవికిని అచ్యుతదేవరాయలకును, సలకము చినతిరుమలరాజునకు మోహనాంగిని చేసికొనవలయునని యున్నట్లు సూచించినది. తిరుమలదేవి చేసిన ఈ పెండ్లి ప్రస్తావన రాయల హృదయమున ఆలోచనలను రేపినది.

రాయలకు దండయాత్రలలో సాయపడిన వారిలో సలకమువారే గాక— మట్ల, అరవీటి, ఔకు, నంద్యాల, వెలుగోటి, పెమ్మసాని బూదహాళి, తొలగంటి, గొబ్బూరి, రావెళ్ళ — మొదలగు నింటిపేరుల వారున్నారు. వీరిలో వెలుగోటివారు వెలమరాజులు. పెమ్మసానివారుకమ

వారు. ఇక తక్కినవారందఱును రాజబంధువులు అయినను వారిలోగూడ మంచి సెబ్బరలు చూచుకొనవలదా! బూదహాళి వారికి కులభేదములను పాటించుట ఇష్టముకాదు. వారు మానవులంద ఱొకటే యనియు, గుణా గుణములను బట్టియు, చేసెడి పనులను బట్టియు, హెచ్చులొచ్చు లెంచ వలయు ననియు తలంచువారు. అందుచేత తమ యుద్దేశ్యములతో నేకీభవించువారితో మాత్రమే వారు సంబంధ బాంధవ్యములు నెఱపు చుండెడివారు. ఇట్టివారింక కొందఱున్నారు.

కాని, రాయలవారు వేదమార్గప్రతిష్ఠాపకులుగదా! కులగోత్రములను తు. చ. తప్పక పాటింపరా ? పూర్వము కొందఱు రాజులవలె ఆయన వర్ణాశ్రమ ధర్మ రక్షణము చేసినాడని కొందఱి యభిప్రాయము. నిజ మాలోచించిన రాయలవారి వేదమార్గస్థాపకత్వము దేవాలయాది నిర్మాణము నందేకాని, కులభేదములను బలపఱచుటలోకాదని కొందఱి తలంపు. ఇందుకు బలముగూర్చు నంశము రాయలు వైష్ణవు డగుటయే. వైష్ణవ మతములో కులభేదములకు పాటింపులేదు. మానవుడు విష్ణుభక్తుడగుచో అట్టి వా డే కులమునకుచెందినను సర్వాధికుడే. ఆళ్వారులలో పంచముడగు తిరుప్పాణాళ్వారును, అందఱును నెత్తిపై బెట్టుకొని కొలిచినారు గదా! శ్రీ మద్రామానుజులకు తిరుకచ్చినంబి యను వైశ్యుడు గురుప్రాయుడు. గురుప్రాయుడేమి, గురువే! ఇట్టి మతమును స్వీకరించిన రాయలేనా, వర్ణనియమ ప్రతిష్ఠాత !

ఎట్లైన నగుగాక, మోహనాంగిసంబంధము రాయలకొక సమస్యయే యైనది. ఎట్లు కాకుండును? కన్యాజనకుల కోరికలు భూములుపట్టనివి. తమ కూతుండ్రు సర్వసౌఖ్య సంపదలతో తులతూగుచుండవలెనని వారు తలంతురు అందును రాజాధిరాజుల తలంపు లెట్లుండునో చెప్ప బనిలేదు. వారు వీరత్వప్రియులు, వీరవర్గమును వెదకుచుందురు. ఇది సామాన్య

రాజులు చేయుపని. రాయలు రాజమాత్రుడా! సాహితీ సమరాంగణ సార్వభౌము డాయెను. ఇట్టి వానికి కావలసిన జామాత ఎట్టి లక్షణములు కలవాడైనచో ఆయనకు నచ్చును! అందును ఆ రాజకుమారి అపర సరస్వతి యాయెను. ఆమెలో రాయలవారు గోదాదేవి దివ్యస్వరూపమును దర్శించుచుండును గదా!

రాయలవారికి యుద్ధములందు సాయపడినవారిలో ఆరవీటి వారగ్రే సరులు. ఆరవీటి వంశము తాత ముత్తాతల నుండియు పౌరుష ప్రతాపము లకు పేరుపడినట్టిది. ఆరవీటి బుక్కరాజు మహాపరాక్రమశాలి. ఆయన కుమారుడు రామరాజేమి, తత్పుత్రుడు శ్రీరంగరాజేమి, అసమాన శౌర్య ధైర్య పరాక్రమములు గలవారే. శ్రీరంగరాజు, రాయలవారియన్న వీరనరసింహరాయలకు సంగ్రామములందు తోడ్పడిన మహావీరుడు. ఈయన కుమారులైన కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటాద్రిరాజు పంచపాండవులవంటివారు. వీరిలోతృతీయుడు రామరాజు. అతనిది తాతగారిపేరు. తాతను ముత్తాతనుగూడ మించిన పరాక్రమ మాతనిది. రాయలవారి దృష్టిలో తనపెద్దకూతు నుద్వాహమాడదగినవారు ఇద్దఱే యిద్దఱున్నారు. వారిలో నొక్కరుడు, అచ్యుతరాయల బావమఱది చినతిరుమలుడు. రెండవవాడీ రామరాజు. సలకము తిరుమలరాజు దగ్గఱి చుట్టము. తన తమ్మునికి బావమఱదియేగదా! రామరాజో, అంత దగ్గఱి చుట్టము కాదు. అయిననేమి, అతని శౌర్యము సామ్రాజ్యమునకు రక్షకవచము. అతనిని దండనాయకునిగా జేసికొని రాయలవారాయా యుద్ధములను నడపినాడు. చినతిరుమలుడును తక్కువవాడు కాడు. ఈ సలకము సోదరులు గూడ అచ్యుతరాయల చుట్టఱికమునుబట్టి సామ్రాజ్య విస్తరణ సందర్భమున బాగుగా తోడ్పడినవారే. ఈ విషయముల నన్నింటిని గాఢముగా ఆలోచించిన రాయలు తిరుమలదేవితో నిట్లనెను.

"దేవీ ! శ్రీఅరవీటి రామరాజు పరాక్రమము మన మెఱుగనిదికాదు! నీవే ఆలోచింపుము. చినతిరుమలరాజు యోగ్యుడో! రామరాజుయోగ్యుడో! ఈ విషయమతి జాగరూకతతో నిర్ణయించవలసినది గదా!

"ఔనండీ! రామరాజువయస్సెంతయో నాకుతెలియదు. తిరుమలుని వయస్సు ఇరువదియై దిరువది యాఱుండ వచ్చునని చెల్లెలు చెప్పినది. వధూవరులకు వయోగుణరూపములలో సామ్య ముండవలయునుగదా!"

"రామరాజునకు ముప్పదియేండ్లు దాటియుండవచ్చును. తిరుమలుడు నూనూగుమీసాల నూత్న యౌవనములో నున్నాడు. రామరాజునకు మీస కట్టు మెలితిరిగి, కోరలేర్పడు చున్నవి."

"మఱి అమ్మాయి ఈడునకు మించిన వయస్సుగదా రామరాజుది. తిరుమలరాజైనచో వయస్సుకూడ సరిపడి దంపతు లిరువురు చిలుకా గోర్వంకలవలె నుందు రనుకొందును. మీరె ఆలోచింపుడు."

"నీ వన్నమాట నిజమే కాని, తిరుమలుని కింకను చిన్నతనపు చేష్టలే పోలేదు. మానిసి బాల్యమునుండియు కొంచెము దుడు కనిపించు కొన్నట్లు వింటిమి. వరుని కన్నింటికంటెను శీలము ముఖ్యముగదా!

"మఱి చినతిరుమలరాయని వదలి, రామరాజు నెన్నుకొన్నచో మీతమ్మునికిని, మఱదలికిని, తక్కిన బంధువర్గమునకును కోపమురాదా? ఇది ఏ యొడుదొడుకులు లేక సాగిపోవు రాజకుటుంబమున పొరపొచ్చె ములకు తావిచ్చునేమోకూడ యోజించుకొనవలసి యున్నది."

"ఔను, మనము గట్టిచిక్కులో నేపడినాము. అయిన సంబంధమును విడిచి క్రొత్తదానికి పరుగిడుట అనర్థములకుమూలమగునేమో, ఆలోచింప

వలసినదే; అయినను అమ్మాయి ఇష్టమునుగూడ తెలిసికొన్న తరువాతనే నిశ్చయము చేయుదము"

తిరుమలదేవి వయోరూపములనే చూచుచున్నది గాని, శీలమునకు ప్రాధాన్యమిచ్చుటలేదని రాయలు గ్రహించినాడు. స్త్రీలకు సాధారణముగా వయోరూపముల మీదనే దృష్టి యుండును. వారు తినుటకును, కట్టుటకును లోటు లేకుండుటకు గూడ చూతురు. తండ్రి, విద్యా, గుణ శీల పౌరుష ప్రతాపములకు ప్రాధాన్యమిచ్చును. చుట్టములు కులగౌరవమును చూతురు. తదితరులు ఇష్ట మృష్టాన్నములు లభించునా, లేదా యని చూతురు. ఇక కన్నియలో, తమ వరులు రూపవంతులో, కారో యని చూచుకొందురు. ఇది లోక సామాన్యవిషయము.

ఇంతలో రాయలవారి కింకొకఆలోచనము తట్టినది. తన కిరువురు కూతుండ్రున్నారు. పెద్దపిల్లను రామరాజునకిచ్చి చిన్నపిల్లను తిరుమల రాజున కిచ్చినచో, సమస్య తీరిపోవునుగదా; అప్పుడు మాత్రమేమగును? పెద్దపిల్లకీడైన తిరుమలుడు, చిన్నపిల్ల కెట్లీడగును? అదియును గాక, చినతిరుమలుని శీలవిషయమున తా ననుమానించుచున్నాడు గదా; శీల రహితునితో ఆ బిడ్డ యెట్లు వేగించును? తిరుమలుని సంబంధమును వదలుకొన్నచో, కుటుంబమున కలహములకు తా వేర్పడునేమో యని పట్టమహిషి సూచించినది. అదియును నిజమే; రాయలవారి కెట్లును పాలు పోలేదు. ఆయన మనస్సు వ్యాకులమైనది. మహాకావ్య నిర్మాణమొనర్చి నానావిధపాత్రములను చిత్రించు చతురునకు స్వవిషయమువచ్చునప్పటికిని సమస్యలకు పరిష్కారమే చిక్కలేదు. ఈ పరిష్కారము కుదురకుండుట కంతటికిని ప్రధాన కారణము బిడ్డలయందాయన కున్న సాటిలేని వాత్స ల్యమే. రాయల కారేయి నిద్దురపట్టలేదు. తిరుమలదేవి భర్తృదేవునితో బాటు తానును జాగరము చేసినది. ఎట్లెట్లో తెల్లవాఱినది.

# 7

శ్రీకృష్ణదేవరాయలు, మనస్సు వ్యాకులముగా నున్నప్పుడు భువన విజయ సభనుదీర్చి కవులతోను, కళాకారులతోను వినోదించుచుండును. ఆ మనోవ్యాకులత కది యొక మందు. ఈ సాహిత్యౌషధీసేవ రాయలకే కాదు, ఎల్లరకును మన స్స్వాస్థ్యము నందించును. ఒకానొకప్పు డాయన కావ్యపఠనమునకు పూనుచుండును. కావ్యముచేత వ్యవహార జ్ఞానము కలుగును గనుక, ఆయన ఆ పని చేయుచుండును. రామాయణ భారతాదులలోని అనేకోపాఖ్యానములను చదువుటచే హృదయానందము కల్గుటయేగాక, కర్తవ్యజ్ఞానము గూడ జనించును గదా ! నాడు రాయలు భువనవిజయ సభ నేర్పాటు చేయించినాడు. నాటి సభానిర్వాహకులైన మహామంత్రి తిమ్మరుసయ్య —

"ఆంధ్రకవితా పితామహులగు అల్లసానివారు, సార్వభౌములను ప్రశంసింతురని భువన విజయము కోరుచున్నది" అనెను. అంతట పెద్దన పద్యమును చదివి వ్యాఖ్యానింప బూనుకొనెను.

"శరసంధాన బల క్షమాది వివిధైశ్వర్యంబులుం గల్గి, దు
ర్భరషండత్వ, బిలప్రవేశ, చలన, బ్రహ్మఘ్నతల్ మానినన్,
నర, సింహ క్షితిమండలేశ్వరుల నెన్నన్ వచ్చు నీ సాటిగా
నరసింహ క్షితిమండలేశ్వరుల కృష్ణా ! *రాజకంఠీరవా"

రాయలవారిని ధనుర్విద్యలో అర్జునునితో పోల్తమన్నచో, ఆ నరు డూర్వశీ శాపమువలన పేడియైనాడు. బలములో సింహముతో నుప

---

*రాజసంక్రందనా : అని పాఠాంతరము.

మింతమన్న అది గుహలో దూరి కూర్చుండును. ఓర్పు మున్నగు గుణములలో భూమిని సాటిగా చెప్పుదమన్న, అభూమి చంచలస్వభావము కలదైనది. ఐశ్వర్యమున పరమేశ్వరునితో పోలిక చెప్పుదమన్న, ఆయనకు బ్రహ్మహత్యా పాతకమున్నది. అర్జునాదులు తమలోని లోపములను బోగొట్టుకొన్ననేగాని రాయలవారికి సాటిరారు.

పిమ్మట తిమ్మరుసు, "తిమ్మకవీంద్రులు రాయలవారు తమిళ కన్నడదేశములను జయించిన వృత్తాంతమును వర్ణింపవలయునని సభ వేడుక పడుచున్నది." అనినాడు. తిమ్మన యిట్లు వర్ణించెను—

"శ్రీరంగేశ్వరు నాభిపంకజ రజశ్శ్రీకంబె, చోళేంద్రక
న్యారాజత్కుచపాళి కుంకుమముకన్నన్, సహ్యాభూభృత్తటీ
నీరంధ్రోజ్జ్వల గైరికద్రవముకంటెం గెంపు గావించె, కా
వేరీతోయము కృష్ణరాయఁ డహితోర్వీనాథ రక్తప్రభన్."

"కావేరీనీరము రాయలవారు చంపిన శత్రువుల నెత్తుటిచే నెఱ్ఱబడి నట్లు, రంగనాథస్వామి బొడ్డుదామర పుప్పొడిచేగాని, చోళస్త్రీల కుచ కుంకుమములచేగాని, సహ్యాద్రి మీది గైరికధాతు ద్రవముచేగాని యెఱ్ఱ బడలేదు."

రాయలకు ఈ ఆత్మస్తుతివిన యిష్టములేకపోయినది. తిమ్మరుసు ఈతూరిగూడ తన్ను స్తుతించు డనియే కవులను గోరునేమోయని తలంచి తానే జోక్యము చేసికొని—

"వక్త్రింబుల్ పది, కన్నులైదు, కరముల్ వర్ణింపగా వేయగున్."

"కందుకూరి రుద్ర కవీంద్రు లీ సమస్యను పూరింపగోరు చున్నాము" అనెను.

అంతట రుద్రకవి ఆ సమస్య నిట్లు పూరించెను.

"ఈక్ష్మాప్రాసము కష్టమౌ ననక యుర్వీశాను లీ రీయఁగా
*వాక్ప్రాసం బిది సత్కవీశ్వరులఁత్రోవ ల్గామి, నేఁజెప్పెదన్;
దిక్పాలారాతికిఁ బార్వతీశ్వరులకున్, దిగ్మప్రభారాశికిన్,
వక్త్రంబు ల్పది, కన్నులైదు, కరముల్ వర్ణింపఁగా వే యగున్."

పెద్దన - తిమ్మనార్యులొనర్చిన రాయల వర్ణనమునకును, రుద్రకవీంద్రుడొనర్చిన సమస్యాపూర్తికిని భువనవిజయ సభాంగణము ఆనంద పులకితమైనది. ఈకవితా వినోదములు రాయలవారి మనస్సును రంజించినట్లు లేవు. ఆయన దృష్టి ధూర్జటిగారిమీదికి ప్రసరించినది.

"ధూర్జటిగారిటీవల అంతర్ముఖులై కాళహస్తీశ్వర శతకమును వ్రాయుచున్నట్లు వినుచున్నాము. అందలి కొన్ని పద్యములను వినవలయునని కుతూహలముగా నున్నది," అనెను.

అంతట ధూర్జటి యిట్లు చదివినాడు.

"మదమాతంగము, లందలంబులు, హరు ల్మాణిక్యము, ల్పల్లకుల్,
ముదితల్, చిత్రదుకూలముల్, పరిమళంబు ల్మోక్ష మీఁజాలునే!
మదిలో వీని నపేక్ష చేసి నృపధామ ద్వారదేశంబు గా
చి, దినంబుల్ వృథ పుత్తు రజ్ఞు లకటా! శ్రీ కాళహస్తీశ్వరా!"

దిక్పాలారాతి = దిక్పాలురకు విరోధియైన రావణుడు, వక్త్రము = ముఖము, కరము = కిరణము, చేయి, తిగ్మప్రభారాశి = సూర్యుడు.

రావణునికి పది ముఖము లనియు, పార్వతీపరమేశ్వరుల కిరువురికిని ఐదు కన్నులనియు, సూర్యునికి వేయి కిరణములనియు సమస్య క్రమాలంకారములో పూరింపబడినది.

---

*వాక్ప్రాసము = మాటలలో పిఱికిదనము.

సాధారణముగా ఏ నాటికైనను మనుజుని చిత్తమునకు ఇహ సౌఖ్యములు వెక్కసము గాకపోవు. అప్పుడాతడు ఆత్మానందము దిక్కునకు మరలి తీరును. ఇది మానవ మనోలక్షణము. కనుకనే యీ పద్య భావము సభ్యుల నందఱిని ఆకట్టినది. పిమ్మట ధూర్జటి రెండవ పద్యము నిట్లు చదివినాడు.

"కొడుకు ల్బుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకు ల్బుట్టరె కౌరవేంద్రున కనేకుల్, వారిచే నే గతుల్
వడసెం, బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్ ?
చెడునే మోక్షపదం బపుత్త్రికునకున్ ? శ్రీ కాళహస్తీశ్వరా !"

రాయలవారికిప్పటికి మగసంతానము లేదు. ఆ చింత ఆయన మనస్సు నేర్చుచునే యున్నది. ఈపద్యము వినునప్పటికి రాయలమనస్సు కలకదేరి ఒక యానందస్థితిని సంతృప్తిని పొందినది. ఆయన కొంచొక మనశ్శాంతి నందుకొన్నట్లు, ధూర్జటి వింక ఒండు రెండు పద్యములు చదువగోరినాడు. ధూర్జటి యిట్లు చదివినాడు.

"ఆలంచున్మెడఁగట్టి, దానికి నపత్యశ్రేణిఁగల్పించి, త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొను సంబంధంబు గావించి, యా
మాలర్కంబున బాంధవం బనెడి ప్రేమం గొందఱం ద్రిప్పఁగా
సీలన్ సీల యమర్చిన ట్లొసఁగితో! శ్రీ కాళహస్తీశ్వరా!

ఈ పద్యము పూర్తిగా రాయలవారి ప్రస్తుత మనఃస్థితికి తార్కాణముగా సరిపోయినది. ఆయన కూతుంద్రకు వరాన్వేషణములో మునిగి యున్నాడు. అందుకు తా నేదో కర్తయై వారిని సర్వోన్నతలను జేయ జూచుచున్నాడు. ఇది సమంజసమా? విష్ణుచిత్తీయము వ్రాసిన తనకేనా

యిట్టి అహంకారము ! తాను విష్ణుచిత్తు నెట్లు తీర్చినాడు ! అతడెంత నిరహంకారి. పాండ్యరాజు సభలో వా ద ము సలుపుమని సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే ఆదేశించినను—

"గృహ సమ్మార్జనమో, జలహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వా ల్లభ్య లభ్య ధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్ర ధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ! వాదములేల. లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్ !"

అట్టి విష్ణుచిత్తుని చిత్రించిన తనకేనా యీ అహంకార ముండవలసినది ? గోదాదేవి వివాహసందర్భమున అత డవలంబించిన వై ఖరి యేమి? ఇది యంతయు తన కావ్యములో తాను వ్రాసినదే కదా ! స్వవిషయమున ఆచరింపవలసి వచ్చునప్పటికి ఆ బోధ మంతయు తనకు నిలువ దేమి ? తన సాధన యింకను బలపడలేదా? బలపడకపోవచ్చును. రాయ లిట్లు తలంచుచుండగా, ధూర్జటి మఱియొక పద్యమును చదివినాడు.

"రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్,
పాసీపాయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీకోయదు, నామనం బకట! నీకుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు; దీని త్రుళ్ళడపవే శ్రీకాళహస్తీశ్వరా !"

ధూర్జటిగారి యీ పద్యముగూడ రాయల హృదయముమీద తన ప్రభావమును బాగుగా చూపినది. ఆయన మనస్సున వై రాగ్యము గాఢముగ పాదుచేసికొన్నది. కార్యభారము నంతయు శ్రీ మద్వేంకటభర్తకే వదలుట మంచిదని యా భూభర్త భావించినాడు.

పిమ్మట తిమ్మరుసుమంత్రి "నేనొక విద్యార్థిని తీసికొని వచ్చితి ననియు, అతడు సంగీతము బాగుగా పాడగల డనియు, ప్రభువు లాతని గాన ప్రబంధమును వినగోరుచున్నాననియు" కోరెను. రాయల వారందు కంగీకరించిరి. ఆ పిల్లవాడు సూరవరాజు కొడుకు భట్టుమూర్తియే. అతడు జాల్గరగునట్లు తన అశిక్షిత సంగీతము చేత సభను సమ్మోహ పఱచెను. సభలోనున్న రామరాజుదృష్టి ఆ బాలకునిపై బడినది. రామరాజు సహజ సంగీతప్రియుడు. గానమన్న అతడు చెవులు కోసికొనును. భట్టుమూర్తికి సంగీతములో తగిన శిక్షణ మిప్పించిన, అత డెంతగానో రాణించునని తలంచి, వానిని తనతోడనే తోడుకొనిపోయెను. రామరాజునకొక్కొక్కరి మీద నిట్లే, నిర్వ్యాజముగా అభిమానము కలుగుచుండును. అలనాడు రుద్రదప్పనుగూడ ఇట్లే అయాచితముగా అంగరక్షకుడుగా స్వీకరించినాడు గదా!

# 8

తిరుమలదేవి తమ దృష్టిలోనున్న రెండు సంబంధములను గూర్చి మోహనాంగికి వివరించినది. రామరాజు తిరుమలరాజుల రూపవయో గుణాదులనుగూర్చి ఉగ్గడించినది. "నీ కెవ్వ రిష్టమో చెప్పుము తల్లీ!" యని బుజ్జగించుచు నడిగినది. కన్యలు విద్యావతులైనను, వయస్సు వచ్చినవారైనను పెండ్లిసంగతి ముచ్చటించు నప్పటికి సిగ్గుపడుచుందురు. మోహనాంగి లజ్జాభరమున తల్లికి ప్రత్యుత్తరమే ఈయలేదు. అయినను తల్లి యెట్లూరకుండును? ఆమె పలుసారులు మోహనాంగి మనఃస్థితిని, సమయమును గనుపెట్టి కూతు నభిప్రాయమును తెలిసికొన యత్నించి చూచినది. ప్రయోజనము కలుగలేదు. కడకు మోహనాంగి "అమ్మా! నే నిప్పుడొక కావ్యమును వ్రాయ దీక్ష పూనియున్నాను. అది పూర్తి

యగు వఱకును వివాహము మాట తలపెట్టకుడు. నన్ను మాటిమాటికి పెండ్లి పెండ్లి యని విసిగించి బాధ పెట్టవలదు" అని సవినయముగా సమాధానము చెప్పినది. అంతమాత్రమున మాతృహృదయమునకు తృప్తి కలుగునా ! మగవారికి వివాహ వయస్సు మీరినను ఎవరో ఒకరు పిల్ల నిత్తురు. ఆడపిల్లలస్థితి యట్టిది గాదు. యుక్త కాలమున వివాహము కావిచో, లోకులు పలురీతుల భావించుచుందురు. అదియునుగాక, మిసమిస లాడు లేతవయసుననే కన్నెలకు పెండ్లిండ్లు ముచ్చటగా నుండును గాని వయసు ముదిరిన పిమ్మట శోభ నీయవు. ఈ రహస్యముల నన్నింటి నెఱింగిన పట్టమహిషి బసివిని ప్రేరేపించి "మోహనాంగిని పెండ్లాడ నుద్బోధింప వలయుననియు, రామరాజ తిరుమలరాజులలో నెవ్వరి నామె యంగీకరించునో తెలిసికొమ్మనియు" నియోగించినది.

తండ్రివలన బసివిరాంద్రసంగతి విన్నప్పటినుండియు తన ప్రియ సఖియైన బసివివృత్తాంతము నెఱుంగవలయునని మోహనాంగి పట్టుదలతో నున్నది. మనుజులు విచిత్ర స్వభావములు గలవారై యుందురు. మనము కోపతాపములు చూపి కొందఱివద్ద కార్యములు సాధించుకొన వచ్చును. కాని మఱికొందఱిని బతిమాలుకొని బుజ్జగించినగాని పనులు నెఱవేఱవు. బసివి ఈ రెండవ తరగతికి చెందిన వ్యక్తి. ఆమె మనస్తత్వమును మోహనాంగి అర్థము చేసికొన్నది గావున బసివిని బుజ్జగించుచు నిట్లన్నది.

"బసివీ ! నీ వెప్పుడును నీ వృత్తాంతమును చెప్పిన పాపమున బోలేదు. నా కింత కూర్పు ప్రాణసఖి వయ్యును నీవు నాకే నీ సంగతిని దాచిపెట్టుచున్నావన్నచో, నీపై నాకు ప్రేమాదరములు కాని, నమ్మకము గాని యెట్లు చెక్కుచెదఱ కుండును ! మేము నీ వృత్తాంతము నడిగినప్పు డెల్లను నీవు కంటతడి బెట్టుకొనుచుండుటచేత నిన్నేడిపింపనేల యని

జాలితో ఆయాసెత్తమైతిమి. నానాటికిని మన స్నేహము గాఢమగు చున్నది. మనస్సులు దగ్గఱయగుచున్నవి. ఇట్టి స్థితిలో నిన్ను గూర్చి తెలిసికొనకుండుట నన్నే నేను మోసగించు కొనుటగా తలంచుచున్నాను. నీవు నాకు కూర్చుదానవే యగుచో, ఈనాడు నీ వృత్తాంతమును నాకు చెప్పితీరవలయును. ఇది నిన్ను పరమ ప్రేమతో కోరుకొను కోరిక."

"అమ్మా ! చెప్పక తప్పదా ! సరే కానిమ్ము. నీవు కోరినట్లే చెప్పెదను. మా తల్లిదండ్రులది "అవుకు" అను పేరుగల గ్రామము. అందు, మీ రాజ కులపు బంధువర్గముకూడ నున్నారు. మేము బలిజ కులము వారమట. నా కీ కులములన్నచో ఎక్కడలేని రోత; చికాకు కూడ. భగవంతుని సృష్టిలో ఇన్ని కులములెక్కడివో మఱి! అందఱును ఆ దేవుని బిడ్డలు కారా! మంచి, చెడు అను రెండేకులములని నా నమ్మకము. సరే, ఆ గొడవ యట్లుంచుము."

"మా కులములో – మా కుటుంబములోనేకాదు. మన సమాజమున కొన్నికుటుంబములలో ఒక దురాచారము వేళ్ల తన్నుకొనియున్నది. తొలుత బుట్టిన యాడుపిల్లకు పెండ్లిచేయరు. మఱికొందఱు తమ సంతానములో ఏదోయొక ఆడుపిల్లనైనను పెండ్లిచేయక సమాజమునకు చూఱ యిచ్చుట యొక ఆచారమట. ఆ ఆడుపిల్ల బసవిరాలను పేరుతో తిరుగు చుండును. ప్రాయము వచ్చునప్పటికి ఆ పిల్ల జీవితమెంత దుర్భర మగునో ఆలోచించి చూడుము. పెండ్లి అయిన గృహిణుల బ్రతుకే సురక్షితముగాని మన సమాజమున, పెండ్లిగానివడుచు బ్రతుకును గూర్చి చెప్పవలసినదేమున్నదమ్మా ! ఆమెను ప్రతివాడును వలచువాడే. ప్రతివాడును చెఱబట్టదలచువాడే కదా! ఇట్టి స్థితిలో కొందఱు స్త్రీలు పడుపు వృత్తి కలవాటు పడుచున్నారు. మఱికొందఱు రాజుల యిండ్లలోనో,

దుర్గాధిపతుల యిండ్లలోనో, ధనికుల యిండ్లలోనో దాసీలుగా చేరు చున్నారు. ఎట్లయినను సమాజములో నట్టివారిశీలమునకు భద్రతలేదుకదా!

"మా తల్లిదండ్రులు నాకు రుద్రమదేవి యనిపేరుపెట్టినారు. నేను కాకతీయసామ్రాజ్యము నేలిన గణపతిదేవుని ప్రియపుత్రిక రుద్రాంబ యంతటి దానను కావలయునని మా నాయనగారి కోరిక. ఆయన నాకు చిన్నప్పుడే చదువుసంధ్యలు నేర్పబూనినాడు. ఏవేవో పురాణకథలు, వీరగాథలు నూరిపోయుచుండెడివాడు. నా దురదృష్టము వేఱుగా నుండగ, నేను రుద్రమ్మ నేల యగుదును? దద్దమ్మనే యైతిని. నా కాఱేడులు వచ్చునప్పటికి, మాయమ్మ చనిపోయినది. మాతండ్రి యింకొక పెండ్లి చేసికొన్నాడు. ఆ సవతితల్లి పెంపకములో నే నెట్లుందునో ఊహించుకొనవచ్చును. తరువాత దేవుడు కన్ను తెఱువగా, మా సవతి తల్లికి వెంటవెంటనే నలుగురాడపిల్లలు కలిగినారు. మా నాయనగారు వారిలో నొకపిల్లను బసివిరాలిని చేయుదమన్నాడు. మా సవతి తల్లి అందుల కొప్పుకొనలేదు. నన్నే బసివిని చేయవలయునని ఆమె పట్టు పట్టినది. మా తండ్రి తన మాట సాగకయు, సంసారము నీదలేకయు రోగగ్రస్తుడై మరణించినాడు. నా కప్పటికి పదుమూడేండ్లు. చిమ్మిరి పెట్టినారు. మా సవతితల్లి నేను బసివిరాలినిగనుక నా శరీరము నమ్మి ధనసంపాదన చేయజూచినది. నే నందు కంగీకరింపలేదు. ఇట్లు రెండేండ్లు ఇంటిలో పోరుసాగినది. ఈ సందర్భముననే నా వ్రతము చెఱచుటకొక పుణ్యాత్ముడు తారసిల్లగా, అతని బాఱినుండి దైవకృపచే నెట్లో తప్పించుకొన్నాను. మీ యంతఃపురపు పరిచారిక మరాళికది మా యూరే. ఆమెను శరణు వేడుకొన్నాను. నాకు వ్రతభంగము జరుగకుండ ఏదేని జీవనోపాయము చూపుమని ప్రతిమాలు కొన్నాను. ఆమె యోగ్యత మీ యంతఃపురమంతయు నెఱిగినదే గదా! ఆమె నా యోగ్య

తను గమనించి, విద్యానగరమునకు దీసికొనివచ్చి తన చెల్లెలి కూతురని చెప్పి, అమ్మగారికి నన్నప్పగించినది. మీ వద్దకు వచ్చినప్పటినుండియు నా చరిత్ర మీరెఱిగియే యున్నారుగదా!" అని చెప్పి బసివి వెక్కి వెక్కి యేడ్వనారంభించినది. కొంతసేపేడ్చి మఱల నిట్లు చెప్పబూనినది.

"నేను నా తండ్రికోరికను నెఱవేర్చలేని మందభాగ్యురాలనైనాను. ప్రభువులు కుమారిని ముద్దుచేయునప్పుడెల్లను నా తండ్రి తలపునకు వచ్చుచుండెడివాడు. మీకు తెలియకుండగనే, లోలోపల కుమిలిపోయెడి దానను. నాలో రుద్రాంబను చూడవలయుననుకొన్న తండ్రి ఋణమును తీర్చలేని ఋణగ్రస్తురాలనమ్మా! నేను. అది యట్లుండె. సమాజము లోని ఈ దారుణ దురాచారమున కెన్నెన్ని ఆడుబ్రతుకులు బలియగు చున్నవో నీకు తెలియదుగదా తల్లీ!"

బసివి తన వృత్తాంతమును చెప్పుచున్నంత సేపును మోహనాంగి కంటివెంట జలజల కన్నీళ్ళు కారుచునే యున్నవి. "బసివి మొదటి పేరు రుద్రమ్మయా? ఆ తండ్రి యీ బిడ్డనుగూర్చి ఎన్ని కలలు కవినాడు! కడ కేవియు నెఱవేఱక మరణము పాలాయెనా? విధివిలాసము." అని మోహనాంగి లోలోపల భావించినది. బసివి ధీరత్వమునకును, కష్టసహిష్ణుతకును, తక్కిన యోగ్యతలకును ఎంతగానో సంతసించినది. బసివి స్త్రీ జాతికే గర్వకారణమైన నాతి యని తలంచి యామెతో విట్లన్నది.

"బసివీ! నీకీ తుచ్ఛమైన పేరు పనికిరాదు. నీ తండ్రి ప్రియమార పెట్టుకొన్న పేరుతో నిన్ను పిలుతుము. లేదా మా అంతఃపుర పరిచారికలకు క్రొత్తపేరులుంచు నాచారమున్నది గనుక, మాకును నీకును ఇష్టమైన మఱొక పేరుతోనైనను నిన్ను పిలుచుకొందుము. అంతియే

గావి, నీచత్వమునకు నిలయమైన బసివి యను పేరు నీవంటి సుశీలకు తగదు. నా మాట కెదురాడవలదు. నా కోరిక నంగీకరింపుము,”

బసివిగూడ చాలసే పాలోచించినది. “బసివి” యను నామములో నేదో ఒక నీచత్వమున్నట్లే ఆమెకు తోచినది. సాధారణముగా బసివి రాండ్రు శీలభ్రష్టలుగానే యుందురు. పోనీ రుద్ర యని పిలిపించు కొందమన్న, అందుకు తనకర్హత లేదని ఆమెకు తోచినది. చివరకు “నరేసమ్మా! మీ రే పేరు పెట్టుకొని పిలిచినను తల యొగ్గెదను” అని బసివి సమాధాన మిచ్చెను.

మోహనాంగి కొంచెమాలోచించి “ఏకావళి, నాగిని, అను రెండు పేర్లు నాకిప్పుడు తోచుచున్నవి. వీనిలో నాగిని యనగా ఆడత్రాచుపామని యర్థము వచ్చును. అయిననేమి. నీవు దుర్మార్గులకు నాగినివి గావలయు ననిదే నా తలంపు. మహా రుద్రమూర్తి నాగభూషణుడు కదా! నీ తొలిపేరున కలంకారమే ఈ నాగినీ నామధేయము. నేటినుండియు నీవు నాగినివి.” అనెను.

*

ఇక నాగినికి మహారాజ్ఞీమణి అప్పగించినపని నెరవేర్చవలసిన బాధ్యత యున్నది. ఆమె యుక్తియుక్తముగా మోహనాంగితో సంభాషింప నారంభించినది.

“నాన్నగారికి కావ్యము వ్రాసి అంకితమీయ నెంచితివి గదా! ఆ కావ్యమేదో నిర్ణయించితివా!”

“అదే ఆలోచించుచున్నాను. కొంతవఱకా నూత్న కావ్యము నూహించినాను. ఇంకను ఊహింపవలసి యున్నది,

"మంచిది, మఱి నీవు కన్యవుగదా! మాతృత్వమున కెట్లొడిగట్టు చున్నావు? కృతిని కన్య యందురు గదా!"

"అవును! అది కవుల వర్ణన. కావ్య కన్యా మాతృత్వముచేత కన్నెఱికమునకు భంగమురాదే పిచ్చిదానా?

"అయినను, తగిన వరునిగూడ బడసి దంపతు లిరువురు కావ్య కన్యను యోగ్యవరునకు ధారవోసిన బాగుండును గదా!"

"ఓసి పోవే! నీ పరిహాసములకేమి!"

"కావమ్మా. నావి పరియాచకములు కావు. అమ్మయు. నాన్నయు పెండ్లి ప్రయత్నములు చేయుచుండుట కుమారి గమనింపలేదా? అమ్మ మాటను కాదన్నను, పితృభక్తిపరాయణవు గాబోలు, నాన్నగారి తలంపు ననుసరింపవలదా?"

"నాన్నగారి తలంపా! ఏమిటా నాన్నగారి తలంపు? చెప్పుము, నాగినీ! చెప్పుము."

"నాన్నగారు, నీ పెండ్లివేడుకలు చూచుకొన ముచ్చటపడుచున్నారు. వారిదృష్టిలో రెండు సంబంధము లున్నవి."

"సరే లేవే! ఆ సంబంధములను గూర్చి అమ్మ చెప్పి చెప్పి నా ప్రాణములు కొఱుకుచునే యున్నది. ఇంకను నీ యుపన్యాసములేల?"

"అయిన, ఏసంబంధము నాస్వామినికిష్టమో, నేను వినదగుదునా?"

"నీకంటెను వినదగిన వారెవరే! ఆ నిర్ణయముకూడ నీకే వదలు చున్నాను. నీ వెవ్వరిని నిశ్చయించినను సరియే."

"అది ప్రమాదమమ్మా! విద్యా బుద్ధులు తెలిసినదానవు. పెండ్లి యనునది నూఱేండ్లపంట! నాపై పెట్టక, నీవే సూక్ష్మముగా ఆలోచించి చెప్పుము తల్లీ!"

"అట్లుకాదు. నా నాగిని, నాకు తల్లిదండ్రులకంటెను అధికురాలు. దానికి నన్ను శాసించునర్హతగూడ నే నిచ్చుచున్నాను. అదియే నిర్ణయము చేసి చెప్పవలయును."

"అంతటి భారము నీ దాసురాలిపై మోపుచున్నావా తల్లీ! నాకు సంకట స్థితిని కల్పించినావే. రామరాజుగారికన్నను తిరుమలరాజుగారు వయసున చిన్నవాడు. నీ కీడైనవాడు."

"తక్కిన యోగ్యతలు విచారింపవలదా?"

"నిజమే రామరాజుగారు సత్పురుషుడు; శీలవంతుడు"

"తిరుమలరాజుగారు కాడన్నమాటయేగదా!"

నాగిని మాటాడలేదు.

"చెప్పవేమి? నీ వెఱిగినంతవట్టు నిజము చెప్పుము. నా సర్వస్వ మని తలంచిన నీవు నన్ను మోసగింతువా?"

ఇప్పుడు నాగిని స్థితి ముందు నూయి వెనుక గోయి యైనది. తిరుమలుని కథ చెప్పినచో అతని వివాహము చెఱచినది కాగలదు. చెప్పకున్నచో ప్రాణసఖిని-తన్ను నమ్మిన ఒక కన్యను గోతిలో త్రోసి నది కాగలదు. ఆమె చాలసేపాలోచించి ఒక నిర్ణయమునకు వచ్చి, ఇట్లు చెప్పబూనినది.

"అమ్మా! నే నిందాక, నా వృత్తాంతమునుగూర్చి చెప్పుచు "ఒక పుణ్యాత్ముడు నన్ను చెనకరాగా, దైవకృపచే ఎట్లో అతని బాఱినుండి

తప్పించుకొంటి"నని స్వామినికి మనవి చేసికొని యుంటిని. అవి అవుకు గ్రామములో నే నీడేటి పూపవయసు సొగసులు, మిన మిసలు ఎగబోయుచున్న రోజులు. నా సవతితల్లి నన్ను ధనార్జనకు పూన వలసినదని పోరుపెట్టుచున్న దినములు. వర్షాకాలము గడచి శరత్తు నగ మున పడినది. ఆ రోజులలో గ్రామ ప్రజలు వీధి భాగవతములతోను తోలుబొమ్మలాటలతోను వినోదించుచుండెడివారు. నట్టనడువీథిలో — అనగా చతుష్పథము వంటిచోట, ఈ యాటల నేర్పాటుచేయుచుందురు. బొమ్మలాటలకాశయ్య నాయనగారికి పరమాశ్రితుడుకదా! నాన్నగారిదయ వల్లనే కాశయ్య మనదేశమున యక్షగానములను, తోలుబొమ్మలాటలను వ్యాప్తికి తెచ్చినాడు. భండారు లక్ష్మీనారాయణగారి నాట్యవిద్యకెంత పేరో! కాశయ్య మేళపు తోలుబొమ్మలాటకును అంత పేరు! ఆ యాట చూచుటకు చుట్టుప్రక్కల రెండామడల దూరమునుండి యైనను, జనులు చద్దిమూటలు కట్టుకొని రావలసినదే! నాడు మా యూర తోలుబొమ్మలాట సాగుచున్నది. నడురేయి దాటినది. ఆట చూచువారు కునుకుపాట్లు పడుచున్నారు. ఇట్టి సమయమున వారిని చక్కిలిగింతలుపెట్టి మేల్కొలు పుటకు ఆటవాండ్రు కేతిగానిని, బంగారక్కను తెరపైకెక్కించి శృంగార హాస్యముల నొలకబోయు చుందురు. నేనా సమయమున గాలి పీల్చు కొనుటకై ఆట వీడి యావలకు పోతిని. ఒక యువకుడు నాకు తార సిల్లినాడు. అతడదివఱకే నా సవతితల్లి తోడ్పాటున నన్ను గుస్తరింప జూచుచున్నాడు. అతడందగాడే, ఉన్నతకుటుంబమువాడే; వయసుకాడే! పొంగులుదేరు నవయౌవనముతో కన్నులుగానక నాపై గవిసినాడు. నేను తప్పించుకొన జూచితిని. పెనగులాడితిని. గోళ్ళతో అక్కితిని, కాళ్ళతో తాచితిని. పాప మాత డుక్కిరిబిక్కిరి యైనాడు. నేను విజృం భించి – "నేను నీపాలిట రుద్రమదేవిని రా" అని అఱచితిని. ఇంతలో

వారును పీసను వచ్చిరి. అతడు, కుటుంబ గౌరవ మెక్కడ కూ పోవునో యని పలాయనము చిత్తగించినాడు. నేను నా మానము కాపాడుకొని బయటపడితిని. తరువాతనే నాకు మరాళికతో పరిచయము ఆమె నన్ను నగరమునకు తెచ్చి మీ అంతఃపురమున ప్రవేశపెట్టుట."

ఇది యంతయు విని మోహనాంగి నవ్వుచు అన్నది —

"ఇది యేమే! నేను తిరుమలరాజు శీలమును గూర్చి ప్రశ్నింపగా నీ శీలరక్షణ కథను చెప్పినావు! నీకేమైన మతి చలించినదా !"

"చలింపలేదమ్మా ! మతి చలింపలేదు. నేను చెప్పినది చి తిరుమలరాజు కథయే ఆనాడు నా యౌవనమును కొల్లగొట్టదలచినవా తిరుమలరాజే. మీ తల్లులకును. వరదాదేవిగారికిని నిన్ను తిరుమలరాజుగారి కీయవలయు ననియే యున్నది. నాన్నగారి దృష్టి రామరాజుపై నున్నట్లూహించవచ్చును. ఇక నీ వెవరిని వరింతువో చెప్పుము తల్లీ !"

"నాగినీ! నీవు నాకు అక్కవుగాని ప్రాణసఖివికావే! నీనీ కథ చెప్పకున్న నేను మా అమ్మల నిర్బంధమునకు లొంగవలసి వచ్చెడిది. ఒక స్త్రీ లోలునికి భార్యనై ఇడుమల బడవలసి వచ్చెడిది. సర్వవిధముల నాకు నాయనగారి యాశయమే మాననీయము. నాగినీ! నీ ఋణమునెట్లు తీర్చుకొందునే !"

*

మోహనాంగి నిర్ణయము రాయలవారి నలరించినది. తిరుమలదేవి తిరస్కరించినది. వరదాదేవి తనకు ఓటమి కలిగినట్లు చింతించినది. అచ్యుత దేవరాయలు చలింపలేదు. ఇక చినతిరుమలరాజు కట్టుకొన్న మేడ

లన్నియు కూలిపోయినవని చెప్పనేల. అరవీటి కుటుంబమువారి ఆనంద మునకు మేరయేలేదు. రామరాజు తాను పట్టిన వ్రతము ఫలించినందులకు సంతసించినాడు. రాయలవారికి అల్లుడగుట యన్నది సామాన్యమైన యదృష్టమా యేమి? మహావైభవముగ వివాహము జరిగినది. ఆడువారి వేడుకల కవధులు లేవు. వారు తలుపు దగ్గఱ నిలబడి వధూవరులను పరస్పరము పేరులు చెప్పనిది లోనికి రానీయ మన్నారు. పెండ్లిండ్లలో నిదియొక వేడుక. కొంతసేపు బొగాములు సాగిన పిమ్మట, రామరాజు మామగారికిష్టమైన మోహనాంగి యను నామమునే పలికినాడు. తిరుమల దేవి యనునది అత్తగారి పేరు గనుక, దానికన్న ఈ పేరును చెప్పుటయే సమంజసముగా నున్నదని ఎల్లరు భావించినారు. ఇక మోహనాంగివంతు వచ్చినది. ఆమె కవికుమారియు, కవయిత్రీకుమారియును గదా! తన కవితాచాతుర్య ముట్టిపడునట్లు పతిదేవుని పేరు చెప్పినది.

రాఘవా! వ్యూహిప్రతికారమణ! ప
ణారి! బ్రహ్మారాణప సుతావనా! యన, ప్రథ
మాక్షరావళి, యేఘను నాఖ్య యౌనొ,
అట్టి మత్పతి దైవంబె యగును నాకు!

మోహనాంగి ప్రతిభకు పెండ్లి వారందఱును ఆనందాబ్ధి నోలలాడిరి.

*

మోహనాంగి రామరాజును వీణావాదనముతో కరగించును. కవిత్వ ముతో కళకళలాడించును. చిత్రలేఖనముతో స్వర్గవీథులు సాక్షాత్కరింప జేయును. సుందర నందనవనములలో పూలతూగుటూయెలల నూపును. కేళికాసరస్సులలో తేలించును. క్రీడాపర్వత సానువుల ద్రిప్పును. ప్రణయనదీ పులినములందు విహరింపజేయును. ఆ ప్రియాప్రియుల దొక అద్వైతానంద జగత్తు!

# 9

రాయలవారు కారణజన్ముడని చెప్పదగిన మహానుభావుడు. ఆయః సామ్రాజ్యమును నిర్మించుటయేగాక, అలనాటి ధారానగరపాలకుడగు భోజరాజువలె కవి, పండిత, గాయక, శిల్పాచార్యులను పోషించి చెన్నొందినాడు. ఆనాడు ప్రతి కళారాధకుడును ఆయనను దర్శించి, తన కళాకౌశలముచేత ఆయనను మెప్పించి, బొనవిపించుకొని ధన్యుడు కావలె యునని చూచువాడే. రాయలు మెచ్చనికళ కళ కాదనియు, ఆయన కంటబడని తాము, కళారాధకులు కారనియు నాటి కళానిర్మాతలు భావించు వారు. "పతులు మెచ్చని చెలువు నిష్ఫలము గాదె" అన్న కవి వాక్యము నకు భూపతులు మెచ్చని కళాసౌందర్యము వ్యర్థమనియు తాత్పర్యము చెప్పినచో, నాటి కళానిర్మాతల భావమునకు సరిపోవును. ఇది నిజమే యయినను, ప్రతికళాకారుడును, రాయలవారి దర్శనభాగ్యము నందుట అంత తేలికమైన పని కాదానాడు. అందుకు రాజపురుషుల సాహాయ్య ముండవలెను. కవులైనచో పెద్దన నాశ్రయింపవలయును. శిల్పులైనచో చెంకణాచార్యుల దయను పొందవలయును. గాయకులు కృష్ణగాయకుల అనుగ్రహమునకు పాత్రులు కావలయును. నర్తకీమణులు రంజకం కుప్పాయమ్మ నాశ్రయింపవలయును. రాజ్యకార్యార్థులైనచో తిమ్మరుసును గాని, అరవీటి రామరాజాదులనుగాని పట్టుకొనవలయును. ఇక వేదాంతులు మున్నగు పరమార్థాన్వేషకులు అహోబల వైష్ణవ మఠాధిపతులద్వారమున రాయలదరికి రావలయును. పైని పేర్కొన్నవారి పరీక్షలలో నెగ్గినవారే, రాయలను దర్శించి కృతార్థులు కాగలరు. లేకున్న ప్రతివాడును రాయల యెదుటికివచ్చి రసాభాసము పాలగునని ఈ కట్టు దిట్టములు చేయబడినవి.

ఆనాటి మహాకవులలో సంకుసాల నృసింహకవియొకడు. ఇతడు శ్రీ మద్భట్ట పరాశరదేశికేంద్రుల శిష్యుడు. పాండిత్య కవిత్వములలోనే గాక, శిల్పవిద్యలయందును దిట్ట దైవభక్తి గలవాడు. సదాచార సంపన్నుడు. సంతానవంతుడు. అయిననేమి, నోటనాలుకలేదు. నివురుగప్పిన నిప్పు. ఇతరుల నాశ్రయించి కార్యసాఫల్యము చేసికొను యుక్తిశక్తులంతగా లేనివాడు. ఇతడు మాంధాతృచరిత్రమనెడి కావ్యమును వ్రాసినాడు. అందలి కవిత్వ గుణమును బట్టి దాని కాతనితండ్రి కవికర్ణరసాయనమను నామాంతరము నిడినాడు. నాటి సహృదయు లా పేరే దానికి దగునని ముద్ర వేసినారు. వారి ముద్ర కవి కేమి యొరి గించును. వా రనధికారులు గదా! పదవులలోనున్న కవులముద్ర పడి, ప్రభుప్రశంసకు పాత్రమైననే నాడు కవితకు చెలామణి. నాడేకాదు. ఏనాడైనను అధికారముద్ర కా ప్రభావమున్నది.

నృసింహకవి తన కావ్యమును దీసికొని పెద్దనను దర్శింప వచ్చి నాడు. పెద్దన ఆ సమయమున భట్టుమూర్తికి మేఘదూతము పాఠము చెప్పుచుండెను. తన యింటికి వచ్చిన నృసింహకవిని పెద్దన ఆసనాదు లొసగి గౌరవించినాడు. పెద్దనగారి పాఠప్రవచనరీతి నృసింహకవిని ముగ్ధు నొనర్చినది. శ్లోకమును ముందొకసారి పెద్దనయే చదివినాడు. ఆ చదువురీతియే యింపుగా నున్నది. తరువాత శిష్యునిచే రెండు మాఱులు చదివించినాడు. లోపములను సరిదిద్ది చదువవలసినరీతిని వివరించినాడు. భట్టుమూర్తి సంగీతములో నిధి కదా! గురువు చెప్పిన ట్లద్భుతముగా శ్లోకమును జదివినాడు. తరువాత పదవిభాగము. ఈ పదవిభాగమునకు విభక్త్యంతమనునది కొంతవఱకు తోడ్పడును. అవ్యయములు, క్రియాపదములు వచ్చినప్పుడు పదములను విభజించుటకు కొంత చిక్కుపడవలసి వచ్చును. అది యైనను అభ్యాసక్రమమున

తేలిక యగును. తరువాత క్రియాపదమును పట్టుకొని, కర్త, కర్మ, విశేషణ, క్రియావిశేషణాదులను ఆకాంక్షాముఖమున చెప్పించెను. అటు పిమ్మట అన్వయక్రమములో కర్తృ కర్మ క్రియాదులను వరుసగా చెప్పించెను. ఇది యంతయు శిష్యుడు చెప్పుటయే. గురువు నడుమ, నడుమ లోపములను మాత్రము సవరించుచుండెను. ఇట్లు ప్రతిపదార్థమైనపిమ్మట తాత్పర్యము, విశేషములు చెప్పి, శబ్దములు, సమాసములు, క్రియలు, అవ్యయములు మున్నగువాని స్వరూపమును సవిశేషముగా చెప్పించెను. ఆనాటి పాఠవిషయము "తన్వీ శ్యామా శిఖరిదసనా" అను శ్లోకము. అది మేఘదూతములోని యక్షపత్ని వర్ణనము. శ్లోకములోని ఒక్కొక్క పదమునందలి సారస్యమును పెద్దన వివరించిన రీతి నృసింహకవికి అనిదంపూర్వముగా తోచినది.

కొందఱు కవులు, పండితులు కాలేరు. పండితులు ఉత్తమోపాధ్యాయులు, ఉపన్యాసకులును కాలేరు. పెద్దనగారిలో ఈ మూడు శక్తులు ఇమిడియున్నందులకు నృసింహకవి అబ్బురపడినాడు. భువనవిజయమున అగ్రపీఠము నధిష్ఠించు నర్హత పెద్దనకు పూర్తిగా గలదని యెంచినాడు. ఎందు కెంచడు ! అతడు గుణగ్రహణపారీణుడు గదా ! పాఠము చెప్పుట పూర్తియైనపిమ్మట వా రిట్లు మాటాడుకొన్నారు.

నృసింహకవి :-

"మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం,
బనఘకథా ముఖంబున హితా హితబోధ మొనర్తురింపుగాఁ,
గనఁగొనుకంటె నద్భుతముగా నెఱిగింతు రతీంద్రియార్థముల్,
ఘనమతు లెల్లవారికి నకారణబంధులు గారె సత్కవుల్ !"

ఇట్టి మహాకవులను తమ్ము దర్శించి ధన్యుడ నయినాను."

పెద్దన : ఈ పద్యము నిప్పుడే చెప్పినారా? లేక, తమ కావ్యములో నిదివఱకే వ్రాసికొన్నారా ?

నృసింహ: ఇది నా కవికర్ణరసాయన కావ్యములోనిది. తమవంటి వారి విషయమున సార్థకమగునని యిప్పుడు చదివినాను.

పెద్దన : కవులమహిమ నీ పద్యమున నెంత చక్కగా వర్ణించినారు ! తమకు కవులపై నెంతవిశ్వాసము! కాని ఎల్లరికీ నిష్కారణ బంధువులైన కవులు, తమలో పరస్పరము బాంధవ్యము నెఱపుకొనవలసి వచ్చునప్పటికి వెనుకబడుచున్నారు.

నృసింహ: అది తమబోంట్ల విషయమున గాదు.

పెద్దన : కృతజ్ఞుడను, తమ కావ్యేతివృత్త మేమో సెలవిత్తురా ?

నృసింహ: ఇక్ష్వాకువంశము వాడైన మాంధాతృని చరిత్ర.

పెద్దన : అందలి ప్రధానరసము ?

నృసింహ: మొదట శృంగారమును, పిమ్మట శాంతమును. ఆ సంగతినే యిట్లు సూచించినాను.

"యతి విటుఁడు గాకపోవు టెట్ల స్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున ?
విటుఁడు యతి గాక పోరాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణనాకర్ణనమున !"

పెద్దన : గొప్ప ప్రతిజ్ఞ చేసినారే !

నృసింహ: తమ దయవలన. తా మొకసారి నా కావ్యమును విని సంతసించినచో, నేను ధన్యుడ నగుదును.

పెద్దన : అట్లే. తా మింకొకసారి దయచేసిన విందును. తమ కభ్యం తరము లేనియెడల, గ్రంథమును నావద్ద నుంచినను తీటిక యైనపుడెల్లను చదువుదును.

ఈసంభాషణమువలన పెద్దనమీద నృసింహకవికి సదభిప్రాయము కలిగినది. కవులలో పరస్పరము ఐకమత్యము లేమికి పెద్దన చింతించు చున్నాడనియు అతనికి తోచినది. "పెద్దన యెంత నిర్మత్సరుడా!" అను కొని తన కావ్యమును పెద్దనవద్దనే యుంచి వెడలిపోయినాడు.

పెద్దన బహుకార్యధురంధరు డయినందున కవికర్ణ రసాయనము నామూలాగ్రముగా చదువునప్పటికి మూడు నాలుగు నెలలు పట్టినది. నృసింహకవి తన కావ్యమును, తాను చేసిన ప్రతిజ్ఞకు దగినట్లుగానే రచించినాడని పెద్దనకు కవికర్ణ రసాయనముపై గౌరవము కలిగినది. కవి యిందు మొదటి నాలుగాశ్వాసములలోను మాంధాత పూర్వజీవితమును అనగా వివాహాది గార్హస్థ్యధర్మముల నభివర్ణించినాడు. ఈ సందర్భమున అతడు చేసిన శృంగార వర్ణనము యతివి విటునుగా మార్పజాలినట్టిదే! ఈ నాలుగాశ్వాసములందును - యుద్ధము, వివాహము, ఋతువులు, వన విహారము, జలక్రీడలు, పుష్పాపచయము, సూర్యోదయ - సూర్యాస్తమయములు, అంధకారము, నక్షత్రములు, చంద్రోదయము, మధుపానము, వారవనితాదూషణము-మొదలగు నష్టాదశవర్ణనములు చేసినాడు. మిగిలిన రెండాశ్వాసములందును పారమార్థికాంశములను వర్ణించినాడు. మాంధాత, వశిష్ఠాదులవలన తన పూర్వజన్మ వృత్తాంతమును దెలిసికొని యిహముపై విరక్తుడగుట, గురువులవలన కర్మ, ఉపాస్యకోపాసకుల స్వరూపమును గ్రహించుట, భగవద్విగ్రహస్వరూప, భగవదవతార రహస్యముల నెఱుంగుట, ప్రపన్న-భక్తియోగముల లక్షణములు, త్యాజ్యమైన సంసార

ము, పొందదగిన మోక్షమును తెలిసికొని అష్టాక్షరీ మహామంత్రో పదేశము వడసి తపస్సునకేగుట, ఇత్యాది విశిష్టాద్వైత వేదాంత పరములగు నానావిషయములను వర్ణించినాడు.

ఇట్టి అతీంద్రియాంశములను వర్ణించుటంబట్టియే నృసింహకవి "అద్భుతముగా నెఱిగింతు రతీంద్రియార్థముల్" అని చెప్పగలిగినాడని పెద్దన గ్రహించినాడు. నృసింహకవి, తాను కవిగా లోకమునకేమి చేయదలంచెనో, దానినే కవివర్ణన నెపమున "మనమునఁ గొన్న నెవ్వగలు........" అను పద్యమున చెప్పినాడు. కావ్యము తుదికి వచ్చు నప్పటికి పెద్దన కీ పద్యమగపడినది —

"కవితావిచక్షణత గల
కవికంఠ విభూషణముగఁ గైకొనవలయుం
గవివర నృసింహ విరచిత
కవికర్ణరసాయన మను కావ్యము దీనిన్!"

ఆహా! తన కావ్యము కవికంఠాభరణము కాగలదనియు నృసింహ కవి విశ్వాసము. ఇట్లు తలంచి పెద్దన నృసింహకవిపై నదభిప్రాయము నేర్పఱచుకొన్నాడు.

ఈ మూడు నాలుగు నెలలును నృసింహకవి పెద్దన యింటికి రాక పోకలు చేయుచునేయున్నాడు. అతడు కొంచెము విసిగినాడు కూడను.

పెద్దన యొకనాడు నృసింహకవి నుద్దేశించి "తమకావ్యమద్భుత ముగా నున్నది. తమ ప్రతిజ్ఞ కనుగుణముగానే కావ్యమును నిర్వ హించినారు." అని మెచ్చుకోలు నందించెను. అంతట నృసింహకవి తన కావ్యమును రాయలవారికంకిత మీయవలయు నని సంకల్పమున్న దనియు, అందుకు సాయపడవలసినదనియు కోరెను.

"అట్లయినను తాము మఱికొంతకాలము వేచియుండవలయును. రాయలవారి దర్శనమునకు తగిన సమయమును గాంచి నేను తమకు కబురంపుదును" అని పెద్దన యనినాడు. అంతట నృసింహకవి వెడలిపోయెను.

అతడు పోయిన పిమ్మట పెద్దనకొక సందేహము తట్టినది. "నృసింహకవి చూచుటకు మెత్తగా నగపడుచున్నాడు కాని తన కావ్యమునుగూర్చి కొంత యహంకారమును ప్రదర్శించినట్లున్నాడు. "యతి విటుడుగాక యుండునే...."అను పద్యమునుగాని, కవితావిచక్షణత గల ..."అను పద్యమునుగాని రాయలవారుచూచిన నేమనుకొందురు. అంతటివాడు, కవికుల శిరోమణియని సంస్తుతు లందినవాడు-కాళిదాసే. *"మందబుద్ధినై కవియశస్సును గోరి అపహాస్యము పాలగుదునేమో" యనియు, *"విద్వాంసులు మెచ్చువఱకు నా ప్రయోగవిజ్ఞానమును శ్రేష్ఠమనుకొనలే"ననియు వినయమును ప్రదర్శించినాడు గదా! అట్లనుకొన్న తామ చేసినదేమి? రాయలవారు గండపెండెరమును గొనుమని కవులను గోరినప్పటి సంఘటనము పెద్దనకు జ్ఞప్తికి వచ్చినది. ఆలనాడు రాయలవారు గండపెండెరమును పసిడిపళ్ళెరమున బెట్టి సభలోని కవుల నుద్దేశించి, "సంస్కృతాంధ్రముల సమముగా కవితచెప్పగలవా రిద్దానిని స్వీకరింపు" డని కోరినాడు. ఎవ్వరును ముందుకు రాలేదు. అప్పుడు రాయలవారు —

---

*"మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం" - రఘువంశము.
*'ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్' శాకుంతలము.

"ముద్దుగ గండపెండియరమున్ గొనుఁ డంచు బహూకరింపఁగా
నొద్దిక నా కొసంగుఁ డని యొక్కరు గోరఁగ లేరు, లే రొకో!"
అనినాడు. అంతట తాను లేచి—

"పెద్దనఁ బోలుపండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే,
పెద్దన కీఁ దలంచినను పేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా!"

అని దానిని స్వీకరించినాడుగదా! అది యహంకారము కాదా? కవులు తమ ప్రతిభను గూర్చి అవసరమైన పట్టున నిట్లు చెప్పుకొనుచుందురు. అది యంతగా దోషములో లెక్క-కాదు. అది యొకవిధమైన ఆత్మవిశ్వాసమేకాని వేఱు కాదు. దానిని సాత్వికాహంకార మనవచ్చును. ఈ సాత్వికాహంకార మనునది యోగులకు గూడ నుండును. ఇట్లు తలంచి పెద్దన నృసింహకవికి రాయలదర్శనము చేయింత మనియే నిశ్చయించుకొనినాడు.

నృసింహకవి పెద్దనయింటికి రాకపోకలు చేయుచునే యున్నాడు. ఒకతూరి పెద్దన నృసింహకవినిగూర్చి యనినాడు.

"తాము తొందఱ పడవలదు. విశిష్టాద్వైత రహస్యములను జాటు తమ కావ్యమును రాయలవారు తప్పక స్వీకరింతురనియే నా నమ్మకము. మన మింక కొంతకాల మోపిక పట్టి వేచియుందము. మిగిలిపోయిన దేమి? తమకు దినబత్తెమునకిబ్బందిగా నున్నచో, నేను నాసొమ్ముతో పలసిన యేర్పాటులు చేయింతును. సందేహింపవలదు. మనము కవి గోత్రులము గదా! మనలో మనకు నీ-నా అను భేదము ఉండకూడదు."

పెద్దన యౌదార్యమునకు నృసింహకవి కరగిపోయినాడు. ఇంతటి యౌదార్యముండుట చేతనే పెద్దనగా రింతటి పేరు ప్రతిష్ఠల నందినారని తలంచి "తాము చేయు ధనసాహాయ్య మక్కఱలే"దని సవినయముగా చెప్పి వెడలిపోయినాడు.

నృసింహకవి భుక్తికోసమై తెచ్చుకొన్న ధనము హరించిపోయినది. అతడు ఒరులను యాచింపనిష్టములేని నైష్ఠికుడు. పెద్దన యౌదార్యమునే స్వీకరింపలేనివాడు ఇతరులను యాచించునా యేమి? సంసారమా పెద్దది. దినబత్తెముదొరకుటే కష్టమైపోయినది, అయినను రాయలసందర్శనము చేసికొనవలయునన్న మక్కువమాత్రము నృసింహకవిని వీడలేదు.

# 10

మోహనాంగికి వివాహమైనప్పటినుండియు భర్తృసేవలోనెక్కువ కాలము గడపవలసి వచ్చినది. రామరాజు కళాప్రియుడైనందునను, ఆమె కళాభిజ్ఞయేగాక, కళానిర్మాత్రియు అయినందునను ఆయన ఆమెతో వివిధకళా వినోదములతో ప్రొద్దులు పుచ్చుచుండును. తన కళోపాసనా దీక్షకు చరితార్థత కలుగుచున్నది గదా యని, మోహనాంగియు మగని నా యా కళలతో కరగించుచుండును. మాసములు క్షణములై ఆ జంటకు సాగిపోవుచున్నవి. మోహనాంగిని వీడి రామరాయ లుండలేదు. ఆయనను వదలి మోహనాంగి యుండలేదు. వీరికి వివాహము జరిగి నప్పటినుండియు కృష్ణదేవరాయలు, రాజ్యనిర్వహణ భారమును గూడ తగ్గించుకొనినాడు. ఆయన కొంతభారమును అళియ రామరాజునకును, మఱికొంతభారమును అచ్యుతదేవరాయలకును అప్పగించి ఎక్కువకాలము విశ్రాంతిగా గడపుచున్నాడు. విశ్రాంతియనగా పనిచేయకుండుట యని యర్థము కాదు. సాహిత్యావలోకనము, దివ్యప్రబంధ పఠనము ఈశ్వరారాధనము-ఇత్యాదులతో రా య ల వా రి కి కాలము చెల్లిపోవు

చున్నది. పూర్వమువలె మోహనాంగితో విశేషకాలము గడపు నవకాశము ఆయనకు చిక్కుటలేదు.

రామరాయలకు గూడ క్రమక్రమముగా రాజకీయ కార్యములు చూచుకొనవలసిన బాధ్యత ఎక్కువ అయినది. తొలినాళ్ళవలె అంతఃపురము నంటిపెట్టుకొని యుండుట పొసగుట లేదు. మహాసమ్రాట్టులు మామగారు సింహాసనముపై నడుగు పెట్టినప్పటి నుండియు దండయాత్రలతోను, కళాసేవలతోను అలసిసొలసి యున్నారు. అట్టి మహానుభావునకీ నాడు తగిన విశ్రాంతిని గూర్చుట పుత్రస్థానీయుడైన తనకు కనిష్ఠ ధర్మము. ఈదృష్టితో రామరాజు రాజ్యకార్యము లందెట్టి ఒడుదొడుకులు కలుగకుండ చూచుకొనుట యగుచున్నది.

రాయలవారి కానాడు, కూతురు మోహనాంగితో సాహిత్యగోష్ఠి సలుపు నదవకాశము కలిగినది. ఆమె అప్పటి వఱకును వాల్మీకి రామాయణమును చదివి, పిమ్మట నేదో ఆలోచనలో మునిగినది. రాయలవారామె ఏదో సమస్యనుగూర్చి యాలోచించుచుండవచ్చునని తలచి ఇట్లనినాడు.

"కన్నుబొమలు పైకెగసి యిటున్న వేలః
చేతియం దిటు చెక్కిలి చేరె నేలః
చూపు లిటు వట్టి బయలును జూచు నేలః
పట్టిః యెట్టి గట్టి సమస్య పట్టు కొంటిః"

ఈ పద్యము చెవిని బడునప్పటికి మోహనాంగి ఉలికిపడినది. తేరుకొని చూచునప్పటికి తండ్రి ఎదుట సాక్షాత్కరించినాడు. ఆమె అయన పాదములంటి నమస్కరించి దీవెన లందుకొన్నది. పద్యముతో ప్రశ్న వేసిన తండ్రికి, పద్యముతోనే సమాధానము చెప్పుట యుచితమని, ఆమె ఇట్లు జవాబిచ్చినది.

"తండ్రి! సమస్యపూర్తికి నెవన్ దలపోయుటలేదు; మీర లే
మం[డా మదీయసాహసము నారసి, కావ్య మొనర్ప బూనితిన్-
పీంద్రక< బాకమ:ండగ< గవిత్వపు<బాకము నేలయంచు, వి
ర్లాం[డమ గేలిసేయు జనులందఱు మెచ్చెడునట్టి శైలితో."

రాయలవారికి, కూతురు కావ్యనిర్మాణము చేయుచున్నదన్న వంగతి వినువప్పటికి కలిగిన సంతసమును పట్టపగ్గములు లేకపోయినవి. ఆయన అనంద కైలాసశిఖరము నెక్కి ఇట్లన్నాడు—

"చదువుల సరస్వతివి, నీ
మృదుకవితా శైలి స్త్రీలకే యన నేలా?
తుదకు స్త్రామ్మలు తిరిగిన
మదవత్కవిపుంగవులకు మహిని గలుగునే!"

"స్త్రీ లన్నంతనె చుల్కచేయుట కుమారీ! మౌఢ్యమే సుమ్ము,నా
కీలోకంబున శేముషీయుతలు లేరే పూర్వ: మింతేటికిన్
నాళీకాసనురాణి స్త్రీయె కద! యెన్నన్ గోమలాంగీవచో
లాలిత్యం బది మోటుపూరుషుల కేలా యబ్బగా నేరుచున్?"

"అమ్మా! నీ కావ్యము మహనీయము కాగలదు. అందలి కథ యేమి? కావ్యవస్తువును, నాయకుని బట్టియుంగదా కావ్యము జగదారాధ్య మగునది!"

"నా కావ్య మొక మిశ్రకథ నాన్నగారూ! తాము విష్ణుభక్తులగుటచే, రామాయణ మన్నచో తమ కాదరము మెండుగదా! అందుకని రామాయణకథ నే నూతన కల్పనముతో కావ్యముగా చిత్రింపదలచి నాను."

"ఆ క్రొత్తకల్పన ఎట్టిదో కథను సంగ్రహముగా వినవలయునని కుతూహలపడుచున్నానమ్మా !"

"అట్లే నాన్నగారూ ! నా కావ్యమునకు 'మారీచీపరిణయ' మని పేరు; మారీచసుబాహులనెడి రక్కసులు ఆలనాడు విశ్వామిత్రుని యజ్ఞమునకు విఘ్నములు గూర్చియున్నారు గదా ! ఆ విఘ్నములను దూరీకరించుటకై శ్రీ రామ లక్ష్మణులు విశ్వామిత్రునికి సాయపడినారు. ఆ సందర్భమున లక్ష్మణునిచేత మారుతాస్త్ర ప్రయోగమున తూలగొట్టబడిన మారీచుడు సముద్రతీరమున బడెను. అక్కడ నతనికి పదునాలుగేడులకన్య యొక్కతె యగపడినది. ఆ పిల్ల మారీచునికి శీతలోపచారములు చేసి అతనిని తేకొారునజేసెను. అప్రయత్నలబ్ధయగు నా కన్యను మారీచుడు అపత్య ప్రేమతో పెంచుచుండెను. సరస్వతీప్రసాదమున, ఆమెను విద్యావంతురాలి నొనర్చి, దండకారణ్యములో ఆశ్రమము గట్టుకొని మారీచుడు నివసించుచుండెను. మారీచునిచే సాకబడిన యా కన్నె మారీచి యను పేర బరగుచు నాతనికి పెంపుడు బిడ్డయైనది. పిమ్మట మారీచుడు మారీచికి తన వృత్తాంతము నెఱిగింపబూనెను. అతని వృత్తాంతము రామాయణకథతో ముడివడి యున్నది గదా ! సీతారామలక్ష్మణులు, అప్పుడు అరణ్యమున నొక పర్ణశాలలో నివసించియున్నారు. సీతారాముల పర్ణశాల మారీచాశ్రమమునకు సమీపమునందే యున్నది. ఒకనాడు ఆశ్రమమునకు దగ్గఱనే యున్న పుష్పవనములో మారీచీ లక్ష్మణులు ఒకరి నొకరు చూచుకొనుట సంభవించినది వారి హృదయములలో ప్రణయబీజ మంకురించి, దినదిన ప్రవర్ధమానము కాజొచ్చినది. ఇంతలో, ఇదివఱకే లక్ష్మణునిచే దెబ్బతిన్న మారీచుడు, అతనికి దగ్గఱగా నుండుట క్షేమము కాదనియెంచి, తన నివాసమును లంక కీవలి సముద్రపు టొడ్డునకు మార్చుకొనెను. అచ్చట ఒకనాడు, మారీచి రావణుని కంటబడినది, అత డామెను మోహించి

దొంగిలించుకొని పోవ నుపాయ మాలోచించుచుండెను. మారీచుడు బ్రతికి యున్నంతవఱకును, మారీచి నపహరించుటకు వీలు కాదని యెంచిన రావణుడు అతని చావునకై మార్గముల నారయుచుండెను. తరువాత రామలక్ష్మణులవలన శూర్పణఖ పరాభవింపబడుట, ఖరదూషణాదులవధ, శూర్పణఖ రావణునికి తన పరాభవమునుదెల్పుట, మున్నగు ఘట్టములు. పిమ్మట రావణుడు శూర్పణఖావమానమునకు క్రుద్ధుడై సీత నపహరించి రామునికి ప్రతీకారము చేయ నిశ్చయించుకొనెను. అందుకు మారీచుని మాయలేడిగా నుపయోగించుకొనినాడు. మారీచవధా నంతరము, రావణుడు రామ, రామా, యని ఏడ్చుచున్నసీతను-లక్ష్మణ, లక్ష్మణాయని విలపించు చున్న మారీచిని లంకకెత్తుకొని పోయెను. తరువాత సుగ్రీవ సఖ్యము' సీతాన్వేషణము, లంకాదహనము, సేతుబంధము—మున్నగునవి యథా ప్రకారమే సాగిపోవును. యుద్ధమారంభమయిన పిమ్మట, ఒకనాటి సమరమున లక్ష్మణుడు మూర్ఛపొందినాడు. రాముడు శోకాకులచిత్తుడై నిరాశతో నున్నాడు. జాంబవంతుడప్పుడు పదునాలుగేండ్లు నిద్రాహారములు లేనివారు సంజీవిని పోసినచో లక్ష్మణస్వామి మూర్ఛనుండి తేరుకొనునని చెప్పెను. అట్టి కఠోరవ్రతు లెవ్వరుందురని విచారించుచుండగా, నారదు డచ్చటికి వచ్చి మారీచి యనుకన్య అట్టిదని చెప్పెను. తరువాత మారీచిని తీసికొనివచ్చి ఆమెచే సంజీవి పోయించుకొని లక్ష్మణుని బ్రతికించు కొందురు. పిమ్మట రాముడు రావణునిగెలుచుట అసాధ్యమని విచారముతో నుండగా, నారదు డాతని నూఱడించి, రావణునకు బ్రహ్మశాప మున్న దనియు, ఆ శాప ప్రభావమున నతనికి కాలము మూడిన దనియు చెప్పి రాముని యుద్ధసన్నద్ధుని జేయును.”

కథ ఎంతో ఆసక్తిజనకముగా నున్నదమ్మా! ఆ రావణుని శాపకథ యేదో చెప్పుము!”

"తొల్లి రావణుఁడు బ్రహ్మనుగూర్చి కఠోరతపమొనర్చి, తనకు చావు లేకుండునట్లు వరమిమ్మని కోరినాడు. బ్రహ్మదేవుడు "పుట్టినవారెల్ల గిట్టక తప్పదనియు, ఇట్టి వాంఛ ప్రకృతివిరుద్ధ" మనియు నుడివెను. అందుకు రావణు డవహాసించుచు—"తాతా! కూతును కామించుట మాత్రము ప్రకృతి విరుద్ధముకాదా?" యనెను. అందుకు బ్రహ్మ కోపించి, కూతును కామించినప్పుడే నీకు చావు మూడును లెమ్ము" అనినాడు. అది యాతనికి వరముగను, శాపముగను పరిణమించినది. రావణునికి మారీచి కూతురు. ఆమె సీతడు వలచినాడు. కావున బ్రహ్మవాక్యముచే రావణునికి చావు తప్పదు. రామా! లెమ్ము. సమరదీక్ష వహింపుము!" అని నారదుడు శ్రీరామచంద్రుని ప్రబోధించినాడు నాన్నగారూ!"

"కథ అతివిచిత్రముగా సాగిపోవుచున్నదే! ఇంతవఱకు విన్న పాఠకులు, మీదికథకొఱకు ఎంత యుత్కంఠతో నుందురో చెప్పజాల నయితిని. కావ్యమాత్రమున కుండవలసిన ముఖ్య గుణములలో నిది యొకటి తల్లీ! సరే తరువాతి కథను వినుటకు నామనస్సు తొందఱించు చున్నది."

"రంభనలకూబరుల ప్రణయము పురాణప్రసిద్ధమే కదా! నల కూబరుని కడకు పోవుచున్న రంభనొకపారి, దారిలో నడ్డగించి రావణుడు బలాత్కారముగా ననుభవించినాడు. అప్పుడామెకు సద్యోగర్భమున నొక కూతురు పుట్టినది. రంభ ఆశిశువు నచ్చటనే వదలి, తనదారిని బోయినది. పార్వతీ పరమేశ్వరు లా మార్గమున బోవుచు ఆ బిడ్డ యేడుపు నాలించి వచ్చి, దాని నోదార్చి, ఆబాలిక నెవ్వరైనను దీసికొని పెంచుకొనువఱకును దాని కాకలిదప్పులుగాని, నిద్రగాని, ఎవ్వరివల్ల నే యపాయముగాని కలుగకుండునట్లు ఆశీర్వదించి పోయినారు. ఆ శిశువు పదునాలుగేండ్లు

ఆ ప్రదేశమున అగ్నియుండి, కడకు మారీచునకు దొరకినది. అటః పెంపకమువలన మారీచి యైనదనుకొంటిమిగదాః కనుక మారీచి రావణునకు ఔరసపుత్రియేః అట్టి నిజకుమారిని వలచిన రావణుడు బ్రహ్మ శాపమువలన చావక తప్పదు. ఈ కథ నెఱింగించిన నారదుడు రాముని మనశ్శల్యమును పెఱికి వైచినాడు."

"ఎంత అపూర్వకల్పనము చేసినావమ్మాః మారీచి జన్మవృత్తాంతము కావ్యారంభమునగాని కావ్యమధ్యమునగాని చెప్పక, యుద్ధకాండమునం దవసర మెఱింగి చెప్పి పాఠకుల కెంతటి యుత్కంఠను కల్పించినావు తల్లీః సరే, తరువాతి కథనుగూడ వినిపింపుము."

తరువాత నింక చెప్పవలసినదేమున్నది నాన్నగారూ ః రావణ కుంభకర్ణాదులవధ, సీత అగ్నిప్రవేశము, సీతారామలక్ష్మణులు మారీచీ సహితులై పుష్పకవిమానము నెక్కి అయోధ్య కేతెంచుట, ఊర్మిళాదేవిని మేల్కొలుపుట, ఆమె పొలయలుక సంగతి నెఱింగి యామె పొలయలు కనువీడిన పిమ్మట, మారీచిలక్ష్మణుల పరిణయము. ఇంకేమున్నదిః కావ్యసమాప్తిః"

"ఈ కావ్యమున నొక చక్కని చమత్కారమును కూర్చితివి గదమ్మాః లక్ష్మణునకు కాబోవు ప్రియురాలైన మారీచి చేతనే అతనిని బ్రతికింపజేయుట అసాధారణమైన కల్పనాచాతుర్యము. లక్ష్మణున కిదివఱకే ఊర్మిళాదేవి పత్నియై యున్నది. ఆమె తన మగ డింకొక్కతివి చెట్టవట్టుట సహింపదు కదాః ఇప్పుడా చెలువ తన భర్తకు ప్రాణదాన మొనరించినదియేకావున,ఊర్మిళకునపత్నీమాత్సర్యముండుటకు గూడ వీలులేకుండ చేసినావన్నమాట!"

"ఏదో చేసినాను నాన్నగారూ, పెద్దల దయవలన."

"సు ప్రసిద్ధమైన రామాయణ కథకు కల్పనయని చెప్పవీలుగాని కల్పనచేసి కవిలోకమునకే మార్గదర్శివి వైనావమ్మా! నీకావ్యము బాణుని కాదంబరివలె కథావైచిత్రి కలదనుకొందును. నీవంటి బిడ్డను గన్నందులకు నాజన్మము తరించినది తల్లీ!

"కమ్మని తేనె లుట్టిపడగా నిపుడీ వొనరించుకబ్బమో
యమ్మరో! యిష్టదైవమున కంకితము న్గలుపంగ నీదు డెం
దమ్మున నీవు నిశ్చయ మొనర్చిన లెస్సఘె, లేకయున్న, నా
కిమ్ము త్వదీయకావ్యసుత, నే నెదఁ జేరిచి, యాదరించెదన్."

"అవు నవు ధాత్రిలో మనుమరాలిని బెండిలియాడవచ్చు, నీ
నవనవ కావ్యకన్య యిది నాయెడ వృద్ధవరుండనాట, మ
క్కువ పడదంచు మానుకొనఁగూడదు; తక్కువయీడుభార్య కె
క్కువయగు మక్కువన్ సుఖముగూరుచు నెక్కువయీడు
భర్తయే!"

మోహనాంగి తండ్రికొక కావ్యము నంకిత మీయవలయునని, ఏనాడో నిశ్చయించుకొన్నది గదా! ఆ ప్రయత్నములోనే అలంతి కల్పనతో చక్కని కథ నెన్నుకొన్నది. నేడు తన పితృదేవుడు స్వయముగా ఆ కావ్యకన్యను తనకిమ్మని కోరినాడు. ఇంక నామెకు కావలసిన దేమి. ఆమె ఏడుకొండల నెక్కినట్లానందముతో నిట్లన్నది.

"నాన్నగారూ! "పితృదేవోభవ" అను వేదవాక్యము, తండ్రి దేవుడనియే చెప్పుచున్నది గదా! మీకు కృతినిచ్చుట దైవమునకిచ్చుటయే! మీరు "నేను ముదుసలి" నన్నారు. రసజ్ఞతకును, ముసలితనమునకును సంబంధ మేమి?

"ముదిరినకొలందిని రసము
గదిరెడుచెఱకట్టులు రసికత ముదిరిన నిన్
ముదుకడ వనవచ్చునె. యె
ట్లొదవును కన్యకల కిట్టి యొడయఁడు తండ్రీ!"

మూరురాయరగండని మలయకూట ప్రాసాదము, మర్మశిల్పముల చేత మహనీయమైనట్టిది. దానిని వెంకణాచార్యాది మహాశిల్పులు సమరాంగణ సూత్రధారము, అపరాజితపృచ్ఛ, మయవాస్తు మున్నగు శిల్ప వాస్తుగ్రంథములను పరిశీలించి, ఒకానొక ప్రత్యేకమైన వాస్తుపద్ధతితో నిర్మించినారు. అందలి స్తంభశిల్పముల వైవిధ్యము, గదులతీర్పు, అంతస్తుల నిర్మాణము, మీదికప్పుల కూర్పు, అనియు సరిక్రొత్తలు. పలు విధములైన పురాణ చరిత్రగాథా శిల్పములకు, చిత్తరువులకు ఆ రాజభవనము నెలవు. అంతఃపురాంగనలతో రాయలు శృంగారగోష్ఠి జరుపుటకును, ఆప్తమిత్రులతో సల్లాపములు చేయుటకును, కవిత్వము వ్రాసికొనుటకును, బిడ్డలతో ముద్దుముచ్చట లాడుటకును, వారి విద్యాభ్యాసమునకును అనువైన నానావిధ కక్ష్య లందున్నవి. అన్నింటను ఏయే వసతులుండవలయునో అవి యన్నియు, ఆ శిల్పాచార్యులు ప్రయోజనము, సౌందర్యము చేకూరునట్లు నిర్మించి పెట్టినారు. ఒక కక్ష్యలో నున్నవారిని మఱొక కక్ష్యలో నున్నవారు చూచుటకును, వారి మాటల నాలించుటకును వలసిన శిల్ప మర్మములతోడి చిఱుగవాక్షము లా యంతఃపురమున నున్నవి. చూచువారికి చూడబడు వారగపడుదురేగాని, చూడబడు వారికి చూచువా రగపడరు. అట్లగపడవలయునన్నచో, దానికి ప్రత్యేక మర్మములు గల శిల్పముల తోడి యేర్పాటు లున్నవి, ఒక్కొక్కసారి, ఆ యేర్పాట్ల నన్నింటిని పరిహరించి, కక్ష్యలో నున్నవారు రహస్యముగా వ్యవహరించుటకును వీలున్నది. నాడు మోహనాంగి కృష్ణరాయలు, గోష్ఠి

చేయుచున్నగదివి ప్రక్కగదిలోని యొక చిత్రగవాక్షమార్గమున నాగిని పరికించుచునే యున్నది. ఆ కుమారీజనకుల సంభాషణమును ఆశుకవిత్వాది విశేషములను తు. చ. తప్పక విన్నది. మోహనాంగి తన కావ్యమును తండ్రి కంకితమీయనెంచిన సంగతి నాగిని కిదివఱకే తెలియునుగదా! ఆమె వెంటనే యొక బంగరుపళ్ళియమున తెలనాకులు, వక్కలు, కర్పూరాది సుగంధ ద్రవ్యములు పెట్టుకొని మోహనాంగి కట్టెదుటకు వచ్చినది. రాయ లామె సమయోచితప్రజ్ఞ కచ్చెరువు పడినాడు. మోహనాంగి ఆ బంగారు పళ్ళెరమును తండ్రికి సమర్పించి, ఆయన యడుగు దమ్ములపై వ్రాలినది. ఆ కృతినాథుఁ డా తనయామణిని లేవనెత్తి దీవించినాడు. అలనాడు అహోబలక్షేత్రమున, మోహనాంగికి, వైష్ణవాచార్యుడు "నీవు గోదాదేవివంటి కవయిత్రివి గావలయు"నని యిచ్చిన దీవెన, శిల్పాచార్యుడు ముత్యాలసరము నొసగి యిచ్చిన అమోఘాశీస్సులు, రాయల మనస్సులో మెదలి, ఆయన నేత్రములు ఆనందబాష్పములతో నిండినవి. ఇట్టి కుమారీ రత్నమునకు, నాగినివంటి ప్రియసఖి దొరకినందులకు గూడ, ఆతేడు మురిసిపోయినాడు. తన దివ్యప్రబంధపఠనమునకు వేళ యయినందున ఆయన యటనుండి తన ధ్యానమందిరమునకు వెడలి పోయినాడు.

మోహనాంగి తన కావ్యమును కృతినందుటకు తండ్రి యియ్యగింపడేమో యని తలంచుచుండెడిది. ఈనాడు తన యుద్దేశ్యము నెఱింగి, స్వయముగానే కృతియిమ్మని కోరినందుల కామె యెంతగానో యుప్పొంగిపోయినది. ఆ సంతోషము పట్టజాలక నాగినితో ఇట్లన్నది.

"చతురంగ బలయుత సైన్యముల్ నడపెడు
నతఁడు నాతో చదరంగ మాడు,
గంగార్భటివి ఆశుకవిత చెప్పునతండు
నా సమస్యాపూర్తి కొన చెందు,

దిక్కుడ్యములను సత్కీర్తిఁ జిత్రించునా
తండు నా వ్రాయు చిత్రములు మెచ్చు,
రాగసంభరితాంతరంగుడౌ నతఁడు, నే
రాగమాలాపింప రక్తి గాంచు,

నన్ను, మన్నాథు, నింట మన్ననలతోడఁ
గన్నులం గప్పుకొని ప్రోచుగాదె, యట్టి
పిత మహాకావ్యకర్త, నన్ గృతిని గోరె;
నాదు భాగ్యంబు వర్ణింపఁగాఁ దరంబె!"

# 11

"ఈ నా డింట బియ్యము లేవు. పిల్లలు అన్నమునకు అలమటించు చున్నారు. పెద్దవానికి దగ్గు, చిన్నవాడు జ్వరపడి నేటి కెనిమిది దినములు. ఈ జ్వరము సన్నిపాతములోనికి దింపవచ్చునని కూడ అనుచున్నారు. ఆ వైద్యుడు సాక్షాత్తు నారాయణమూర్తి గనుక సరిపోయినది. లేకున్న నేమయ్యేడిదో యోచింపుడు. మందులు మాకులు ఉచితముగా నిచ్చుటయే గాక ఉపరసములకు కావలసిన అల్లము, మిరియాలు, సొంటి, పిప్పళ్ళు మున్నగు దినుసులుకూడ ఆ మహానుభావుడే ఇచ్చుచున్నాడు. ఇదంతయు మీ రేదో కవీశ్వరులని ఆయనగారు గౌరవముతో చేయుచున్నాడు. లేకున్న డబ్బు లేకుండ మందులిచ్చువైద్యు లెక్కడుందురు. మన మాయన కెట్లు కృతజ్ఞత చూపగలమో తెలియకున్నది. ఇక ఈడేర సిద్ధముగానున్న ఆడుపిల్లకు సంబంధములమాట యెట్లున్నను, కనీసము ఒడలు దాచుకొనుటకు సరియైన గుడ్డలుకూడ లేవుగదా! పదునాలు మూరల చీరలో ఒడలు దాచుకొనవలసిన స్త్రీ, మూడు మూరల గుడ్డలో

ఎట్లు ముడుచుకొనగలదో విచారింపుడు. ఈ కుచేల దారిద్ర్యము నేట్లు తరింపగలమో ఆలోచింపరా!

"మీరు మహాకవులు, పండితులు, పౌరాణికులు గదా! ఎవ్వరి నాశ్రయించిన నింతసొమ్ము పుట్టదు? ఏ దేవాలయములో కూర్చుండి పురాణము చెప్పకొన్నచో నాలుగువరాలు చేతికిరావు? చిన్ననాట నేర్చిన శిల్పవిద్య యున్నది కదా! ఆ టెంకణాచార్యులవారి శిల్ప విద్యాలయ మున కేగి, యేదో యొక పని చేసికొనగూడదా! అది యొక మహాశిల్ప గురుకులము గదా! అచ్చట మిమ్మొక ఆచార్యునిగానైనను నియమింప వచ్చునే! పోనీ, ఏ దేవాలయమందో, కంచువిగ్రహములు చేయుటకో, శిలాప్రతిమలను చెక్కుటకో పూనుకొనవచ్చును గదా! సారస్వత విద్యలనే గాక, కర్మవిద్యలనుగూడ కైవసము చేసికొన్న రెండంచుల పదునుగల కత్తిగదా మీరు!

"రాజదర్శనమునే చేసికొనవలెను, వారిమన్ననలనే పొందవలెను, వారికే కావ్య మంకిత మీయవలెను అని మీ కేల పట్టుదల? రాజాస్థానము లెంత దుష్ప్రవేశములో ఎఱుగరా! అచటి కవి పండితులకు కవితా పాండిత్యము లున్నంతగా హృదయము లుండవుకదా! వారు తమ స్వార్థమును వీటిబుచ్చుకొని, అన్యులకేల ప్రవేశ మిప్పింతురు? అలనాడు శ్రీనాథ కవిసార్వభౌముడే ప్రౌఢదేవరాయల యాస్థానములో ప్రవేశింప నెన్ని ఇబ్బందులుపడెనో, మీరే చెప్పితిరి గదా! ఆ సహృదయశిఖామణి ముమ్మనాచార్యు డుండుటవలన, ఆయన దయచేత ఆ కవిసార్వభౌమునకు ప్రవేశము చిక్కినదిగాని, లేకున్న నేమయ్యెడిదో! శ్రీనాథుని కా ముత్యాలశాలలో కనకాభిషేక గౌరవము జరిగెడిదేనా! గుణము గ్రహించు వారు గ్రహించినను, మత్సరము వీడి దానిని లోకమునకు జాటువారు లేకున్నచో, ఎంతటి గొప్పవారైనను అడవిబూచిన పువ్వులుకాక తప్పదు.

ఇది యంతయు నేను మీకు చెప్పగలదాన నని చెప్పుట లేదు. నేటి మన కుటుంబస్థితి యట్లున్నది గనుక, ఈ దీర్ఘ సంభాషణము చేయవలసి వచ్చినది. క్షమించి ఇట్టి దుర్దశలోనైనను కర్తవ్యమును నిర్ణయించుకొందు రనియు, బిడ్డలను బ్రతికింతు రనియు వేడుచున్నాను."

నృసింహకవిభార్య అండాళ్ళమ్మ ఈమాట లనుచుండగనే వైద్యుడు వచ్చి మంచముపైనున్న రోగిపిల్లవానిని పరిశీలించినాడు. "ఇది సన్ని పాతజ్వరము. ఇక నుండి విషజ్వరలక్షణములు గూడ ప్రవేశించు సూచన లున్నవి. రోగికి సేవలు బాగుగా జరుగుచుండవలయును. ఒకవేళ రాత్రికి పిచ్చిపిచ్చి మాట లవీ ప్రారంభము కావచ్చును. రోగి గుడ్డలు పీకివేసికొని బయటకు పరుగెత్త యత్నింపవచ్చును. మీరు మిక్కిలి మెలకువతో బిడ్డను కాపాడుకొనవలయును. ఈ రెండు మందుకుప్పెలను అరగదీసి, జీలకర దనియముల రసములో కలిపిపోయుడు: నాలుగు గడియల కొకసారి ఈ మాత్రలను వాడుచుండుడు. ఇవిగో: ధనియము లును జీలకఱ్ఱ" యని రెండు పొట్లముల నామె చేతికిచ్చి ఇంకను ఇట్లనినాడు "అమ్మా! మీ రేమియు అధైర్యపడకుము. నాకు రాజ వైద్యులే గురువులు. నేను వారితోగూడ సంప్రతించి, ఎంత విలువగల మందులనైనను వాడి మీ బిడ్డను బ్రతికింపగలను. మీవంటి విద్యావంతమైన కుటుంబమునకు సేవచేసెడి భాగ్యము కలిగినందుకు ఎంతయు సంతసించు చున్నాను." అని వెడలిపోయెను.

ఇది యంతయు చూచుచున్న నృసింహకవి గుండె నీరైనది. అతడు కన్నుల నీరు గ్రుక్కుకొనినాడు. ఇట్టి ఘట్టములలో పురుషుల కన్న స్త్రీలే ధీరమతులుగా నుందురాయేమి? ఏమోగాని, అండాళ్ళమ్మ మాత్రము గుండె చెదరనీయక, ఆ యాపద నెదుర్కొనుటకు సిద్ధమయి నట్లు ఆమె వైఖరియే స్పష్టము చేసినది. రోగికంటెను చిన్నపిల్లలు

"అమ్మా! అన్న కేమిటమ్మా! పిచ్చి, పిచ్చేమిటి?" అని వెంటబడు చున్నారు. ఆ యిల్లా లా బిడ్డలను ఒడిలో పొదువుకొని, "ఏమియులేదు. అన్నయ్యకు ఇక రెండు మూడు రోజులలో రోగము తగ్గిపోవును. వాడు మీతో ఆడుకొనును. మీకు పాఠములవీ చెప్పును." అనియూర డించినది.

భార్య పలికిన పలుకులు, వైద్యునిమాటలు నృసింహకవి హృదయ మును కదలించి వైచినవి. హరిశ్చంద్రు డాయన హృదిలో మెదలినాడు. ఆండాళ్ళమ్మ ఆయనకు మేనమామకూతురే. ఆ మేనమామయే. నృసింహ కవిని దగ్గరకు దీసి విద్యాబుద్ధులు నేర్పి ఇంతవానిని జేసినాడు. మేనల్లుని కవితాచాతురికి మెచ్చుకొని తనకూతునే యిచ్చి పెండ్లిచేయుటయేగాక, తన ఏకైక పుత్రునితోబాటు తనకున్న ఆస్తిలో భాగముకూడ కొమార్తకు పంచియిచ్చినాడు. అండాళ్ళమ్మకున్న నగలుకూడ అమూల్యములైనవి. అవి యన్నియు ఆ తండ్రి యౌదార్యమువలన నేర్పడినవే. ఆ నగలు కూడ విద్యానగరమునకు వచ్చిన పిమ్మట దినక్రమమున వణిజుల యింటికి నడచినవి. ఇంకొక్కనగ మిగిలియుండు నని నృసింహకవి భావన. దానిని నగయందురో లేదో తెలియదు. అది యామె మాంగ ల్యము. అదియును అమె పుట్టినింటివారు చేయించినదే. దానిపై నవరత్న ములు గూడ పొదుగబడియున్నవి. దాని నమ్మినచో చాల ధనము రాగలదు. దరిదాపొక రెండు నెలలైనను ఆ ధనముతో జీవింపవచ్చును. ఇప్పటి కష్టములనుండి యది గట్టెక్కింపగలదు. నృసింహకవికి రోగిని చూచిన కొలదిని గుండె చెఱువగుచున్నది. అతడిక చేయునదేమియు లేక భార్యతో నవినాడు.

"నీ మాంగల్య మున్నది కదా! దాని నమ్మి వెచ్చనచ్చములు తేగూడదా! దానికి బదులుగా పసుపుకొమ్ము కట్టుకొనవచ్చును గదా!

ఇట్లనుచున్న నా దౌర్భాగ్యమునకు నేను బాధపడుచునే యున్నాను. అయినను స్థితిగతు లిట్లున్నవి! నే నేమి చేయుదును! నేటితో ఏదో మార్గము త్రొక్కెదను. ఈ ఆపదను దానితో గడపుము."

భర్త యీమాట లనునప్పటికి ఆండాళమ్మకు దుఃఖము ముంచు కొనివచ్చినది. అయినను మగని నియమశీలతకును. "కడుపుకూటికి ఒరులను వేడబోవ"నను దీక్షకును ఆమె లోలోన సంతోషగర్వముల నందినది.

"ఆ మాంగల్యమును మూడునెలలనాడే విక్రయించి డబ్బుతెచ్చుట యైనది. ఇంతకాల మదియే మన ప్రాణములు నిలిపినది. ఆ మాంగల్య స్థానమున కట్టుకొన్న పసుపుగొమ్ము ఇదిగో!" అని ఆ యిల్లాలు పమ్యెదలోపలనుండి మంగళసూత్రమునకు గట్టిన పసుపుగొమ్మును వెలికి దీసి చూపినది, ఇక నృసింహకవియెడద ఎట్లు నీరైనదో చెప్పలేము, ఆ ఇల్లాలి కుటుంబ నిర్వహణదీక్ష కాతడెంతగానో సంతసించినాడు. తన మేనమామ, తనబిడ్డ నీయల్లు డెంతగానో సుఖపెట్టగలడని తన కిచ్చి చేసినాడు. తాను సుఖపెట్టెడురీతి ఇట్లున్నది. ఇకనాత డక్కడ ఒక్కక్షణ మైనను నిలువలేకపోయినాడు. భారము నంతయు ఆ శ్రీరంగనాథునిపై వేసి ఆత డీవలకు వచ్చినాడు.

నృసింహకవి లౌకికుడే యైనచో, తిమ్మకవీంద్రునో; రుద్రకవినో ఆశ్రయించి కార్యసాఫల్యము చేసికొనెడివాడే! అదికూడ ఆతనికి చేత కాలేదు. అయినను, పెద్దన కాదనలేదు గదా! "కొంచె మోపికపట్టిన పని చూతు" నన్నాడాయెను. కాని, నృసింహకవికి మఱల పెద్దనవద్దకు పోవుటకు మనసొప్పలేదు. ఇప్పటి కెన్నిసారులో ఆయన చుట్టును తిరుగుట యైనది. ఇంకను వెంటపడుట కాతని కిష్టము లేకపోయినది.

అతడు, ధూర్జటికవీంద్రు డంతర్ముఖుడై యేవేవో భక్తిసాధనలవీ చేయు చున్నాడని విన్నాడు. ఆయనకడకు పోయినచో పని కాగలదేమో యని అతనికి తోచినది. నృసింహకవి ధూర్జటిగారియింటి కేగి తన రాకకు గల నిమిత్తమును తేటపఱచినాడు. ధూర్జటి తా నప్పుడే వ్రాసిన పద్యముగల తాటియాకును నృసింహకవిచేతి కిచ్చినాడు. అందిట్లున్నది.

"రాజు ల్మత్తులు, వారిసేవ నరక ప్రాయంబు, వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్, తదపేక్ష చాలఁ బరితృప్తిం బొందితిన్, జ్ఞాన ల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!"

ధూర్జటికవి తన సంస్కారములకును ప్రవృత్తికిని దగినట్లు నృసింహకవి నుద్దేశించి —

"శ్రీకృష్ణదేవరాయలవారు, నేను వర్ణించిన రాజకోటిలోనికి రారనుకొమ్ము. అందుకవియే నే నింకను వారికొలువును వీడలేదు. అసలు రాయలవారు మెచ్చునంతమాత్రమున,ఆయన కంకితమీయనంతమాత్రమున కవుల కావ్యములు గుణహీనములగునా? "సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే" అనుసూక్తిని మఱచినారా? సత్పురుషులు గుణమున్నదానిని వీడలేరు. మీ గ్రంథము విశిష్టాద్వైత తత్త్వప్రతిపాదక మంటిరిగదా! అట్టి దానిని శ్రీరంగనాథునికే అంకితమిచ్చిన మీ జన్మ తరించునే! ఇంతటి భక్త శిఖా మణివి, మఱల నీ యైహిక జంబాలములోనికి దిగనేల?" అని చెప్పుటయే కాక శ్రీకాళహస్తీశ్వర శతకమునుండి వైరాగ్యబోధకములైన కొన్ని పద్య ములనుగూడ చదివినాడు.

నృసింహకవిమీద ధూర్జటియుపదేశము పనిచేసినది. అసలిదివఱకే అతని తండ్రి కవికర్ణరసాయనమును భగవదంకితము చేయుమనిచెప్పినాడు.

నృసింహకవి పితృవాక్యము నప్పుడు పాటింపజాలక యీ యిబ్బందుల నన్నిటిని కొని తెచ్చుకొన్నాడు. అతని కిప్పుడు "పెద్దవారిమాట పెరుగ న్నపు మూట" అని తెలిసివచ్చినది. ఏనాడో మరణించిన తండ్రి స్థానములో నుండి ధూర్జటికవీంద్రుడీ సదుపదేశమును తనకు చేసినాడని నృసింహకవికి తోచినది. అతడు ధూర్జటికి భక్తితాత్పర్యమున కృతజ్ఞత లర్పించుకొని యింటికి చేరుకొన్నాడు.

వైద్యుడు చెప్పినట్లు రాత్రికి పిల్లవానికి సన్నిపాతలక్షణములు ప్రవేశించినవి. అతడు వెఱ్ఱిచూపులు చూచును. పిచ్చిపిచ్చిగ మాటలాడును. గుడ్డలుపీకివేసికొనును. మంచముపై నిలువక, పర్వెత్తబోవును. వైద్యుడు తన గురువైన రాజవైద్యుని గూడ తీసికొనివచ్చి చూపినాడు. అతడును శక్తికొలది యత్నించినాడు. ఎంత గొప్ప వైద్యుడైనను మందు పోయునే గాని, ఆయువు పోయలేడుగదా ! పదునొకండవనాటి రాత్రి గరళముకూడ పోసినారు. ఆయుర్వేదములో గరళము పోయుట తుదివైద్యము. దానితో రోగము కుదిరిన కుదురును; లేకున్న యమదర్శనము తప్పదన్నమాట. గరళము పోసిన పిమ్మట, పిల్లవాడు బాగుగా తేరుకొనినాడు. తలిదండ్రులకు, అన్నదమ్ములకు చక్కఁగా మాటలు చెప్పినాడు. కవికర్ణరసాయనములోని పద్యములను పెక్కింటిని చదివినాడు. తండ్రి చెప్పుచుండగా, ఆ కావ్యములోని కొంతభాగమును వ్రాసినది వాఁడే! అందుచే వానికందలి పద్యము లనేకములు కంఠస్థములు. ఇక కుమారుడు బ్రదుకునని తలిదండ్రులాసపడినారు. కాని ఇది యంతయు రోగచర్యయు, గరళముయొక్కఁ ప్రభావము మాత్రమే. రోగము తగ్గుటకాదు. ఆఱిపోయెడి దీపము చివరి కెక్కుఁవగ వెలుగులు విరజిమ్మునుగదా ! కొంతసేపటికి పిల్లవాని కాలుసేతులు చల్లబడినవి. మఱుక్షణముననే ఆ యిల్లు రోదనధ్వనులతో నిండిపోయినది.

# 12

మారీచీ పరిణయ కావ్య రచనము శరవేగముతో సాగిపోవు చున్నది, మోహనాంగి చెప్పుట, నాగిని వ్రాయుట. కావ్యేతివృత్తము నంతటిని కవయిత్రి అతాశ్వాసములుగా విభజించుకొన్నది. ఏ ఆశ్వాస ములో ఎంతవరకు కథను వర్ణింపవలసినదియు, ఒక పద్ధతి ప్రకారమామె కూర్చుకొన్నది. ముందు కావ్యావతారికలో - ఇష్టదేవతాస్తుతి, కవిగురు వందనాదికము అయిన పిమ్మట కృతినాథుడగు రాయలవారి వంశము నభివర్ణించినది. అప్పటికి కావ్యమున మూడాశ్వాసములు ముగిసినవి నాలుగవ యాశ్వాసము వ్రాయబడుచున్నది. కావ్య మారంభించిన వేళావిశేషబలమో, లేక అంకిత మిచ్చినందువలన గలిగినశుభమో కాని, మహారాజ్ఞి తిరుమలదేవి కప్పటి కొక కుమారుడు జన్మించినాడు. పిమ్మట కొలదికాలముననే వరదాదేవికిని ఒక పుత్రుడు పుట్టినాడు. ఈ శుభమునకు రాయలే కాదు, అంతఃపురమే కాదు, సామ్రాజ్య మంతయు నుప్పొంగి పోయినది. అప్పటికి వేంగళాంబకు కూడ పెండ్లియైనది. ఆమెను మట్ల సోమరాజు పౌత్రుడును, పోతరాజు కుమారుడును నగు వరద రాజున కిచ్చినారు. మట్లవంశముగూడ పౌరుషప్రతాపములకు పేరు పడినట్టిదే। వరదరాజుగూడ శ్రీకృష్ణరాయల కల్లుడు కాదగిన సర్వయోగ్య తలును గలవాడే. ప్రజలు, అల్లుండ్రు వచ్చిన వేళావిశేషమువల్లనే కృష్ణరాయాచ్యుతరాయలకు పుత్రోదయ మైనదని యెంచినారు. "బిడ్డ పుట్టినవేళ, గొడ్డు వచ్చినవేళ" అని మనవారనుచుందురుగదా ! కాని రాయలవారికిని, తిరుమలదేవికిని మోహనాంగి "మారీచీపరిణయ కావ్యము" నంకిత మందినందువలననే తమ కీ శుభము చేకూరినదని నమ్మకము. ఇక మోహనాంగి యభిప్రాయముకూడ అట్టిదే. ఆమె, తండ్రికి కావ్యమును

కృతి యీయ నెంచి, అంకితపు పద్యములు వ్రాయునప్పు డట్టి దివ్యసంకల్పముతోనే యున్నది. ఆ సంకల్పమున కీశ్వరానుగ్రహము తోడైనది. అసలామె విరూపాక్ష దేవునిపై గాఢభక్తి కలది. ఈ సామ్రాజ్యము విరూపాక్షుని యనుగ్రహమువల్లనే వర్ధిల్లుచున్నదన్న రహస్యము నామె యెఱుంగును. కృష్ణరాయలకు పూర్వులైన సంగమవంశీయులు మున్నగువారు శ్రీ విరూపాక్షస్వామి పాదానుధ్యాతులే. తుళువవంశము వారి నుండియే వైష్ణవము ముదిరినది. ఈ రహస్యము నెఱింగిన మోహనాంగి తాను వైష్ణవుల యింట బుట్టి, వైష్ణవుల యింటినే మెట్టినను, శివ కేశవ భేదమును పాటింపక ప్రవర్తించెడిది. తన తండ్రి కొక పుత్రరత్నమును ప్రసాదింపుమని యామె విరూపాక్షదేవు నెంతగా ఉపాసించినదో, నాగినికి దక్క రాజకుటుంబమువారికే తెలియదు. ఆమె ఉపాసనల ఫలితమే యిప్పుడు రాయలవారికి కలిగిన కుమారుడు. అందుచే, ఆ కుమారునికి సదాశివుడని పేరు పెట్టిన దామె. మారీచీ పరిణయము చతుర్థాశ్వాసాదిని, ఆమె తన ముద్దుల తమ్ముని నిట్లాశీర్వదించినది—

"మార్కండేయచిరాయువున్, సకల సామ్రాజ్యంబు, నాచంద్రతా
రార్కంబైన యశంబునుం గలిగి యే యంశంబునం, దోష సం
పర్కం బొందక, కోరుచే తడవుగా మా ముద్దుతమ్ముండు తాఁ
గోర్కుల్ దీరి సదాశివుండఁగుచు నీ క్షోణిన్ మనున్ గావుతన్ !"

రాయలవారికి, కొడుకునకు తిరుమలరాయ లని పేరు పెట్టుకొనవలయునని కోరిక యున్నది. ఆయన తిరుమలేశుని భక్తుడుగావునను, తన భార్య పేరును, పెద్దకూతురు పేరును అదియే యైనందునను, లేక లేక కలిగిన యీ అల్లారుముద్దుబిడ్డనికి గూడ తిరుమలరాయలని పేరు పెట్టుకొన్నచో, అతనికి తిరుమలనాథుని యనుగ్రహ మవ్వారిగా లభింపగలదని

రాయ లక్ష్మే పిలుచుకొనుచుండెను. తక్కినవారుగూడ రాయల కిష్టమైన పేరుననే వ్యవహరించుచు వచ్చిరి. కాని మోహనాంగి కిది యెంతమాత్ర మిష్టము కాదు. అయినను పితృదేవున కామె యెదురు చెప్పదుగదా ! ఈ బిడ్డడు తన పూజల ఫలముగా గలిగినవాడని సూచింపవలసివచ్చునవికూడ ఆమె తండ్రికోరికను కాదనలేక పోయినది. అచ్యుతదేవరాయల కొడుకు నకు వేంకటపతిరాయలని నామకరణము చేసినారు. అంతఃపురములో వేంకటాద్రియను ముద్దుపేరున వానిని బిలుచుకొనెడివారు.

వరదాదేవి, తనతమ్ముడైన చినతిర్మలరాజునకు మోహనాంగి నీయకపోయినను, వేంగళాంబ నైనను ఇత్తురని ఆశ పెట్టుకొన్నది. అదియును జరుగలేదు గదా ! నిజముగా వరదాదేవి కిది యొక ఓటమియే యైనను, అల్లుండ్రుడు వచ్చిన పిమ్మటనే తనకును, తన అక్క తిరుమల దేవికిని పుత్రసంతానము కలిగె నన్న సంతోషముతో ఆమె తన పరాజయ మునకు కుందలేదు. పరిస్థితులయు, సంఘటనలయు ప్రభావ మిట్లు మనుజులపై పనిచేయుచుండుట సహజమే కదా !

# 13

సాంసారిక విషయములతోను, అనేక జీవిత సమస్యలతోను విసుగు చెందినవారికి క్రీడ లనునవి మనస్సునకు ఊఱటను, విశ్రాంతిని, వినోద మును చేకూర్చును. రాయలయుగమున జనులు, తమ తమ తాహతులను బట్టి ఆ యా ఆటలతో కాలక్షేపము చేయుచుండువారు. చిన్నపిల్లలయి నచో, బాలురు—చెడుగుడు, బిల్లంగోడు, కోలాటము, ఉప్పనబట్టెలు, కోల్రకోతులు, దూరనగ్రోలలు, కుందికాళ్ళు-మొదలగు నాటలను, బాలి కలు-గుజ్జనగూళ్ళు, బొమ్మపెండ్లిండ్లు, చెమ్మచెక్క, గూఢమణి, అచ్చన

గండ్లు, గీరనగింజలు, చిట్లపొట్లకాయ, దాగిలిమ్రుచ్చులు, వెన్నెలకుప్పలు, వామనగుంటలు—మున్నగు నాటలను ఆడుచుండువారు. పెద్దవారైనచో-కోళ్ళ, పొట్టేళ్ళ, గుఱ్ఱములు మొదలగువానితో పందెములు చఱచి క్రీడించువారు. వీనివలన ధనసంబంధములైన లాభనష్టములు కలుగు చుండెడివి. ఇట్టి లాభనష్టములను గూర్చు క్రీడలలో జూద మొకటి. ఈ ద్యూతక్రీడ వేదములనాటినుండియు కొనసాగుచునే యున్నది. దీనిని సప్తవ్యసనములలో నొక్కటిగాగూడ లెక్కపెట్టినారు. దీనివలన గలిగిన యనర్థములకు నలునను, ధర్మరాజును గుఱియైనట్లు మనకు పురాణ వాఙ్మయము చెప్పుచున్నది.

రాయలవారికి చదరంగ మనిన ప్రీతి మెండు. ఆ కాలమున, బొడ్డుచర్ల తిమ్మన యనునత డెక్కువగా రాయలతో చతురంగ మాడు చుండువాడు. చదరంగమునందు తిమ్మనకు గల నేర్పు సాటి లేనిది. రాయలవా రొక్కొకసారి పందెపుటాటలనుగూడ ఆడుచుండువారు. రాయలవారినుండి తిమ్మన వేనకువేలు ధనమును గెలుచుకొనుచుండువాడు. ఒకసారి తిమ్మన క్రీడాకౌశలమును మెచ్చుకొన్న రాయలు, "కొప్పోలు" అను గ్రామమును తిమ్మన కగ్రహారముగా నిచ్చివేసినాడు.

"శతసంఖ్యా లొక్కపైనను
సతతము శ్రీకృష్ణరాయ జగతీపతితో
చతురంగ మాడి గెలుచును
కృతిమంతుడు బొడ్డుచర్ల తిమ్మన బళిరే !"

రాయలు మహాదాత కావున, బొడ్డుచర్ల తిమ్మనకు ధనరాశు లిచ్చినను, తా నెల్లప్పుడు చదరంగమున ఓడిపోయెడు వాడని యర్థము కాదు.

ఆయన క్రీడాకళాపోషణమున కిది యొక నిదర్శన మన్నమాట. ఆ మహానుభావుని దాతృశీలత, గుణానురాగము అట్టివి !

ఈ చదరంగపుటాటలను, స్త్రీ పురుష బాల వృద్ధ భేదము లేకుండ అందఱు నాడుచుండువారే. చదరంగ మొక వింతయైన ఆట. దాని పేరులోనే ఆ వింత పొడగట్టుచున్నది. చతురంగబలములతో గూడినదే చదరంగము. ఇందు వాడబడు పావులు-గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, కాలిబంట్లు - అని నలురీతులలో నుండును. వానిని నడపుటకు రాజును, మంత్రియు నుందురు. ఆట కొన్ని కట్టుబాట్లతో సంగ్రామము జరిగినట్లే సాగిపోవుచుండును. రాయల అంతఃపురమున నీ యాటను పిల్లలు, పెద్దలు, రాజులు, రాణులు. సఖులు, పరిచారికలు - అందఱు నాడుచుందురు.

ఆనాడు మోహనాంగి మారీచీపరిణయ కావ్యఘట్టములను కొన్నిటిని చదివి తండ్రికి వినిపించినది. ఆయన తత్కావ్యరసపానమున దొప్ప దోగినాడు. మఱొకరీతి కాలక్షేపము చేయుట కాయనకు వేడుక కలిగినది. అట్టి తఱినెల్ల, చదరంగ మాడుటయే ఆ తండ్రీ కూతుల కిష్టము. ఆట ప్రారంభించిన పిదప నిప్పటికి రెండుసార్లు మోహనాంగియే గెలిచినది. ఏ యాటలో నయినను సరియేః ఓడినవారి కావేశ మెక్కువగా నుండుట సహజము. వారు, తాము తప్పక గెలుపు సాధింపవలయు నను పట్టుదలతో నుందురు. రాయలవారి యంతటి మహా వ్యక్తికిగూడ కూతురు గెలిచినది గదా యన్న సంతోషమునకు బదులు, మాత్సర్యమే రెట్టించినది. ఆ యాటలో నున్న గుణ మట్టిది. ఆయన ఈ తూరి తానే గెలుపొందవలయు నని పట్టుదలతో నాడుచున్నాడు. మోహనాంగి కూడ అట్టి పట్టుదలతోనే మూడవ గెలుపు సైతము తానే

పొందవలయునను యత్నములో నున్నది. ఆట నడుసంద్రములోనికి వచ్చినది. ఉభయ సైన్యములును మోహరించి యున్నవి. భటులు చచ్చుచున్నారు. ఒక ప్రక్క రాయలవారి మంత్రి ఏనుగుతో గూడ కాచి యున్నాడు. ఈ రెండుపావులకును నడుమ మోహనాంగి బంటు చిక్కుకొని పోయెను. ఎటు కదలుటకును మోహనాంగి బంటునకు వీలు కాలేదు. అతనికి చావక తప్పనిస్థితి కలిగినది. ఈ స్థితి విజయాభిలాషియైన రాయల కానందము గూర్చినది. ఆయన తనకే ఈ తూరి గెలుపు నిశ్చయమన్న తృప్తితో నున్నాడు. మోహనాంగికి ఈ తడవ తనకు ఓటమి తప్పదన్న నిశ్చయ మేర్పడినది. ఆమె తనబంటును ఆడుకొనలేక పోయినది. ఇట్టి సందర్భములలో చదువుకొన్నవారికి సమయోచితములైన పద్యములు, పద్యపాదములు తోచుచుండును. ఆమె చాలసే పాలోచించి, తన బంటునకు కలిగిన సంకటమును గూర్చి —

"ఉద్ధతుల మధ్యమునఁ బేద కుండఁ దరమె !"

అని యన్నది. ఆ పద్యపాద మేదో సందర్భమునందలి అర్థాంతరన్యాసము వలె రాయలకు తోచినది. ఆకవితల్లజుడాశ్చర్యముతో ఆటనాపి, పద్యమును పొంతము చదువవలసినదని మోహనాంగిని కోరినాడు. ఆమె "అది యేదో స్త్రీవర్ణనపద్యములే నాన్నగారూ ! నేను చదువదగినదియు, మీరు వినదగినదియుకాదు." అన్నది. సత్కవితావ్యసనియగు రాయలు "అయినను చదువు మమ్మా ! కవిత్వమే గదా, తప్పులేదు." అని నిర్బంధ పెట్టెను. అంతట మోహనాంగి పద్యము నిట్లు చదివినది.

"ఒత్తుకొని వచ్చు కటి కుచోద్వృత్తిఁ జూచి
తరుణి తనుమధ్య మేడకో తలఁగి పోయె;
ఉండె నేనియుఁ గనఁ బడకున్నె ? యహహ !
ఉద్ధతుల మధ్యమునఁ బేద కుండఁ దరమె !"

అంతట రాయ లా కవితాసౌభాగ్యమునకును, వర్ణనాచాతురికిని అచ్చెరువడి "ఈ పద్యము నే సందర్భమున వ్రాసితి వమ్మా!" అని యడిగెను. అందుకు మోహనాంగి—"ఈ పద్యము నేను వ్రాసినది గాదు నాన్నగారూ! ఒకనాడు మన నాగిని తెచ్చి నా కిచ్చినది. సందర్భమునకు సరిపడగా నిప్పుడు నేను చదివినాను." అని జవాబిచ్చినది. రాయలు వెంటనే నాగినిని పిలిపించి "నీ కీ పద్య మెక్కడిది? దీని వృత్తాంత మేమి?" అని యడిగెను.

"ప్రభువులు దివ్యచిత్తముతో నవధరింపవలయును. ఆయన దే యూరో నాకును దెలియదు. అయన పేరు సంకుసాల నృసింహకవి యట. మాంధాతృచరిత్రమును "కవికర్ణరసాయన"మను పేర ఆ ఆశ్వాసముల కావ్యముగా వ్రాసినా డట. దానిని దేవరవారి కంకిత మీయ దలంచి ఈ నగరమునకు వచ్చినాడట. తమ్ము దర్శింప వీలు చిక్కలేదట. అంతట బహుళకుటుంబమును నిర్వహింప జాలక, తన పద్యముల నమ్మకొని జీవనము చేయ నారంభించినాడట. నే నీ వృత్తాంతమును రాజవీథిలో విని, కొన్ని పద్యములను పరిశీలించి ఆయనకు కొంత ధన మిచ్చి రెండు పద్యములను తెచ్చినాను. అందొక్కటి అమ్మగారికి కానుక పెట్టినాను."

"రెండవ పద్య మేది?"

"యతి విటుడుగాక యుండు టెట్ల స్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున!
విటుఁడు యతి గాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున!"

"ఇది, ఆ రెండవ పద్యము."

---

*నృసింహకవి యింటిపేరు టంకసాల అనియు అందురు.

ఈ పద్యమును విన్నపిమ్మట రాయలు ఆట చాలించినాడు. ఆతని హృదయములో నృసింహకవి ప్రవేశించినాడు. రాయ లిట్లు తలపోయ సాగెను....

"నృసింహకవి యెంతవాడు కాకున్న ఇట్టి ప్రతిజ్ఞ చేయజాలును! స్త్రీ మధ్యమునే యింతచక్కగా వర్ణించినవాడు. తక్కిన అవయవముల వర్ణనమున ఇంకెంత చాతుర్యమును ప్రదర్శించి యుండడు; అంగవర్ణన మునే ఇంతసొంపుగా చేసిన కవి, కావ్యము నింకెంత రమణీయముగా వ్రాసియుండడు! ఇట్టికవి తన పద్యముల నమ్ముకొని బ్రదుకవలసివచ్చినదా! ఈ పద్యవిక్రయము, తన యేలుబడిలోని విద్యానగరమందే తాను జీవించియుండగనే జరిగినదా?" ఇట్లు తలంచి చారులను పిలిపించి నగర మంతయు వెదకి నృసింహకవిని తనకడకు తీసికొని రావలసినదని యాజ్ఞాపించెను. వారు రెండుమూడు వారములు పట్టణమంతయు గాలించి వచ్చి, "ఆ కవి కొంతకాలము క్రిందటనే విజయనగరమును వీడి శ్రీరంగ క్షేత్రమున కేగినాడట." అని చెప్పినారు. ఆ మాట విన్న రాయలు పడిన బాధ యింతింత గాదు. "ఒక మహాకవికి తనప్రాపు దొరకకపోవుట, అది కారణముగా నాతడు పద్యవిక్రయము చేసి జీవించుటయే గాక, కడకు నగర పరిత్యాగముకూడ సేయుట — తీరనట్టి సరస్వతీద్రోహముగా రాయలకు తోచినది. రాయలకు అంతర్వాణులేమి, కవులేమి సాక్షాత్తు సరస్వతీ స్వరూపులే! శిల్పులు అపర విశ్వకర్మ దైవతములే! ఇట్టిస్థితిలో ఒక కవికి కలిగిన నష్టమున కాయన చింతించుటలో నాశ్చర్యమేమి? ఆయన శ్రీరంగమునకేగి నృసింహకవిని దీసికొని రావలసినదని చారుల కాదేశించెను.

* *

రాయల కప్పటి కింకను వార్ధకము రాలేదు. అయినను ఆయన చేసిన దండయాత్రలు, దేశమునకు చేసిన యెడతెగని సేవలు, కావ్య రచనమునకై చేసిన నిరంతర మనఃపరిశ్రమ ఆయన ఆరోగ్యముపై దెబ్బ తీసినవి. ఆయన వ్యాధిగ్రస్తుడై మంచమెక్కినాడు. ప్రాణాచార్యులు, రాజవైద్యులు జాగరూకతతో పరిశీలించి మందులిచ్చుచునే యున్నారు. ఒకనాడు పెద్దన రాయలను సందర్శింప వచ్చి నృసింహకవినిగూర్చియు, ఆయన కావ్యమునుగూర్చియు చెప్పినాడు. ప్రభుదర్శనమునకు తీసికొని రావలచి, తాను నృసింహకవికి కబురంపగా, అత డప్పుడే శిల్పివాడలోని తన బాడుగయింటిని వదలి శ్రీరంగక్షేత్రమునకు వెడలిపోయినట్లు భృత్యుడు చెప్పినాడని పెద్దన రాయలకు విన్నవించుకొని విచారపడినాడు. ఈ సమయమున, అచ్చటనే యున్న రాజవైద్యుడు సంగతిని గ్రహించి నృసింహకవి కుటుంబవిషయములను, ఆయనభార్య యోగ్యతను, వారి పుత్రుడు సన్నిపాత జ్వరముచే మరణించుటయు, కడకు నృసింహకవి ధూర్జటికవీంద్రుని బోధచేత విరక్తుడై శ్రీరంగమునకేగుటయు మున్నగా గల సంగతులను రాయలకు నివేదించెను. ధూర్జటిబోధ నృసింహకవి కహంకృతి కలిగించి యుండవచ్చునని రాయలు భావించెను. ఇంతలో శ్రీరంగమున కేగిన చారులు వచ్చి "నృసింహకవి శ్రీరంగములో శ్రీరంగేశ్వరుని సేవలలో మునిగి తేలుచున్నాడనియు, ఆయన ఆ దేవాలయ శిల్పకార్యములలో తల మునకలై యున్నాడనియు. ఆయనకు ప్రపంచ విషయము లేమియు పట్టునట్లు లేవనియు, "ప్రభువులు తమ కభ్యంతరము లేనిచో, శ్రీరంగధాముని సేవల కొకసారి దయచేసి, తా నొనరుచు శిల్పకార్యములను దర్శించి తన్ను ధన్యునిజేయ గోరుచున్నాడని కృతజ్ఞతాపూర్వకముగా మనవి చేసికొన్నట్లు నివేదింపు" డన్నాడనియు

మనవిచేసిరి. రాయలు, నృసింహకవి యోగ్యమార్గమునే యెన్నుకొన్నాడని సంతసించెను. పెద్దనయు తృప్తిపడెను.

# 14

రాయల వ్యాధిమాత్రము తగ్గుముఖము పట్టలేదు. ఏ మందులును పని చేయుటలేదు. అప్పటికి రాయల కూమారుడు తిరుమలదేవరాయలకై పేఁడ్లు పిండినవి. రాయలు కుమారుని పట్టాభిషేక మహోత్సవము చూడఁగోరదలచి, ఆ చిఱుతవానికి రాజ్యాభిషేక మొనర్చి చక్రవర్తినిగా ప్రకటించెను. రాజ్యకార్యములు రామరాజును, అచ్యుతదేవరాయలును తిమ్మరుసుసాయముతో చూచుకొనుచుండిరి. తిమ్మరుసు మంత్రియు నప్పటికి ముసలివాడైనాడు. ఆయన కుమారుడు తిమ్మదండనాథుడు, తండ్రి నిర్వహించిన మంత్రిపదమును తన కీయవలసిన దని రాయలవారిని ప్రార్థించెను కాని, రామరాజాదుల అనుకూల్యము లేనందున, రాయలవారు తిమ్మదండనాథుని వాంఛ నెఱవేర్పలేకపోయినాడు. అది తిమ్మరుసు కుమారుని యసంతృప్తికి హేతువైనది. ఇట్లుండ, పట్టాభిషిక్తుడై సంవత్సరము తిరుగక మునుపే, కుమారతిరుమలరాయలు హఠాత్తుగా మరణించినాడు. ఇక రాయలవారి శోకము తగ్గు టెట్లు? లేక లేక కలిగిన చిన్నారితండ్రి అభిషేకపుతడి ఆరీఆరకముందే, ఏ అచ్చట ముచ్చటలు జరుగని లేఁబ్రాయమునందే మరణించినాడాయెను. అంతఃపురమంతయు దుఃఖసముద్రమున మునిగిపోయినది. తల్లి తిరుమలదేవి అన్నమైన తినుటలేదు. మోహనాంగి సర్వకార్యముల నుజ్జగించి శిశువుకొఱకై విలపింపసాగినది. తిమ్మరుసు కుమారుడు తిమ్మదండనాథుడే, రాజకుమారుని విషప్రయోగము చేసి చంపినాడని వదంతులు బయలు దేరినవి. ఇక చింతకుముందే, మంత్రిపదవికై యత్నించి విఫలు

డైనాడు గానః రాయలపై పగసాధించుట కిట్టి ఘోరమును చేసియుండు ననియే లోక మూహింప వీలు చిక్కినది. కుమారు డీ పాపమును తండ్రియైన తిమ్మరుసు నామోదముతోనే చేసియుండుననియు నింకొక వదంతి. ప్రజలు సత్యాసత్యము లాలోచింతురా? "ఎద్దీనిన దన్న, గాట గట్టివేయు మందురు!" "పులి మూడు మూర అన్న, తోక తొమ్మిది మూర లందురు" గదా! ఏ నోట బట్టినను రాజద్రోహి తిమ్మరుసయ్యాయే యన్న పలుకులు వెలువడుచున్నవి. రాయ లీ విషయమును నమ్మలేక పోయినాడు. తన కింతవఱకును కుడిభుజముగా నున్న తిమ్మరుసేమి, తన పుత్రునే చంపించుటయేమి? ఇది నమ్ముటకును, నమ్మకుండుటకును వీలుగాని సంగతి యైనది. అయినను, రాజదండమునకు దయాదాక్షిణ్యము లుండవు గదా! రామరాజు తిమ్మరుసయ్యను సకుటుంబముగా కారాగార బద్ధు నొనర్చినాడు.

అంతఃపురమున నొకవంక రాజపుత్ర మరణమునకు సలకము చినతిరుమలరాజు కారణమని కూడ కొందఱు భావింపజొచ్చిరి. ఇదియు నమ్మదగినదిగానే యున్నది. రాయలు, చిన తిరుమలరాజునకు తన కూతుల నిచ్చుటకు విముఖుడైనాడు గదా! ఆ కక్షను తిరుమలరాజు మనస్సులో పెట్టుకొని, రాకుమారునికి విషప్రయోగము చేసి చంపి, ఆ నేరమును తిమ్మరుసయ్యా మీదికి త్రిప్పినాడని ఈ పక్షమువారు కారణములు చూపుచున్నారు. ఇదికూడ విన్న వారికి సమంజసముగనే తోచినది. చినతిరుమలరాజు, కృష్ణరాయల కల్లుడైనచో రాజ్యమున నాతని కధికారము చెలాయించుటకు వీలుండెడిది. ఆ యవకాశము దూరమైనందున, అతడు రాయలకుమారుని చంపుట తగినపనియే గదా! ఇప్పుడు రాయలు అపుత్రకుడైనందున తన బావగారైన అచ్యుతదేవ రాయలకు రాజ్యము సంక్రమింప గలదు. రాజకుమారుడు బ్రతికి

యున్నచో, అచ్యుతరాయలకు రాజగు నవకాశ ముండదుగదా ః రాజ కుమారుని చంపి, తన బావగారికి రాజగు నవకాశమును తిరుమలరాజు కల్పించినాడన్నమాట. తా నిక రాజుగారి బావమఱదియై యధికారము నెఱపవచ్చును. ఇట్టి యుద్దేశ్యములతో సలకము తిమ్మ దే, రాకుమారుని చంపినాడను నూహలు చిలువలు పలవలై చెలరేగ సాగినవి. సత్యము మాత్ర మా పరమేశ్వరునికే ఎఱుక ః

మోహనాంగి వివాహ ప్రస్తావము వచ్చినప్పుడు తిరుమలదేవి రాయలవారితో చెప్పనే చెప్పినది ః చినతిరుమల రాజునకు మోహనాంగి నీయనిచో, అంతఃపురము మనఃస్పర్థల కాలవాల మగునేమో యని. ఈ నా డామాట అక్షరముల నిజమైనది. రాజకుమారుని తిమ్మరుసయ్యే చంపుగాక, లేక చినతిరుమలరాజే పొట్టను పెట్టుకొనుగాక, ఎవ్వరైననేమి ? మహారాజ్ఞికి మాత్రము నేడు పుత్రశోకము సంప్రాప్తమైనది. ఈ ఇక్కట్టు మఱొక కారణము కాగా రాయల రోగము తగ్గుటకు అవకాశములే దూరమైనవి. ఇక తిరుమలదేవి దుఃఖమునకు హద్దులెట్లుండును ? రాయలవారికి కొమ్ములు తిరిగిన రాజవైద్యులు వైద్యముచేయు చున్నారు. వ్యాధి కొన్ని మాసములు తగ్గును; మఱల హెచ్చుచుండును. అది ఒంటు జీర్ణించి యొక దీర్ఘవ్యాధిగా సంవత్సరములకొలది కొనసాగు చున్నది. పుత్రశోక మన్నది దీర్ఘవ్యాధి గాక స్వల్పరోగ మెట్లగును ? కీడులో మేలన్నట్లు ఇటీవలనే అన్నపూర్ణాదేవి కొక సుతు డుదయించి నాడు. అతని కింకను నామకరణమే జరుగలేదు. ఏడాది దాటినది. పేరు పెట్టుకొని ముచ్చటలు జరుపుకొనుచున్న పెద్దపిల్లవాడు మరణించి నందువలన రాయలకును, దేవేరులకును, ఈ పిల్లవాడెట్లో బ్రతికి బట్టకట్టిన చాలు నెన్నమ తలంపు కలిగి, పేరుపెట్టుటకు తొందర పడరైరి.

తిమ్మరుసయ్యను కారాగారమున నుంచిన పిమ్మట, చెల్లప్పయను మారు పేరుగల సాళువ నరసింగ దండనాయకుడు సర్వశిరః ప్రధానిగ నియమితుడై వాడు. ఇతడు రాజకీయకార్యములం దనుభవము గలవాడు. రాయల కిప్పుడు, తనపిమ్మట నెవరికి రాజ్య మప్పగించుటా యనునది యొక సమస్య యైనది. నాటికి సామ్రాజ్యమునకు వారసులు కాదగిన వారు నలువురున్నారు; తనయన్న వీరనరసింహరాయల కుమారుడొకడు. అచ్యుతదేవరాయ లొండొకడు. రంగరాయల కొడుకైన సదాశివ దేవరాయలు మఱొకడు. రెండేడులైనను నిండని యనామకుడు తన పుత్రు డొకడు. వీరిలో నెల్ల అచ్యుతదేవరాయలు బుద్ధిశాలి. తన యభి ప్రాయముల నెఱింగి నడచుకొనువాడు. అతనికి దైవభక్తియు, ప్రజలన్న ప్రేమాదరములును గలవు. రాయలవారు దీర్ఘముగా నాలోచించి నర సింగదండనాయకుని, అళియరామరాయలకును రాజ్యరక్షణభార మప్ప గించి, అచ్యుతదేవరాయలనే విజయనగర వజ్రసింహాసనాధీశ్వరుని జేయ నేర్పాట్లు గావించెను. ఈ అంశమును మోహనాంగికూడ నెఱుకపడి చెను. మోహనాంగి, తండ్రి ఇంక కొంతకాలము బ్రతుకవలయునని ఆశించుచున్నది. కాని, ఆయన భవిష్యదాంధ్రసామ్రాజ్య నిర్వాహకుని కూడ సూచించుటచేత, ఆమె కధైర్యము దోచినది. ఆమె పితృదేవుని స్థితి చేయి జారిపోవుచున్నదని తలంచి పుట్టెడు దుఃఖమును దిగమ్రింగి జనకునకు ఊఱట కల్పింప నెంచి ఇట్లనినది.

"నాన్నగారూ! మీరు సామాన్య మానవులు కారుగదా! కావ్యములు వ్రాసి విశ్వశ్రేయమునకు పాటుపడినవారే. ఎన్నియో చిత్ర విచిత్రము లైన పాత్రలను నిర్మించినవారే. ఇట్టి మీకీ మనోవ్యాధియేమి? పిఱికి తన మేమి? జీవులకు చావుపుట్టుకలు సహజములే కదా! నాకు చిన్నారి తమ్ముడు పుట్టునని నే ననుకొనలేదు. మీరును అనుకొనలేదు. భగ

వంతు డెందులకో, సదాశివుని మనకు ప్రసాదించినాడు. మరల తీసికొని పోయినాడు. ఇది యంతయు భక్తుల నాతడు పరీక్షించురీతి! ఈశ్వరుని లీలల నెఱింగిన మీ రిందుకు చింతింపవచ్చునా! ఆరోగ్యమును పాడు చేసి కొనవచ్చునా? మీరే ఇట్లైన మాగతి ఏమి కావలయును? మనకు భగవంతు డింకొక చిట్టితండ్రి నొసంగినాడు గదా! అతనిని గాంచి మనము దుఃఖమును దిగ్రమింగుకొనవలదా!"

"అమ్మా! తిరుమలుని మరణదుఃఖమునకన్నను, నృసింహకవి పొందిన ఆశాభంగము నన్ను బాధించుచున్నది. ఒక మహాకవికి నా రాజ్యములో న్యాయము చేకూరకపోవుట-నాకెంతయో వ్యథను కూర్చుచున్నది. తల్లీ! అత డీ విద్యానగరములో పద్యముల నమ్ముకొని బ్రతికినా డన్నది సామాన్య విషయము కాదు. చివరకు నావలెనే పుత్రునిగూడ కోల్పోయి నాడట. ఓ నృసింహకవీ! ఎన్ని జన్మముల పాలైనావయ్యా? నన్ను శ్రీరంగక్షేత్రమునకు రమ్మంటివా! నే నీ స్థితిలో ఎట్లు రాగలను? నీవు శ్రీరంగనాథుని సేవలో ధన్యుడ వగుచున్నావు! ఎంత భాగ్యశాలివి!"

"నాన్నగారూ! మీరు కొంచెముసేపు కన్నులు మూసికొని ప్రశాంతముగా నిద్రింపుడు."

రాయలు కన్నులు మూసికొనినాడు. రెండు మూడు క్షణములు మాత్రమే గడచినవి. ఆయనకు కుమార తిరుమలరాయ లగపడినాడు.

"నాయనా! తిరుమలా! నా కడుపున నేల పుట్టితివిరా! పుట్టితివ పో అర్ధాయుష్కుడ వేల యైతివిరా తండ్రీ! నన్నేడ్పించుటకా! అప్పాజీ! నేను నీ కేమి యెగ్గుచేసితినయ్యా! నాపుత్రు డేమి యెగ్గొనర్చినాడయ్యా! అతనిని పొట్టన బెట్టుకొనవలయునన్న దుస్సంకల్పము నీ కేల కలిగినదో ఊహింపలేకున్నాను. నీవు.... నీ.... విట్టి పని చేసియుండవు. ఎవరో

యీ పని చేసి, నీమీది కీ దోషమును దొరలించిరా తండ్రీ! ఏమో! నా కేమి తెలియును. నా సామ్రాజ్యమున కెల్ల సామ్రాజ్యమైన ముద్దుల తండ్రి, వరహాలబాబు, నా చిన్నారి కన్నయ్య నన్ను కన్ను మొఱగి పోయినాడు.

"నాయనా! తిరుమలా, నన్ను రమ్మనుచున్నావా! నాకు ముద్దు లిత్తు ననుచున్నావా! వచ్చెదను. ఇదిగో, ఇప్పుడే వచ్చెదను. నీవు కనుమొఱగి పోకుము. పోకుము తండ్రీ, పోకుము. అక్క నీ పేరు సదాశివు డన్నది. నేను తిరుమలుడని పిలుచుకొన్నాను. ఇందు కేమైన నను కోపము వచ్చెనా! నీవు విరూపాక్షస్వామి ప్రసాదమని అక్క చెప్పి నది గదా! నేను పేరు మార్చినానని ఆ విరూపాక్షు డాగ్రహించి, నిన్ను తన చెంగటికి తీసికొనిపోయెనా! అట్లు కాదు. శివకేశవు లభేద రూపులు. వారి కిట్టి భేదబుద్ధి యుండదు. ఆ భేద మంతయు నీ లోకమున భక్తులు కల్పించినట్టిదే! కేశవునిపై నాకు భక్తిప్రపత్తులు ఎక్కువైనను, నే నెన్నడును శివాపచారము చేసి యుండలేదు. ఇరువురి నొకేరీతి చూచు కొన్నానే! ఆఁ....ఆఁ....కాదా! కాక మఱేమి!"

"నాన్నగారూ! ఏమి యీధోరణి! కొంచెము సేపు *ద్వయమును జపించుకొన రాదా! తిరుమంత్రమును పఠింపరాదా! మీ కాత్మశాంతి చిక్కునే!"

"అవునమ్మా! మఱచితిని. ఓం నమో నారాయణాయ, ఓం నమో నారాయణాయ....ఓహో! ఏమా దివ్యతేజము! పాలకడలి పొంగి నట్లు, కోటిచంద్రు లొక్కసారి కాంతులు కడలి జిమ్మినట్లు, వెండి కొండను పిండిచేసి, ఆ చూర్ణము నాకసమునుండి చల్లుచున్నట్లు, మంచు

---

*వైష్ణవులు జపించు మంత్రము.

గొండ ద్రవీభూతమై తుంపురులు తుంపురులై విశ్వము నంతటి నావరించి నట్లు బ్రహ్మాండ మంతయు కాళభాపుష్పప్రభా భాసమాన మైనట్లు, పరమ శివస్వరూపము కరచరణాద్యవయవ రహితమై విశ్వమెల్లెడల వీరతాండ వము చేయ విజృంభించినట్లు, ఏ మా కిరణ ప్రసారము! అది యేమి! తన్మ ధ్యమున మహేంద్రనీలమణిరోచులు రాసులు రాసులై తోచుచున్నవే! అది వార్షుకాంభోదమును బురుడించుచున్నదే! అవును మేఘమే కాకున్న తన్మధ్యమున తటిల్లత యేల వెలయును! కాదు, అది మేఘపటలముకాదు; విద్యుల్లతయు కాదు. అవయవము లేర్పడుచున్నవి. అదిగో! ఆ నల్లని వెలుగు శ్రీ మహావిష్ణువు. ఆ మెఱుపు ఆదిలక్ష్మి స్వరూపము. అవిగో! ఆయనహస్తములందు శంఖ చక్ర గదా ఖడ్గము లలరారుచున్నవి. నిత్యానపాయిని మా తల్లి రమాదేవి వక్షస్థలారూఢ యైనది. ఆ తెలి వెలుగులు పాలకడలి, అందలి అనంతమూర్తి. వారుగో, గరుడ విష్వ క్సేనాదులు సేవించుచున్నారు ఆహా!.. ఆహా!! ...నా జన్మ తరించి నది, శ్రీమదాదినారాయణమూర్తి దర్శన మిచ్చినాడు. అ(.....అ(.....అది యేమి! చిఱుచేప. ఓహో! నీవు మత్స్యమూర్తివి కదా తండ్రీ! ఓ అది కూర్మస్వరూపా! వందనములు. నీవు వరాహదేవుడవా! నే నెఱుంగు దును లెమ్ము. వారెవరు! లక్ష్మీ నృసింహులా! మిమ్ము అహోబలములో దర్శించి వచ్చి, మా నగరమున నెలకొల్పుకొన్నానుగదా! "లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్! కరావలంబమ్" ఓహో! వామనస్వామియా! త్రివిక్రమస్వరూపా! శరణు. క్షత్రలోక భయంకరులు పరశురాముల వారా? వారు! ఆయన శ్రీరామచంద్రమూర్తి. అతడు మా హజార రాముడే! వారెవరు! చీకటివెలుగులవలె! కృష్ణబలరాములు! ఓ బుద్ధదేవా, నీ మార్గమే మానవకోటికి తారక మయ్యా! వారు సర్వావతార సార స్వరూపులు—కల్కిప్రభువులు కాబోలు! అహా! ఎంత గొప్ప విశ్వ

(మానవ) పరిణామము! చివరకు మిగిలినదెవరు? చిదచిద్విశిష్టమైన లక్ష్మీనారాయణ పరబ్రహ్మమా! కవి కదియును గోచరించుటలేదే! కోటి సూర్యులవెలుగులు, అతిభ్రాంతికమైన తేజము. లోపల, వెలుపల, అంతట అదియే! చీకటిలేదు. వెలుగును లేదు. రెంటివి దాటిన అనిర్వచనీయ స్థితి. అది నిష్కళము. నిరామయము. అద్వైతము అదియే కావలసినది. ఓం నమో నారాయణాయ. నాయనా, తిరుమలరాయా! కాదు. సదాశివా! నీ వా వెలుగులోనే యున్నావా? నే నిదే వచ్చుచున్నాను!" అను చుండగనే రాయలవారి నేత్రనాళములనుండి ఒక దివ్యతేజము బయల్వెడలి ఆయన కగపడిన అఖండతేజములో కలిసిపోయెను.

# 15

రాయల నిర్యాణానంతరము దక్షిణభారతమందంతటను శోకాంధకార మలముకొన్నది కళారాధకుల కండదండలు పడిపోయినవి. తొల్లింటివలె భువనవిజయసభ కళకళ లాడుటలేదు. పెద్దనాదులు నిరాశ్రయులైనారు. ఒకనాడు రాయలచే అందలమెక్కింపబడినవాడు.... ఏనుగుమీద రాయలతోబాటు సహాసనము నధిష్ఠించినవాడు గదా పెద్దన! ఆయన దుఃఖమున కంతమెట్లుండును! శోకాకులమైన పెద్దన హృదయమునుండి రాయల నుద్దేశించి కవిత పెల్లుబికి, తరగలు తరగలై కట్టలు త్రెంచుకొని పాఱజొచ్చినది.

"ఎదురైనచో తన మదకరీంద్రము నిల్పి,
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె,
కోకటగ్రామాద్య నేకాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె,

మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగ
పల్లకి తనకేలఁ బట్టి యెత్తె,
బిరుదైన కవిగండ పెండేరమున కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగె,
ఆంధ్రకవితాపితామహ ! అల్లసాని
పెద్దన కవీంద్ర ! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు."

అని యేడ్చినాడు పెద్దన.

* *

భట్టుమూర్తి సంస్కృత విద్యాభ్యాసము చాలవఱకు వచ్చినది. అతడు కావ్య నాటకాలంకార సాహిత్యమర్మముల నెఱింగినాడు. తర్క-వ్యాకరణముల నింకొకొ పండితునివద్ద చదివినాడు. సంగీతశాస్త్రమును ఆ నా డా శా స్త్ర ము న భీష్మునివంటివాడైన కృష్ణగాయకుల వద్దనే అభ్యసించినాడు. కృష్ణగాయకు డంతటి వృద్ధుడైనను యోగ్యులగు శిష్యులు దొరకినచో విద్యాదానము చేయ కూరకుండెడివాడు కాడు. ఆయన రాచకన్నెల కెంత వాత్సల్యముతో విద్యాదాన మొనర్చెనో, భట్టుమూర్తి కివి అంత నెనరుతోనే సంగీత బోధ చేసెను. భట్టుమూర్తికేమి, ఆయనకు రామరాజునాశ్రయమే అయాచితముగా దొరకినది గదా ! సాధారణముగా కవులగువారికి సంగీతవాసన యుండదు. సంగీతసాహిత్య సరస్వతు లగువారు సృష్టిలోనే నూటి కొక్కరో, కోటి కొక్కరో యుందురు. కొందఱు కవులు, పద్యము చదువుచున్నచో, అది పద్యమో గద్యమో

వినువారికి బోధపడదు. మఱికొందఱు సంగీతము రాకున్నను పద్యమును చెవుల కింపైన రీతిలో చదివి, వినువారికి విందులు చేయగలరు. పఠన మాత్రముననే శ్రోతృహృదయము నాచికొనగల పాఠకు లెందఱు లేరు! భట్టుమూర్తి పూర్వజన్మసుకృత మెట్టిదోగాని, అతనికి శాస్త్రీయసంగీతము పట్టువడినది. అతడందఱి మన్ననల నందుట కదియు నొక కారణమైనది.

సంస్కృతము పట్టుబడ్డప్పటినుండియుభట్టుమూర్తిశ్లేషకవిత్వమును జెప్పుటకుగూడ యత్నింప మొదలిడినాడు. క్రమముగా శ్లేషలో అసమానుడయినాడు కూడ. భట్టుమూర్తి కవిత, జిలుగు తెలుగు వెలుగుల కంటెను, గీర్వాణవాణీగాంభీర్యమునే యెక్కువగా డక్కగొని, చిన్నారి నడల హొయలు పచరింప జొచ్చినది. అత డిప్పుడే శతలేఖినీపద్యసంధానము నలవఱచుకొనుచున్నాడు. ఆశుకవిత వానికి వెన్నతో బెట్టిన విద్యయే! ఏ దేని ఇతివృత్తము నిచ్చి కావ్య మల్లు మన్నచో, ఒక్క గడియ కాలములోనే ఒక ప్రబంధము నాత డల్లగలడు. చతుర్విధ కవిత్వము లాతనికి పట్టువడినవి. ఈ కవితారీతు లన్నియు నాతనికి పెద్దన నేర్పినవి కావు. పెద్దన యేవో నాలుగు సంస్కృతపు ముక్కలను మాత్రమే చెప్పినాడు. తక్కినవానికి, వాని జన్మసిద్ధప్రతిభయే కారణము. తెలుగు సొగసుల తెలిపి భట్టుమూర్తి కాతని తండ్రి పెట్టిన భిక్ష. భట్టుమూర్తి తిమ్మన, రుద్రకవి, ధూర్జటి మున్నగు కవులయిండ్ల కేగుచుండువాడు. వారితో కవితాగోష్ఠులు, సాహిత్యచర్చలు చేయుచుండువాడు. ఈతని తెలివితేటలకు ఆ కవీశ్వరులు సంతసించుచు వలసిన విశేషములను దెలుపుచుండువారు. భట్టుమూర్తి పద్యముల నింపుగా చదువునుగాన, వారు పలుసారులు తమ కావ్యముల నాతనిచేత చదివించుకొని యానందించువారు. మొత్తముమీద నీ వర్ధమానకవికుమారు డా విద్యానగర కవి పండితుల దృష్టినే గాక, యెల్లరి దృష్టి నాకర్షింప జాలినాడు.

ఒకనాడు పెద్దన యింటికి నందితిమ్మనయు, రుద్రకవియు, వచ్చుట సంభవించినది. ఇద్దఱును అనుకొనకుండగనే ఒకే సమయమున విచ్చేసినారు. భట్టుమూర్తియేదో వ్రాసికొనుచున్నాడు. పెద్దనతోబాటు తిమ్మన రుద్రయలును కొంతసేపు భట్టుమూర్తి ప్రతిభావిశేషములను గూర్చి ముచ్చటించుకొనినారు. ఇంతలో తిమ్మన – "నాయనా భట్టుమూర్తీ! నీవు కవిత్వములో అనేక ప్రక్రియలను సాధించుచున్నావు గదా! అవధాన మని గూడ ఒక ప్రక్రియ నారంభించినావట। వ్యస్తాక్షరిని సాధించుచున్నట్లును వింటిని. నేను కొన్ని పదముల నిత్తును. వాని నొక పద్యములో నిమిడ్చి చెప్పగలవా? అట్లు చెప్పినదానిని "దత్తపది" యందురు" అనెను. అందుకు భట్టుమూర్తి "పెద్దల దయ యున్నచో యత్నించి చూతు" ననినాడు. తిమ్మన "నాయనా! సారంగము, గంధఫలి, నాస, పుంజము–ఈ నాలుగు మాటలను నాలుగు పాదములలో నిమిడ్చి. నీ యిష్టము వచ్చిన వృత్తములో స్త్రీనాసికను వర్ణింపుము. గంధఫలి యన్నచో సంపగిమొగ్గ యని యర్థము. ఇది మాఱుమూలపదమని యెంచి నీ కర్థము చెప్పినాను. మేము రెండుగడియలకాల మేదో ముచ్చటించుకొనుచుందుము. ఈ లోపల నీ వేకాంతప్రదేశమున కేగి పద్యమును వ్రాసి మాకు చూపుము." అని కోరినాడు. అంతట భట్టుమూర్తి— "ఏకాంత ప్రదేశమునకు బో నేల? ఇక్కడనే కూర్చుండి పద్యమును వ్రాసి పెద్దలకు చూపుదును. తాము నన్ను వ్యస్తాక్షరిలోగూడ పరీక్షింపుడు. పెద్దలైన తమవంటివారి పరీక్షలో నెగ్గుట నాకు శ్రేయమే." అనెను.

వ్యస్తాక్షరి యనినకవి, కవిత్వము వ్రాయునప్పుడు, ఒక పృచ్ఛకుడు ఆతని యాలోచనమును భంగపఱుచుచు, ఒక పద్యమునుగాని, లేక యేదోయొక వాక్యమునుగాని అందలి యక్షరములకు క్రమసంఖ్యనుచేర్చి ఆ సంఖ్యను తారుమా రొనర్చి, ఈ సంఖ్యగల యక్షర మిది యని నడుమ

నడుమ కవికి కనిపించును, చివరకా కవి తన కవితతోబాటు, వ్యస్తముగా నిచ్చిన యక్షరముల నన్నింటిని క్రమ పఱచుకొని పృచ్ఛకునికి వినిపించ వలయును. అందుకనియే దానికి వ్యస్తాక్షరి యని పేరు కలిగినది. అవధాన విద్యలో నిది యొక అంశము. తిమ్మన యీ వ్యస్తాక్షరిని రుద్రకవి నిమ్మని కోరినాడు. రుద్రకవి ఒక పద్యపాదపు టక్షరములకు అంకెలువేసి, వానిని వ్యత్యస్తము చేసి యిచ్చుచున్నాడు. ఆ కవిత్రయ మచ్చట తమ సంభాషణమును కొనసాగించుచునే యున్నది. వారు భట్టుమూర్తి యేకాగ్రతను భంగము చేయు తలంపుతో కొంచెము పెద్దగనే మాటాడు కొను చున్నారు. ఒక గడియకాలము గడచునప్పటికి భట్టుమూర్తి నాసికా వర్ణనమును పూర్తిచేసి వినిపించినాడు—

"నానాసూన వితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బంది, యో
షానాసాకృతి దాల్చి సర్వసుమన స్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్."

సంపంగి మొగ్గను ఆడువారి ముక్కునకు ఉపమానముగా కవులు చెప్పుచుందురు. తుమ్మెదలకు చంపకముల తావి తలనొప్పి కలిగించును. అందుకని తుమ్మెద లన్నిపుష్పములలోని తేనియలను త్రావునే కాని. సంపంగి జోలికి రావు. చంపకమునకు, తుమ్మెద తన్ను ముట్టదే యన్న కొఱత యున్నది. అందుచేత ఆ సంపంగిమొగ్గ తపమొనర్చి ఆడువారి ముక్కుగా అవతార మెత్తినది. ఇక చూపులనెడి తుమ్మెదలు ఆ సంపంగి మొగ్గ కిరువంకల జేరి కొలువు చేయుచున్నవి. సంపంగి తపము చేసి ముక్కయి తన కొఱత దీర్చుకొన్న దన్నమాట! కవులు ఆడువారి చూపులను తుమ్మెదలతో పోల్చుచుందురు. ఈ పద్యమున తిమ్మన కోరి

నట్లు, నాల్గు పాదములలో వరుసగా సారంగము, గంధఫలి, నాన, పుంజము—అను పదములుగూడ వచ్చినవి. ఇక రుద్రకవి యిచ్చిన వ్యస్తాక్షరిని క్రమముగా కూర్చుకొని భట్టుమూర్తి యిట్లు వినిపించినాడు—

"బలవరదీ! దరీకుహర భాస్వదరీ! యదరీ! దరీహరీ!"

ఈ పాదము రుద్రకవియప్పుడే వ్రాయుచున్న "బలవదరీశతకము" లోని మకుటము. భట్టుమూర్తి ఆ కవిత్రయమును తన ప్రతిభచే నీ విధముగా అలరించినాడు. పెద్దన, పద్యసౌందర్యమునకు మెచ్చుకొని మా తిమ్మన గా రెంతటి మంచి పద్యమును వ్రాయించినా రనుచు "ముక్కుపై చక్కని పద్యమును వ్రాయించినావు గాన, నేటి నుండియు నీవు నంది తిమ్మనవు గావు, ముక్కు తిమ్మనవయా!" అని తిమ్మనను ప్రశంసించెను. "భట్టుమూర్తీ! ఈపద్యమున కిట్లు సార్థకత యేమున్నది, దీని నే కావ్యములో నైనను, స్త్రీ వర్ణన సందర్భమున నుపయోగించు కొన్నచో కలకాల ముండును" అని కూడ భట్టుమూర్తికి సూచించెను. కవు లేదో సందర్భమునుబట్టి వ్రాసిన పద్యములను, తమ కావ్యములలో వాడుకొని వానికి సార్థకతను చేకూర్చుకొనుట సహజమే! పిమ్మట, పెద్దన తిమ్మన లిరువురును రుద్రకవి బలవదరీశతక రచనమునుగూర్చి విని, దాని మకుటములోని శబ్దార్థముల సొంపున కింపొందినారు.

## 16

మోహనాంగికి, తమ్ముడైన సదాశివుని మృతి, పితృపాదుల విర్యాణము తీవ్రాఘాతము లైనవి. అయినను ఆమె నిగ్రహముతో మారీచీ పరిణయ రచనమును చేయుచునే యున్నది. రాయలు బ్రతికియుండగనే, అయి వాశ్వాసములను పూర్తిచేసినది. అంతవఱ కాయన విని సంతో

షించినాడు. నేటితో కావ్యరచనము పూర్తియైనది. పతిదేవుని మరణము వలన దుఃఖితలై యున్నతల్లుల నేవో కళాకాలక్షేపములతో నూఱడించుచుండుట, రామరాజునకా యా రాజకీయ కార్యములందు మంత్రిణి స్థానము నాక్రమించి సాయపడుట మున్నగు పనులతో ఆమె సమయమెట్లో గడచుచున్నది. ఆమె కొక సందేహము లేక పోలేదు. "తన తమ్ముడు శ్రీ విరూపాక్షదేవుని యనుగ్రహమువలన బుట్టినవాడు. అతనికి తాను సదాశివు డని పేరు పెట్టినది. జనకుడు, తిరుమలనాథుని (వేంకటేశ్వర స్వామి) యందలి భక్తిచేత తిరుమలరాయనామముతోనే పిలుచుకొన్నాడు. అందఱును రాయల యభిప్రాయమునే పాటించినారు. సదాశివనామముతో తాను దప్ప ఎవ్వరును వ్యవహరింపలేదు. పై పెచ్చు. దానశాసనములందుగూడ తిరుమలరాయనామమే వాడబడినది. ఇది యా పరమశివుని కాగ్రహకారణమై, తా నిచ్చిన కొమరుని తానే తీసికొని పోయెనా యేమి? ఈ సందేహమును తన తండ్రికూడ మరణ సమయమున బొందినాడే! కనుక, ఆ విరూపాక్షుడు, తా నిచ్చిన కుమారుని తానెందుకు తీసికొని పోగూడదు? నాయనకు మాత్ర మంతటి వైష్ణవాభిమాన మేల? నాయనకీ పేరులు మార్చుట సహజమే. తన పేరు తిరుమలాంబగదా! నాన్నగారు మోహనాంగి యని పిలుచుకొన్నారు. అందుకు తిరుమలేశు డాగ్రహించి తమ్ముని తన సన్నిధానమునకు తీసికొని పోయినాడా యేమి? ఏమో! ఇది యంతయు అగమ్యముగా నున్నది. బుద్ధికిని, తర్కమునకును అందు నట్టిదిగా లేదు. మన బుద్ధి కందని విషయము లెన్ని లేవు!" ఇట్టి తలంపులు మోహనాంగి హృదయములో దినమున కెన్నిసారులో పొడసూపుచుండెడివి.

ఇంతవఱకును కావ్యరచనముతో కాలము గడచిపోయినది. ఇప్పుడా పని ముగిసినందున, మనస్సులో నెప్పుడును సదాశివుడే మెదలుచున్నాడు.

తమ్ముని మీచి దిగులు ఆమెను మంచ మెక్కించినది. ఆ యనారోగ్యము కారణముగా నామె ఒడలిమీది నగల నన్నింటిని దీసి వైచినది. కడకు శైత్యము గలిగించు నను భయమున ముత్యాలసరములనుగూడ నూడ్చి దాచినది. ఆమెకు రాజవైద్యము సాగుచునే యున్నది. కాని ఆమె కారోగ్యము చిక్కుటలేదు. తిరుమలదేవీ ప్రభృతులును, రామరాజాదులును "ఇదేమి వ్యాధి ? ఇంత దీర్ఘకాలము పట్టుకొని పీడించుచున్న "దని బాధపడ జొచ్చినారు. వారు రాయల నిట్టి దీర్ఘవ్యాధిచేతనే పోగొట్టుకొన్నారు గాన, మోహనాంగి స్థితికి భయపడుటలో విడ్డూరము లేదు.

మోహనాంగికి తలనొప్పి వచ్చినచో, నాగినికి ప్రాణముమీదికి వచ్చినట్లే. మోహనాంగికి నాగిని బహిఃప్రాణ మగుచో, నాగినికి మోహనాంగి అతఃప్రాణమే ! కనుక నాగిని మోహనాంగికి రోగము తగ్గమికి కారణ మేమా, యని దీర్ఘముగా నాలోచింప మొదలుపెట్టినది. తన స్వామిని ఆభరణముల నన్నింటిని దీసివైచి, శిశిర ఋతువునందలి మాలతీలతవలె నున్నది. ఆమె మైదీవ నానాటికి కృశించుచున్నది. నాగిని మోహనాంగికి ఒడలు నవరించువేళ, ఆమె కంఠమున మంగళసూత్రము దక్క, రత్నముక్తాహారాదు లేవియు లేకుండుటను గమవించినది. ఆమె అదరి పడినది. "అలనాడు పురుషోత్తమస్థపతు లాశీర్వదించి యిచ్చిన మహేంద్రనీలాలంకృత తారహార మేదమ్మా ?" అని మోహనాంగి నడిగినది. మోహనాంగి హీనస్వరముతో నన్నది.

"రోగభారముతోనే క్రుంగిపోవుచున్న నేను, ఆ ముక్తాహారము నెట్లు మోయగలనే ? అందుకని తీసి అమ్మచేతి కిచ్చి భద్రము చేయించినాను."

"భద్రము చేయించినావా ? ఎంత పొరపాటు చేసితివమ్మా ! అది సామాన్యమైన ముత్యాలసరమని తలంచినావన్నమాట ! దాని మహిమను

గూర్చి నాడా స్థపతులు చెప్పినది మఱచినావా యేమి? నీ సర్వాభ్యుదయములకు ఏ హారము కారణమో దానిని మెడనుండి దూరమొనర్చినందు ననే నీ కీ వ్యాధి తగ్గకుండ నున్నది."

ఈ మాటలు వినునప్పటికి మోహనాంగికి అహోబలములోని సంఘటనమును గుర్తునకు వచ్చినది. పురుషోత్తమస్థపతి, అలనాడు హార మహిమనుగూర్చి చెప్పనే చెప్పినాడు. తా నేదోమనోవ్యథతో ఆ వృత్తాంతమునే మఱచినది. ఆమె పోగొట్టుకున్న వస్తువు చేజిక్కినట్లు తలంచి నాగినితో నిట్లన్నది.

"ఔను, నాగినీ! నే నా వృత్తాంతమునే మఱచితినే. నీవు నాకు కనని తల్లివే! నీ ఋణమెట్లు తీర్చుకొందునే తల్లీ!"

"ఇంకొక రహస్యముకూడ నీ సందర్భమున నూహింపదగినది కలదమ్మా! నేను జాగరూకతతో ఆ యంశమును గమనించుచునేయున్నాను. నాన్నగారు, పురుషోత్తమ స్థపతుల కానాడు ఈ హారమును బహూకరించినారు. ఆయన నిజమైన పురుషోత్తముడు గావున, స్వార్థపరుడు గాకుండ, రాజకుటుంబక్షేమమునే కోరి, దానిని రాయలవా రెట్లును స్వీకరింపరని నీకు దీవించి యిచ్చినారు. లేకున్న నెవరట్లు చేయుదురు? అనేకులను చూచుచున్నాము గదా! రమ్మనువారేగాని పొమ్మనువా రున్నారా? ప్రభువులనుండి పసవనములను గోరువారేగాని బహూకృతములను తిరిగి యిచ్చువా రున్నారా ఆలోచింపుము. ఆ హారము నీ కంఠము నలంకరించినప్పటినుండియు, నీకు మహాదశ పట్టినది. ఏకాదశస్థానమున శుభగ్రహములున్న జాతకులకు వట్టు మహాయోగము పట్టినది తల్లీ! నీకు. నాటినుండి నీ విద్యాబుద్ధులు తొంటికంటె నెక్కుడుగా ప్రకాశించినవి. వికత్వ మతిశయించినది, మహాకావ్య నిర్మాణ ప్రజ్ఞ కాకలు తీరినది.

తగిన మగనిని పెండ్లాడినావు. ఆయన నిన్ను పువ్వులలో బెట్టి పూజించు కొనుచున్నాడు. అంతఃపురమున గాని, అన్యత్రగాని, నీ మాట కడ్డు చెప్పువారు లేరు గదా! అంతఃపురమున తమ పనులకు నీ సమ్మతి నాశించు వారే గదా! దీని కంతటికిని మూలకారణ మే మనుకొనుచున్నావు? హారము, హారమమ్మా, మహేంద్రనీల ముక్తారాజి హారము!!

"ఇక నాన్నగారిస్థితి నర్థము చేసికొనుము. ఆ హారము వారి మెడలో నున్నంతవఱకును, వారి ధాటికి తిరుగులేదు. అశ్వపతులును, గజపతులును! అమరనాయకులును పాదాక్రాంతు లైనారు. కర్ణాట సామ్రాజ్యము మూడుపూ లాఱు కాయలుగా విలసిల్లినది. భువనవిజ యము భువనవిజయమే యైనది. నాన్నగారూ సంస్కృతాంధ్రములలో అనేక కావ్యములు వ్రాసినారు. అవియన్నియు నొకయెత్తు, విష్ణుచిత్తీయ మహాకావ్యరచన మొక యెత్తు. నాయనగారు తనకు శాశ్వతమైన మహాకవి కీర్తిని గూర్చినట్టి ఆముక్తమాల్యదను ఈ హారప్రభావముననే రచింపగలిగినారమ్మా! ఆ హారమును ఏ ముహూర్తమున వారు, తనకు తెలియకుండగనే తీసినారో, అప్పటినుండియే నాన్నగారి దశ వెనుకడుగు వేసినది తల్లీ! తారహారము నాయనగారి నెడబాసినప్పటినుండియు, మీ వివాహసమస్య లాయనను చుట్టుముట్టినవి. అవి యెట్లో పరిష్కారము లగునప్పటికి ఆరోగ్యము చెడినది. నృసింహకవి మనోవాంఛ తీరక పోవుట ఆయన కొక బాధయైనది. లేక లేక గలిగిన చిట్టిపాపడు అకాల మృత్యువు పాలైనాడు, కడ కా యీ సంఘటనలు ఆయనగారి ప్రాణ ములనే బలిగొన్నవి. ఆ హారములో నింత ప్రభావ మున్నదమ్మా!"

నాగిని యుపన్యాసములోని ప్రత్యంశమును మోహనాంగికి శుద్ధ సత్యముగానే తోచినది. ఆమె పెద్ద లేదో ఆశీర్వాదము లిత్తురనుకొన్నదే

గావి అవి ఇంతగా ఫలించునని యనుకొనలేదు. జీవరత్నములలో ఏవో మహిమ లుండునని రత్నశాస్త్రజ్ఞులు చెప్పుచుందు రనుకొన్నదే గావి, అవి యిట్లు అక్షరముల నిక్కమగు నవి భావింపలేదు. నాగిని ఎంత సూక్ష్మముగా సంఘటనల నర్థము చేసికొనుచున్నది. ఎంత చక్కగా భూతకాలమునకు వ్యాఖ్యానము చెప్పినది! అది తనపాలిటి యిలువేల్పు గాని, వేఱుకాదు. బ్రహ్మ తనకోసమే ఆమెను సృష్టించి పంపినాడా? బ్రహ్మ సంకల్పమును నెఱవేర్చుటకే ఆమె ఆజన్మ బ్రహ్మచారిణియై తన యోగక్షేమములకు ఆమె సర్వస్వము నర్పించుచున్నదా? ఏమో! ఇది కూడ ఆమెకు బుద్ధి కందునదిగా తోపలేదు. కడకు మోహనాంగి ఆనందాశ్చర్యములు ముప్పిరిగొన నిట్లన్నది.

"నాగినీ! నీవు చెప్పిన దంతయు నిజమేనే। నేను పొరబడితిని అంతయు సరిగనే సాగిపోవుచున్న దనుకొంటిని గాని, ఇది యిట్లని యెన్నడును భావింపలేదు! అమ్మగారి నడిగి ముత్యాలహారమును తెచ్చి నాకంఠము నలంకరింపవే!"

నాగిని చరచర పోయి తిరుమలదేవిని తారహార మిమ్మని యడిగినది సంగతి తెలియనందున, తిరుమలదేవి "రోగము తగ్గనీవే; అమ్మాయికి అలంకారములే తక్కువగునా?" అన్నది.

"అట్లు కాదమ్మా! రోగము తగ్గుటకే ఆ హార మవసర మయినది. మీరు నా మాటను కాదనక, ముత్యాలసరము నిండ"ని తెచ్చి దానిని మోహనాంగి మెడలో వేసి యిట్లన్నది.

"అమ్మా! పెట్టిపట్టుల నయినను నీ వీ హారము నెడబాయవలదు. దీని మహిమను మీ రర్థము చేసికొనలేదు. అర్థము చేసికొన్న నాన్నగారు తత్ప్రభావమును మీకు చెప్పలేదు. కఠినముగా నున్నను ఈ చెప్పబోవు

మాట నాలింపుము. రామరాజనరేంద్రుడు కట్టిన మంగళసూత్రము నొకా నొకప్పు డెడబాసినను, హానిలేదు గాని, ఈ హారమును మాత్రము వీడి నచో, ఆపదలు రాక తప్పవు."

తారహారము ధరించిన నాటినుండియు మోహనాంగి వ్యాధి తగ్గుముఖము పట్ట నారంభించినది.

మోహనాంగి రోగగ్రస్తురా లయినప్పటి నుండియు, నాగిని ఆమె మంచము ప్రక్కనే పండుకొని తన స్వామినికి వలయు సేవలు చేయుచున్నది. ఆ రాత్రి ఏవో ఆలోచనలు మనసున నుప్పతిల్లుచుండగా మోహనాంగికి నడురేయివఱకును నిద్దుర పట్టలేదు. ఆమె వ్యాధిచే గలిగిన శరీరనిస్సారతచే అట్లే కన్నులు మూసి, హజారరామస్వామిని ధ్యానించుచు పండుకొని యున్నది. కొంతసేపటి కామె కన్నులు తెఱచి చూచినది. నాగిని పద్మాసనమువైచి కూర్చున్నది. రెండు చేతులు తొడలపైనున్నవి. ఆ హస్తములు చిన్ముద్రను ప్రదర్శించుచున్నవి. నాగిని ఏదోధ్యానావస్థలో నున్నట్లు మోహనాంగికి తోచినది. అది యోగాభ్యాసము చేయుచున్న దేమో యని తలంచి ముక్కువద్ద వ్రేలుపెట్టి చూచినది. శ్వాస ప్రశ్వాసలాడుటలేదు. కొంతవడికి నాగిని సమాధినుండి జాగ్రదవస్థలోనికి వచ్చి పద్మాసనమును సడలించినది. మోహనాంగి యడిగినది.

"నాగినీ! యోగాభ్యాసము నెప్పు డలవఱచుకొన్నావే! గురువు లేనిది యిట్టి యభ్యాసములు చేసిన హాని కలుగునందురు కదా"!

"గురువు లున్నారమ్మా! పురుషోత్తమ స్థపతులు నా గురువులు!"

"పురుషోత్తమ స్థపతులా! ఎన్నడును చెప్పినదానవు కా వేమి?"

"ఏమి చెప్పుదు నమ్మా! చెప్పదగిన విశేషములు నా జీవితమున నేమున్నవి తల్లీ! మీరు గేస్తురాండ్రు. మగవారికివి, బిడ్డలకును సేవచేసి జన్మము తరింపజేసికొందురు. నాకే మున్నది? జీవితమున కేదో సాఫల్యము చేకూర్చుకొనవలయునుగదా! అందుకై యీ మార్గము నవలంబించినాను."

"నీకు పురుషోత్తమ స్థపతుల గురుత్వ మెట్లబ్బినదే?"

"ఆ నాడు అహోబిలమున ఆ మహనీయుని చూచినాము గదా! ఆయన బహు మంత్ర దేవతోపాసనాపరుడే గాక, యోగీశ్వరు డనియు నాకు తోచినది. ఒకనాడు వారి గృహమున కేగి చూతును గదా! అది యొక బ్రహ్మఋషి దివ్యాశ్రమమువలె నున్నది. కొందఱు బాలకులు వేదములను జదువుచున్నారు. కొందఱు శిల్పాగమములనుగూర్చి చర్చించు చున్నారు. ఇంక కొందఱు శిల్పశాలలో మూర్తులను జెక్కుచున్నారు. మఱికొందఱ కా మహనీయుడు యోగవిద్యా మర్మముల నుపదేశించు చున్నాడు. నే నాశ్చర్యభరిత నైనాను, అప్రయత్నముగా ఆయన పాదములపై వ్రాలినాను. ఆయన నన్ను గుర్తించి, దీవించి యోగక్షేమముల నడిగినారు. నేను నాకథనెఱింగించి యోగవిద్యాదానముచేయ ప్రార్థించితిని. వారు వల్లె యని నాకం దక్షరాభ్యాసము చేసినారు. నాటినుండియు యథాశక్తి నభ్యాసము చేయుచున్నాను. ఈ నాటి కీ స్థితికి రాగలిగినాను. నేను మీ యంతఃపురమున ప్రవేశించునప్పుడు సాయంకాలమునుండి రాత్రి నాలుగు గడియల ప్రొద్దు పోవువఱకు మీ చెంగట నుండకుండినట్లు వరము పొందినాను గదా! ఆ సమయము నిట్లు సార్థకము చేసికొనుటకే మీనుండి యట్టి యనుమతి నందినాను తల్లీ! పురుషోత్తమ స్థపతులు నిరంతరము నీ యోగక్షేమములను విచారించుచునే యున్నారమ్మా! వారి

రాజకుటుంబముపై నెంత గౌరవాదరములు। ముక్తాహారము నీకంఠసీమ నెడబాయ రాదని శ్రీవారు నాకు పలుసారులు హెచ్చరిక చేసినారమ్మా!

"ఓసీ, నాగినీ! ఎంతదానవే నీవు? మే మందఱమును సంసారమున మునిగి తేలుచు నుక్కిరి బిక్కిరి యగుచుండ నీవు జన్మతారకమగు యోగము ననుశీలించుచున్నావా? ఎంత ధన్యురాలవు!"

"నాకు నా జీవితమున రెండే రెండు పెన్నిధానము లున్నవి తల్లీ! అందొకటి, నాకు మిక్కిలియు కూర్చు నాస్వామిని. ఆమె దయవలననే నా జీవితమున చీకటు లంతరించి, వెలుగులు వెల్లి విరిసినవి! రెండవ పెన్నిధానము నా గురుమహాదేవులు పురుషోత్తములు. మనము సన్న్యాసు లన్నను, బైరాగు లన్నను మోజు పడుచుందుము. స్థపతులవారు గృహస్థులైనను ఎంత వైరాగ్యపరులమ్మా! ఎంత నిష్ఠాగరిష్ఠు లనుకొన్నావు, ఆయన భార్య వీరాంబగారు కూడ అట్టిదే. ఆమె మహాపతివ్రత. మీవలె ఆమెయు నన్ను కన్నకుతునువలె ఆదరించుచుండును. నా జీవితమున కీపాటి సార్థకతను గూర్చిన నా స్వామిని ఋణము నేనెట్లు తీర్చు కొందునమ్మా!"

ఈ మాట లనునప్పుడు నాగిని కన్నులు కన్నీటితో నిండిపోయినవి. కంఠము డగ్గుత్తిక పడినది. ఆమె కృతజ్ఞతాబుద్ధికి మోహనాంగి ఆశ్చర్య పడినది. నాగిని అంతటితో నూరకుండక యనినది.

"అమ్మా! నీవు తమ్ముని మీది దిగులుచే మంచ మెక్కినావు. బంధుమిత్రులపై నంతటి మమకారము పనికిరాదు. అట్టితగుల మొకప్పుడు మన ప్రాణాలకే ముప్పుతేవచ్చును. ఆ భగవంతుని కృపచే నీకు రోగము తగ్గినది గనుక సరిపోయె. లేకున్న ముప్పు కలిగెడిగి కదా!"

"నిజమే కాని, ప్రేమబంధములను త్రెంచుకొనుట యెంతటి వారికిని సాధ్యము కాదే నాగినీ! నాలుగు కాలములపాటు మనవలసిన ముద్దుల తమ్ముడు అకాలమరణము పాలయిన, దిగులుపడక యెట్లుందునే?"

"లోకమున నేదియు శాశ్వతము గాదమ్మా! అందఱును చచ్చువారే. చచ్చిన వారే శాశ్వతులు. వారు మఱల చావరు. బ్రతికియున్నవారికి చావు తప్పదు. మనము మాత్రము శిల వేసికొని యుందుమా?"

"నీ వేదో వేదాంతము చెప్పుచున్నావే."

"ఔనమ్మా! వేదాంతమే. ఈ వర్తమానము గాని, భవిష్యముగాని శాశ్వతములు గావు. శాశ్వతమైన దొక్క భూతకాలమే తల్లీ! నాన్న గారును, తమ్ముడును భూతమున జేరినారు. వారి కిక చావు లేదు. వారి చరిత్ర మిక శాశ్వతముగా కావ్యములందు నిలిచి పోవును. మనమో, వర్తమానకాలమున నున్నాము. ఎప్పటి కైనను ఆ భూతమున జేరక తప్పదు. మన మేడువవలసినది చచ్చినవారికోసము కాక, చావనున్న వారి కోస మమ్మా, స్వామినీ! అనగా చావనున్నవారు చచ్చులోపల తాము వచ్చినపనిని చక్కబెట్టుకొందురా, లేక అపమార్గము పాలగుదురా యని చింతింపవలయునని నా యభిప్రాయము."

మోహనాంగికి, నాగిని మాటలలో ఏదో సత్యము దాగుడుమూత లాడినట్లు తోచినదేకాని, స్పష్టము కాలేదు. ఆమె ఆతురతతో నన్నది.

"నాగినీ! నాకుగూడ యోగమును నేర్పవే. అప్పుడీ శోక మోహములను గెలువగల నేమో!"

"యోగమునకు ముందు యమ నియమముల ననుష్ఠింపవలయు నమ్మా! పాతంజల యోగసూత్రములను పఠింపుము. యోగరహస్యములు తెలియగలవు!"

# 17

ఎవ రెన్ని వేదాంతములు చెప్పినను అనుభవించువాడు దుఃఖము నుండి తేరుకొను టంత సులభము కాదు. మోహనాంగి తన తండ్రి విశ్లే యూరడించినది. కాని తనవంతు వచ్చునప్పటికి తట్టుకొనలేక అల్లాడుచున్నది. ఏ విషయము నయినను, సొంతముగా ఆచరించుట పరోపదేశ మంతటి తేలికగాదు. మోహనాంగి జబ్బు తగ్గి కోలుకొను చున్నదన్నమాటే గాని, మదిలో పాదుకొన్న దిగులు మాయుట లేదు. ఆమెకు చిన్నారితమ్ముడు మఱపునకు వచ్చుట లేదు. అన్నపూర్ణాదేవి కొడుకు నెత్తికొని కొంత దిగులు తీర్చుకొనుచున్నను, సదాశివు డామెను వెంటాడుచునే యున్నాడు. వరదాదేవి కుమారుడు వేంకటాద్రిలో కుమార తిమ్మలరాయల పోలికలున్నవి. అందును మోహనాంగి వేంకటాద్రిని ముద్దుసేయుచు, తన చింతను కొంత తగ్గించుకొన జూచినది. అందుకై పినతల్లి వరదాదేవిగారి యింటికి రాకపోకలు చేయుట, వేంకటాద్రిని తన యింటికి రప్పించుకొనుట జరుపుచున్నది. ఇందుకై నాగిని తఱచుగా వరదాదేవి యంతిపురికి పోవలసివచ్చుచుండెడిది,

ఒకనాడు మోహనాంగి పనుపున నాగిని వేంకటాద్రిని వరదాదేవి యంతిపురమున దింప వచ్చినది. ఆ సమయమున నలకము చినతిరు మలరాజు అప్పగారితో నేదియో ముచ్చటించుచు అచ్చటనే యున్నాడు. నాగిని యను మెఱపుతీగె యతని కన్నులకు మిఱుమిట్లు గొల్పినది. అతడు విభ్రాంతుడైనాడు. అతని మనస్సా యెలనాగపై తగులుకొన్నది. తిమ్మరాజు కప్పటికి పెండ్లియైనది. అతని పెండ్లముకూడ అంద గత్తెయే! అయిన నేమి! కొందఱికి ఇంట ఇష్టమృష్టాన్నము లున్నను, పొరిగింటి పుల్లకూరమీద మనస్సు పోవుచుండును. వెలిచవులన్న, వారికి

మకుర్కా వ. తిమ్మరా జా వర్గమునకు చెందిన యువకుడు. "ఎవరీ పడుచు ? వేంకటాద్రిని తీసికొని వచ్చినందున, అంతఃపురదాసిగా యుండ వలయును. దాసిలో నింతటి లోకాతీత సౌందర్యమా ?" అతడు కన్నార్పక పరికించి చూచినాడు. చూడ జూడ ఆమె ఏనాడో తనకు పరిచయమైన వ్యక్తిగా తోచినది. తిరుమలుని మనస్సు భూతకాలమున కుఱికినది. ఒకనాడు ఔకు గ్రామములో తాను నిర్బంధింపజూచిన బసివి పోలిక లామెలో తోచినవి. అత డింకను పరిశీలించి చూచినాడు. ఆమె బసివియే !

ఆనాటి బసివి పసరుమొగ్గ. అప్పటి కామె అవయవము లింతగా వికసింపలేదు. అప్పుడే ఈడేరి పదునేనేడుల ప్రాయములో నున్నది. మన్మథుడింకను ఆమె జవ్వనముపై పీటవైచుకొనలేదు. అట్టి లేతవయస్సులోనే ఆమె సౌందర్యము తనకు చక్కిలిగింతలు పెట్టినది. అప్పటికి నిప్పటికి దాదాపు పది వసంతములైనను గడచి యుండును. ఇప్పుడో బసివి తేకులు విరిసిన కన్నెదామరపువ్వు ! నెఱజవ్వనంపు కులుకుల మిటారి. ఆమె సర్వావయవములు తారుణ్యరస పూర్ణములై యువసమాజమున కాహ్వాన పత్రము లందించుచున్నవి. కాము డామె వక్షఃపీఠమున కొలువు దీఱి పురుష సింహముల ధైర్యసారమును కొల్లగొట్టుచున్నాడు. ఆమె అప్సరస్సౌందర్యమును త్రోసిరా జనుచున్నది. అతడు విగ్రహించుకొనలేక ఆమెతో నన్నాడు.

"నీవు బసివి వనుకొందును !"

"అనుకొన్న నా కేమి నష్టము ?"

ఈ మాట విన్న పిమ్మట తిమ్మరాజున కీమె అలనాటి బసివి యేయని కంఠస్వరమును బట్టి నిశ్చయము కల్గినది. కంఠస్వరమే కాదు. ఆమె

యిచ్చు చతుర సమాధానములును వాని కెఱుకయే. బసివికి మాత్రము చూచినప్పటి నుండియు నాతడు చినతిరుమల రాజనెడి స్ఫురణ ముండియే యున్నది. మఱల తిరుమలరా జన్నాడు.

"నష్టమని కాదు. బసివి వేనా, నీవని అడుగుచున్నాను."

''నే నెప్పుడును బసివిని గాను. నే నిప్పుడు నాగినిని."

"నాగినివా? అవునులే! పేరులు మార్చుచుండుట రాయలవారి అంతఃపురపు టాచారము గనుక నిన్ను నాగిని యని వ్యవహరించుచున్నా రన్నమాట!"

వీరి సంభాషణము సాగుచుండగా, వరదాదేవి వేంకటాద్రిని తీసికొని అవ్వలి కేగినది. నాగిని యట నిలువక మోహనాంగి యంతిపురి వైపు సాగినది. తిమ్మరాజు ఆమె వెంటబడి నడచుచు అనుచున్నాడు.

"నాగినీ! ఇప్పుడు దాసి వైతివి గదా! నేటికైనను మనస్సు మార్చుకొనరాదా! చిన్ననా డేదో తెలియక యట్లు ప్రవర్తించి, నా స్నేహమును చెడగొట్టుకొన్నావు. ఇప్పుడు నేను మహాసమ్రాట్టులగు అచ్యుత దేవరాయలవారి బావమఱదిని గదా! నీ కే కొఱతయు నుండదు."

"నా కెప్పుడును కొఱత లేదు. నీ పిచ్చివేషములను గట్టిపెట్టుము. నీ జీవితమును రసాభాసముపాలు చేసికొనక, రాజబంధువు నన్న గౌరవమును దక్కించుకొనుము."

ఇట్లనుచుండగనే మోహనాంగి యంతఃపురము దాపైనది. ఆ మేడమెట్లు వనుమతి లేక పురుషు లెక్కరాదు. అందుచే నాతడు నిరాశతో వెనుకకు తిరిగి పోవలసివచ్చినది. తిరుమలరా జింటికి వచ్చినా డన్నమాటయే గాని, వాని మనస్సు నాగినిమీదికే పరుగిడుచున్నది.

"బిసివి! ఎంత అందమైన పిల్ల! పదేండ్లనాడు, నా కన్నులకు పండువు చేసిన ఈ దివ్యసుందరి నేటికి సాక్షాత్కరించినది. ఆమె చూపులు తూపులై నాగుండెలో గ్రుచ్చుకొన్నవి. ఆమె శరీరకాంతి వెన్నెలవలె, నా సర్వావయవముల నావరించినది. భావించినకొలది, ఆమె నా యెదుటనే నిలుచుచున్నదే!"

ఇట్టి తలంపులతో తిరుమలరాజు మంచమున కడ్డముగా పరుండి, రెండు చేతులను తలక్రింద దిండుగా నిడుకొని ఆకసమువైపు చూచు చున్నాడు. ప్రొద్దు క్రుంకినది. చీకటి పడినది. రత్నదీపములు ప్రకాశించి నవి. భార్య నాగమాంబ వచ్చి, భోజనమునకు లేపినది. ఆత దలవోకగా నాలుగు మెతుకులు సంజినాడు. శయ్యాగారమున కేగి పండుకొనినాడు. మఱల నాతని భావనాపథమున నాగిని కన్పట్టినది. ఎటు పరుండవలయు నన్నను ప్రక్క కుదురలేదు. అతడు కొంచెముసేపు అటునిటు తిరిగి నాడు. మఱల శయ్యపై మేను వాల్చినాడు. పది గడియల ప్రొద్దు పోయి నది. అతడు కన్నులు మూసికొని నాగినీధ్యాన నిమగ్నుడైనాడు. కొంత వడికి నాగమాంబ వచ్చి వానిప్రక్కన కూర్చున్నది. తిరుమలరాజు కనులు మూసికొనియే చేతిని చాచెను. అతని చేతికి నాగమాంబ తగిలినది. అతడు రెండవ చేతినిగూడ చాచి, రెండుచేతులతో నాగమాంబను గట్టిగ కౌగిలించుకొని 'నాగినీ' యనినాడు. మగడు తన్నెప్పుడును నాగినీ యని పిలిచి యుండనందున, ఆ పిలుపునకు నాంగమాంబ చకితయైనది. అతడు మాత్ర మామె భార్యయని కౌగిలించుకొనలేదు. నాగిని యనియే వాని యుద్దేశ్యము. కనులు తెఱచి చూచునప్పటికి, ఆ యువతి నాగిని కాక, తన యిల్లాలు నాగమాంబ యైనది. అతడు తత్తరపాటు చెంది, తన తప్పును కప్పిపుచ్చుకొనుటకై "రాణిగారిని, నాగినీ యని ముద్దుపేరున

పిలుచుకొనగూడదా!" యని భార్యతో పరిహాసమాడినాడు. ఆ అమాయకపు టిల్లాలు అది నిజమే యనుకొన్నది.

ఆ రాత్రి యంతయు తిరుమలరాజునకు నిదురయే పట్టలేదు. తెల్లవాఱినది. అతడు కాలకృత్యములను దీర్చుకొని, స్నానమాడి ధౌత వస్త్రములనుగట్టి మనో వినోదమునకై విఠలాలయ ప్రాంతమున కేగినాడు. అటనుండి విరూపాక్ష, శ్రీకృష్ణాది దేవాలయముల శిల్పములను దర్శించుచు హజారరామాలయమునకు విచ్చేసినాడు. తాను చూచిన ఆలయముల మీది శిల్పములు చిత్రవిచిత్రములు. ఆ దేవళములందు నానావిధ సుందరీ మూర్తులు తీర్చబడి యున్నవి. అతని కొక మూర్తిలో నాగిని నెమ్మోము గోచరించినది. ఇంకొక విగ్రహములో, ఆమె బాహులతలు స్ఫురించినవి. మఱొక ప్రతిమయందు, ఆమె మనోహర వక్షస్సౌందర్యము తోచినది. ఇంకొక బొమ్మలో, ఆలేమ సింహమధ్యము పొడగట్టినది. ఒండొక శిల్పమున, ఆమె పాదపద్మములు అందియల కింకిణీ కలస్వనములతో తన్ను పిలుచుచున్నట్లు వినిపించినది. అతడా దేవళములందలి ప్రతిశిల్పమూర్తిని వెఱ్ఱివానివలె చూచినాడు. ఒక్క మూర్తిలోనైనను, నాగినీ శరీరగత సమగ్రసౌందర్య మాతనికి గోచరింపలేదు. ఒక్కొక్క మూర్తిలో ఒక్కొక్క అవయవ సౌందర్యమును మాత్రమే దర్శించి యాతడు తృప్తిపడవలసి వచ్చినది.

"ఆహా! బ్రహ్మదేవు డీమె నెట్లు సృష్టింపజాలినాడు! అలనాడు విశ్వకర్మ విశ్వములోని సమస్తసుందర వస్తువులనుండియు తిలప్రమాణ మాత్రముగా సౌందర్యమును తీసికొని, తిలోత్తమను సృష్టించినాడట! ఈ నాగినీసృష్టి అట్టిది కా నోపు!" అని యనుకొన్నాడాతడు.

నాగిని విజయనగరమునకు వచ్చినప్పటినుండియు, ప్రతి భాను వాసరమునను హజారరామస్వామిని దర్శించి పూజించి పోవుచుండును.

ఆ యాదివార మానాడే వచ్చినది. రామాలయ ముఖద్వారమున అడుగిడు నప్పటికి, అపశకునమువలె ఆమెకు తిరుమలరా జగపడినాడు. నాగిని పూజాసామగ్రితో వాని కంట బడినది. అతడు మంచి యవకాశము చిక్కినది గదా యని సంతసించినాడు. నాగిని పూజ ముగించుకొని కోవెల వెలుపలికి వచ్చునప్పటికి తిరుమలరా జామెకు స్వాగతమిచ్చి "నాగినీ! నీ యభిప్రాయమును మార్చుకొని నన్ననుగ్రహింపవా! నిన్ను నా నాగమాంబతో సమానముగా చూచుకొందును. పువ్వులలో బెట్టిపూజించుకొందును. నన్ను నీ దాసునిగా నేలుకొనవచ్చును." అని బ్రతిమలాడ బూనినాడు. నాగినియు వానిని సన్మార్గమునకు ద్రిప్పనెంచి, "నీ కోరిక నాకు దుస్సహము తిరుమలరాజా! నేను జీవితమున పురుష సౌఖ్యమునే వలచుటలేదు. అట్టి కోరికయే నాకున్న, నే నేనాడో పెండ్లి చేసికొనెడిదానను. రామరాజులవారి అర్ధాంగలక్ష్మి మోహనాంగిగారు నా యేలిక యని ఎఱుగవేమో! నేను అనుపిల్లలను బసివిరాండ్రనుగా చూఱవిడుచు దురాచారమును రూపుమాప కంకణము కట్టుకొని యున్నాను. నా యభిప్రాయమును ప్రభువులకు నివేదించి, ఈ నీచ దురాచారము నంత మొందింతును. నిన్ను నా సోదరునిగా భావించుచున్నాను. చేతనైన నా యత్నమునకు నీవును దోహదము చేసిన సంతసింతును" అనెను.

మోహనాంగి రామరాజుల పేర్లు వినగానే అతనికి ఒడలుమండినది. "ఆ రామరాజు తనకు భార్య గావలసిన మోహనాంగిని పెండ్లాడి కులుకుచున్న ధూర్తుడు. తన్నుగాదని రామరాజును చెట్టవట్టినది మోహనాంగి." వారి పేరు లాతని నుడికింప కేమి చేయును. అతడు క్రోధాసూయలు ముడివడ, రూక్షవచనములతో నన్నాడు.

"నీవంటి సంతబసివిరాండ్ర నెందఱనో యెఱుంగుదును. వారు చెప్పు నీతుల నెఱుంగుదును. నాగినీ! నిన్ను సాధించి తీరెదను అనాచు

చిన్నదానవని యూరకుంటిని. నేడు బ్రహ్మరుద్రాదు లడ్డు పడినను నిన్ననుభవింపకుండ వదలను. నే నెవరినో యెఱుంగుదువా ! పలకము చినతిరుమలరాజును.”

“కానిమ్ము తిరుమలరాజా! నేను నిన్ను సన్మార్గమునకు త్రిప్ప జూచితిని. నీకు నా హితబోధ రుచింపలేదు. ఒకనాడు నేను నీపాలిట రుద్రాంబ నగుదు నంటిని. కాని ఆ యభిప్రాయమునుగూడ మార్చుకొని నిన్ను నా తోబుట్టువుగా నెంచ దలచితిని. అది నీ కిష్టము కాలేదు. నీవొక అపుత్రాచమను ముద్దిడుకొన జూచుచున్నావు. నే నేమి చేయుదును. నీ యభిప్రాయమును మార్చుకొననిచో, నీ ప్రాణవాయువులు ఈనాగినికి ఆహారము కాగలవు.”

అని పలికి నాగిని వెడలిపోయినది. ఆమె చేసిన బోధ, తిమ్మ రాజునకు పామునకు బోసిన పాలైనవి. అత డింటికి వచ్చి నాగినిని సాధించు నుపాయ మాలోచించుచున్నాడు. గడచినరాత్రి నిద్ర లేనందున ఆ నా డాతనికి నిద్రపట్టినది. కలలో నాగిని, కన్పట్టినది. అత డామెను వశమొనర్చుకొనుటకై బుజ్జగించుచున్నాడు. ఆమె నీతి బోధలు చేయు చున్నది. కడకు తిరుమలరాజు మంచిమాటలు పని చేయవని యెంచి తాను పురుషుడను నహంకారముతో ఆమెను బలాత్కారముగా సెజ్జపై బడవైచి, కౌగిలింపబూనినాడు. ఆమె తప్పించుకొనుటకై పెనగులాడు చున్నది. చేతులతో త్రోసివేయుచున్నది. గోళ్ళతో అక్కుచున్నది. దంత ములతో అందినతావుల నెల్ల కొఱుకుచున్నది. కాళ్ళతో తన్నుచున్నది. తిరుమలుని యొడ లంతయు నెత్తుటితో నిండిపోయినది. అతడు తన ప్రయత్నమును మానక బలాత్కరించుచునే యున్నాడు. కడకు నాగిని కాలసర్పాకారము తాల్చి, పడగ విప్పి బుసలు కొట్టుచు వానిని కాటు వేయనే వేసినది. అతడు “నాగినీ” యని పెద్ద కేక వేసి మేలుకాంచినాడు.

ఆ అలుపునకు ప్రక్కలో నున్న నాగమాంబయు మేల్కొన్నది. భర్త నాగిని యని నేడుగూడ కలవరించుటచే అతడు మోహనాంగి ప్రాణసఖియైన నాగినిపై మరులు కొన్నాడని గ్రహించినది. అయినను నోట నాలుకలేని యా యిల్లాలు, మగనితో ఆ విషయము ప్రస్తావించి "అదే" మని యడుగుటకే ధైర్యము చాలక మిన్నకుండవలసి వచ్చినది. ఆమె అదేమన్నచో ఆమెకు "దేహశుద్ధి" తప్పదు.

తన భర్త పరస్త్రీ వ్యామోహమున బడుట కెట్టి వనితయు నంగీకరింపదు. తిరుమలరాజునకు కలిగిన నాగినీప్రేమ నాగమాంబను కలత పెట్టినది. ఈ దుర్వ్యాపారమునుండి భర్తను మరల్ప నెంచి యామె వేంకటాద్రిని తీసికొని మోహనాంగి యంతఃపురమునకు వచ్చి ఏడ్చుచు నామెతో నిట్లు చెప్పుకొన్నది.

"అమ్మా మోహనాంగీ! నీవు నా కాపురమును నిలబెట్టవలయు నని వేడుకొనుచున్నాను. నా సంసారము చట్టుబండలగు రోజులు దాపురించినవి."

"అదేమి అత్తా! సంగతి యేమో చెప్పక ఊరకే యేల యేడ్చెదవు?"

"ఏమని చెప్పుదును! నీ ప్రాణసఖి నాగిని నా కాపురము తీయ బూనుకొన్నది. మీ మామగారు రేయి పవలు "నాగినీ, నాగినీ" యని, ఒకటే కలవరింతలు, నా కాపురము నిలుపుభారము నీ చేతిలో నున్నది నాగినిని మందలించి, నా కన్యాయము జరుగకుండ చూడుము."

"నాగిని అట్టిది కాదమ్మా! ఆమె శీలవతి. ఒకవేళ నీ మగడే దానిపై వలపుగొని అట్లు పలవరించుచున్నాడేమో ఆలోచించినావా?"

"లేదు. నే నాయనగారితో ఈ సంగతి ప్రస్తావించుటకే వీలులేదు. ప్రాణములపై ఆశ వీడి ఆ పని చేయవలెను."

మోహనాంగి, నాగమాంబకు సందేహనివృత్తి చేయదలంచి నాగినిని రప్పించి సంగతి నడిగినది. నాగిని, వేంకటాద్రిని వరదాదేవిగారి యింటికి తీసికొని పోయినప్పటినుండియు తిరుమలరాజునకు, తనకును జరిగిన కథను సాంతము వివరించినది. నాగమాంబ నాగినిని లోలోన మెచ్చుకొనుచు తన భవనము చేరుకొన్నది.

అలనాడు, బసివి, చిన్ననాటి చినతిరుమలరాజు దుష్టచేష్టితమును గూర్చి మోహనాంగికి చెప్పుకొనియే యున్నది. దాని కిది తార్కాణముగా నరిపోయినది. తిరుమలరాజు స్త్రీ లోలు డన్న సంగతి మోహనాంగికి ఋజువగుటయేగాక, అతడు తాను పట్టినపట్టును సాధింపక విదురింపని మాత్సర్యశాలి యనియు ఆమెకు స్పష్టమయినది.

తిమ్మరాజు నాగినితో "నాగినీ! నిన్ను సాధించి తీరుదును" అన్న మాటలు మోహనాంగికి భయము గొల్పినవి. ఆ దుష్టుడు నాగిని కే వేళ నెట్టి యపకారము చేయునో యని భీతి చెంది ఇట్లనినది.

"నాగినీ! తిమ్మరాజు చెయ్దమును మీ ప్రభువుల కెఱింగించెదను. వారు నీకు తగినరక్షణ మేర్పఱతురు. లేకున్న ఆ దుష్టు డెప్పు డెట్టి దుర్మార్గమునకు పూనునోయని తోచుచున్నది."

"వలదమ్మా! నా కెట్టి రక్షణమును వలదు. నా రక్షణభారమును నేనే వహింపగలను."

"అదెట్లు? నీ వాడదానవుగదా! ఒక పురుషుడు అపకారము చేయ బూనుకొనిన, ఎట్లాత్మరక్షణము చేసికొందువు?"

"అదంతయు నాకు తెలియు నమ్మా! మీరు భయపడవలదు."

"అయినను ప్రభువులకు దెల్పుట మంచిది కదే!"

"ఏమియు వలదమ్మా! అతడు నన్ను బెదరించుట కల్లన్నాడేగాని, అంతటి సాహసము చేయలేడని నా నమ్మకము. అంతగా మీదికి వచ్చిన అప్పుడే చూచుకొందము.

అని, మోహనాంగి ప్రయత్నము నాపినది.

చినతిరుమలరాజు తనబావగారు చక్రవర్తియైనాడన్న గర్వముతో, కన్ను మిన్ను గానక తిరుగుచున్నాడు. బావగారి మెప్పునందుటకై రాజ్యకార్యములందు చొఱవ చూపుచు శ్రమించుచున్నాడు. అప్పగారి యాదరము నెక్కుడుగా సంపాదించుటకు కూడ ప్రయత్నించుచునే యుండెను. అందుకై మేనల్లుని విపరీతముగా ప్రేమింపబూనెను. అతడు తన భార్యద్వారా వేంకటాద్రిని మోహనాంగి భవనమునకుపంపుట, మఱల రప్పించుకొనుట సాగించినాడు. వేంకటాద్రిని వరదాదేవిగారి యింటికి చేర్చుపని వింతవఱకు నాగినియే చేయుచున్నది. ఏ సమయమో చూచుకొని, నాగినిని కబళింపవలయుననుట తిమ్మరాజు నాంతర్యము. ఒకనాటి రాత్రి, నాలుగుగడియల ప్రొద్దుపోయిన పిమ్మట, నాగిని వేంకటాద్రిని వరదాదేవిగారి యింట వదలి వచ్చుచున్నది. దారి నడుమ తిరుమలుడు కాపలా గాచి నాగినిని పట్టుకొన్నాడు. ఆమెను, సమీపముననే యున్న యొక గృహమునకు తీసికొని పోవలయునని వాని ప్రయత్నము. నాగిని రుద్రాణియై అతనిపై గవిసినది. తిరుమలున కామె యుద్ధ విద్య నేర్చిన సంగతి తెలియదు గదా! వారు చాలసేపు పెనగులాడినారు. నాగిని కుస్తీ పట్లతో వానిని నొప్పించుచున్నది. ఎట్టకేల కాత డామెను బాహుపంజర మున బంధించి సమీపగృహమునకు తీసికొని పోవుచున్నాడు. గత్యంతరము లేక, నాగిని చేతికి చుట్టబడియున్న చుఱకత్తి నూడదివిచి ఆతని తొమ్ములో క్రుమ్మబోయినది. తిరుమలుడు భయభ్రాంతుడై చేతులలో

నున్న నాగినివి నేలపైపైచి పాఱిపోయినాడు. ఇదంతయు పావుగడియలో జరిగిపోయినది.

రామాలయము ముందు, తిరుమలు డామాట యన్నప్పటినుండియు నెటుపోయి యెటువచ్చునో యని నాగిని చుఱకత్తి నొకదానిని ధరించియే తిరుగుచున్నది. అది యొక విచిత్రమైన కత్తి. దానిని కడియమువలె చుట్టవచ్చును. అట్లు చుట్టి ముంజేతికి కంకణమువలె ధరింప వచ్చును. అప్పుడది చూచువారికి వెండి మురుగువలె కానబడును. అవసరమైనప్పు డూడదీసి చుఱకత్తివలె నుపయోగింప వచ్చును. అప్పు డది వంగక నిక్కబొడుచు కొనియే యుండును. దానిని విషదిగ్ధము చేసి నాగిని వాడుచున్నది. ఆ విషము రక్తము నంటిన చాలును; వెంటనే ప్రాణములు పోవును. కాని, తనకింత యెగ్గొనర్ప బూనుకొన్నను, నాడామె తిరుమలుని గుండెలో కత్తిని గ్రుచ్చలేదు. ఆ పని చేయబోవు నప్పటికి, నాగినికి పట్టెడు పసుపుకుంకుములతో కళకళ లాడుచున్న నాగమాంబ జ్ఞప్తికి వచ్చినది. ఆ ముత్తైదువ, నాగిని మనస్సులో జాలి కలుగజేసినది. ఐదువరాండ్రన్న నాగిని కధిక గౌరవము.

* * *

కొంతకాలమునకు, తగిలినవ్రేలికికే తగులు నన్నట్లు దురదృష్ట వశమున అన్నపూర్ణాదేవి యల్లారు ముద్దుబిడ్డడు శ్రీకృష్ణదేవరాయల రెండవకుమారుడుగూడ, హఠాత్తుగా జబ్బుచేసి కాలగతిని పొందినాడు. మఱల, అంతఃపురమున కిది యొక యాఘాతము. మోహనాంగి మాత్ర మితూరి, తమ్ముని చావునకు డిల్లపడక ధైర్యమునే పూన జాలినది. అందుకు నాగిని చేసిన వైరాగ్యబోధలే కారణము :

# 18

అచ్యుతదేవరాయలు వజ్రసింహాసనము నెక్కినపిదప కాలము ప్రశాంతముగా సాగలేదు. అనేకులైన పాళియగాండ్ర తిరుగుబాట్ల నాతడెదుర్కొనవలసి వచ్చినది. పెక్కురు దుర్గాధిపతుల నణచి కప్పములు గొనవలసి వచ్చినది. ఇందుకుతోడు మహమ్మదీయుల దండయాత్రలకు మాఱొడ్డి నిలువవలసి వచ్చినది. ఇట్టిస్థితిలో రాజునకుగాని రాష్ట్రమునకుగాని నిలకడ యెక్కడ? అసలు అళియరామరాయలకు, అచ్యుతదేవరాయలు రాజగుట యిష్టమే లేదు. అతడు కృష్ణదేవరాయల రెండవ కుమారు నాధారము చేసికొని తా నభిషిక్తుడై, అతని పక్షమున తానే రాజ్యము చేయవలయునని ఆలోచించుచుండగా, ఆ చిన్నవాడును అకాల మృత్యువు వాతనే పడినాడు. రామరాజు తనకు పట్టభంగమైనదని భావించి, విజయనగరముననుండ నిష్టములేక, కొంతకాలము పెనుగొండయందే కాలముపుచ్చెను. కడకదియు నిష్టములేక, పెనుగొండకు కటికము కృష్ణప్పనాయకుని మండలాధీశునొనర్చి విద్యానగరమునకే విచ్చేసినాడు. ఒకనాడు మనస్సేమియు బాగుండక, మోహనాంగితో వినోదించుట కాతడంతిపురిలోనికి వచ్చినాడు. తాను వచ్చునప్పటికి మోహనాంగి—

"కరారవిందేన పదారవిందమ్
ముఖారవిందే వినివేశయన్తమ్,
వటస్య పత్రస్య పుటే శయానమ్
బాలం ముకుందం మనసా స్మరామి."

"కేలుదామరతో, కాలుదామరను ముఖతామరసమున వేసికొనుచు, మఱ్ఱియాకుమీద బవళించిన బాలకృష్ణుని స్మరించుచున్నాను" అను నర్థము

గల శ్లోకమును భక్తితన్మయత్వముతో బాడుచు నిలబడి యున్నది. ఆమె యెదుట గోడమీద ఆ బాలకృష్ణుని చిత్తరువు వివిధవర్ణములచే సుందరముగా తీర్చబడి యున్నది. ఆ చిత్ర మామె సృష్టియే! రామరాజు వెనుకగా వచ్చి ఆమె కన్నులను మూసినాడు. ఆమె విషయమున, అంత చనవుతీసికొనువారు, నాగినియు, రామరాజునే. అట్టి ధ్యానసమయమునందు నాగిని కనులు మూయదని మోహనాంగి యెఱుంగును. ఆమె, తన పతి దేవుడే యనుకొని "గుర్తించినాము లెండని" ఆయన చేతులను దీసివేసి సిగ్గుతో ప్రణమిల్లినది. రామరాయలు చిఱునగవుతో "దేవికి బాలకృష్ణుని పై మక్కువ యున్నట్లున్నదే!" అని పరిహాస మాడినాడు. ఆమాటకు మోహనాంగి యింకను సిగ్గిల్లినది. ఆమె కింకను సంతానము కలుగలేదు. ఆ వాంఛతోనే ఆమె బాలకృష్ణుని చిత్రించి ఆరాధించుచున్నదని యా సరసు డంతలోనే గ్రహించినాడు. ఆమె కొంతసేపు మారీచీపరిణయము లోని పద్యముల నాయనకు వినిపించినది. పిమ్మట వా రిరువు రిట్లు సంభాషించినారు.

"మీ పినతండ్రిగారి పాలనమున కళాసాహిత్య పోషణము లెట్లున్నవో తెలిసికొనవచ్చునా?

"ఎక్కడ వండీ! గద్దె యెక్కినప్పటి నుండియు సంగ్రామముల తోనే సరిపోవుచుండెను. అయినను, ఆయనగారు కవిపండిత పోషణమున యథాశక్తి పాటుపడుచునే యున్నారు. రాజనాథడిండిముడు, పినతండ్రిగారి ప్రధానాస్థానకవి. అతడు సంస్కృతమున "అచ్యుతరాయాభ్యుదయ"మను కావ్యమును వ్రాయుచున్నాడట. చింతలపూడి యెల్లయ్యకవి మీ రెఱిగినవాడే కదా! అతడు "తారకబ్రహ్మరాజీయము"ను రచించినాడట. చెప్ప మఱచినాను. డిండిమకవి "భాగవత చంపువు"ను వ్రాసి చిననాయన

గారికే అంకిత మొనర్చినాడు. వారి యామోదముతోనే విరుపణ్ణ లేపాక్షిని శిల్పమనోజ్ఞము చేయుచున్నాడట. మన విజయనగరమున గట్టించు అచ్యుతరాయాలయము పని ముగియ వచ్చుచున్నది గదా!"

"నీవు, భట్టుమూర్తివిగూర్చి విన్నావుగదా! నీకు తెలియదేమో! అతడును పెద్దనగారి శిష్యుడే. నీవలెనే సంగీత సాహిత్యములందు దిట్ట. అతనిని ఆస్థానకవిగా నియమింపజేయ రాదా!"

"ఆ పని మీరే చేయవచ్చునుగదా!"

"నన్ను మీ పినతండ్రిని యాచింపు మందువా!"

"యాచించు టెందులకు. చిన నాన్నగారికి మీ యన్న గౌరవము మెండు. మీవంటి జామాత దొరకినందులకు ఆయనగారుప్పొంగి పోవు చుందురు. మీరు చెప్పినచో, ఆయన కాదనరు."

"నేను చెప్పను. నీవే చెప్పి కార్యము సాధింపుము."

"భట్టుమూర్తి వయస్సున చిన్నవాడని విన్నానండీ!"

"నీవు చిన్నదానవు కావా ఏమి! అప్పుడే కావ్యము నెట్లు వ్రాయ గల్గినావు! జన్మసిద్ధప్రతిభకు పెద్దచిన్న భేదము లుండవు. అదైన, అతనితండ్రి సూరపరాజున్నాడు. అతని కాస్థానపండిత పదవి నిప్పింప వచ్చును."

"పతిదేవుల యాజ్ఞ, నా కొక వరమును ప్రసాదింప గోరు చున్నాను."

"ఏమిటో!"

"మన దేశమున బసివిరాండ్రగోడు తమకు తెలిసినదే కదా! వానిని నిర్మూలించుటకు తాము పూనవలయునని నా ప్రార్థన. ఈ పని చేసితివో స్త్రీ లోకము తమకు శాశ్వతముగా కృతజ్ఞమై యుండగలదు."

"బసివిరాండ్రమీద, దేవి కింతటి దయ ఎందులకో!"

"వారు అనాథలైన స్త్రీలు కదా! శీలవంతులుగూడ ఈదురాచారము నకు బలియై పోవుచున్నారు"

"ప్రయత్నింతము. కాలము కలిసి రావలయును,"

* * * *

ప్రబంధాంకము సూరపరాజు అచ్యుత దేవరాయల భువనవిజయమున ఆస్థానపండితుడైనాడు. అతడు కవియును, పండితుడును, పౌరాణికు డును అయినందున సభ నద్భుతముగా రంజింపజేయుచున్నాడు. తండ్రితో పాటు భట్టుమూర్తిగూడ భువనవిజయమునకు రాకపోకలు చేయ వీలు కలిగినది. కాని ఈ వైభవ మెన్నాళ్ళో సాగలేదు. కొలది కాలములోనే అచ్యుతదేవరాయలు వ్యాధిగ్రస్తు డగుటయు, పరలోకమున కేగుటయు సంభవించినది. ఇప్పుడు సింహాసనము నెక్కునది ఎవరాయను సమస్య రాజకుటుంబమును, ప్రజలను ఎదుర్కొన్నది.

ఇంతవరకును అచ్యుతదేవరాయల చేతిక్రిందనుండి అధికారము చెలా యించుచున్న చినతిరుమలరాజునకు బావగారి మరణము సామ్రాజ్యవాంఛను రెచ్చగొట్టినది. అతడెట్లైన తన మేనల్లుడైన వేంకటాద్రిని గద్దెపై కూర్చుండ బెట్టి అతనిపక్షమున అధికారము కైవసము చేసికొనవచ్చునని తలంచినాడు. ఈ పథకము కుదిరినచో, రామరాజునుగూడ లెక్కచేయక తానే సర్వసామ్రాజ్యమునకు మూలస్తంభముకావచ్చునని వాని యూహ.

ఇట్టి యూహతో నాతడు అక్కగారైన వరదాదేవికి నూరిపోసినాడు. ఆమెయు లేతవయస్సువనే కొడుకు రాజగుననను కోరికతోను, తాను రాజమాత కావచ్చునను నాశతోను, తమ్ముని యుద్దేశ్యమును బలపఱచినది. చినతిరుమలుడు చుట్టుపట్టుల నున్న దుర్గాధిపతులను, ప్రజలను ఏవేవో వాగ్దానము లొనర్చి తన కనుకూలురను చేసికొన్నాడు.

ఇక అంతఃపురములో తిరుమలదేవీ ప్రభృతులు బాలుడైన వేంకటాద్రిని సమ్రాట్టును చేయుట తగదనియు, అళియరామరాజే సింహాసనము నెక్క నర్హుడనియు పట్టుపట్టిరి. తనకు కొడుకులు లేనప్పుడు, తన యల్లుడు రాజు కావలయునని ఏయత్తగారు కోరుకొనదు? తన కూతురు పట్టమహిషి యగుట ఆమెకు సంతసముకాదా? అయినను మోహనాంగి యందు కంగీకరింపలేదు. తన తండ్రికి, తనయల్లుడే రాజు కావలయునని యున్నచో, మరణకాలమున అచ్యుతదేవరాయలకు రాజ్యాభిషేకము చేయుడని ఏల శాసించి పోవును? ఆయన యొక ధర్మమునకు కట్టుబడి అవేర్పాటు చేసినాడు. తుళువ వంశాంకుర ముండగా, పరుల చేతిలోనికి సామ్రాజ్యము పోరాదని, ఆయన యభిప్రాయమై యుండ వలయును. ఆయన, సంతానముమీద మమకారము లేనివాడు కాడు: రామరాజుమీద ప్రేమాదరములు లేనివాడును కాడు. అయినను ధర్మ మొక్కటే, ఆ ధర్మప్రభువున కారాధనీయము. అట్టి మహాపురుషుని సంకల్పము నెఱవేర్ప తోడ్పడుట రాజకుటుంబ కర్తవ్యమని మోహనాంగి చెప్పినది. ఆమెకు, తాను పట్టమహిషి యగుటకంటెను పితృధర్మమును పాలించుటయే కర్తవ్య మైనట్లు తల్లులకు తోచినది. వారామె యభిప్రాయమున కెదురుచెప్పుటకు వీలు లేక పోయినది.

మొత్తముమీద నిట్టి వన్నియు తిరుమలరాజు నదృష్టముపండుటకు బాటలు తీర్చినవి. వేంకటపతి దేవరాయలు వజ్రసింహాసన మధిష్ఠించి

విజయనగర సమ్రాట్టు అయినాడు. ఈ సందర్భమున చినతిరుమలరాజు మహావైభవముతో భువనవిజయసభ నేర్పాటు చేసెను. అందు భట్టుమూర్తి మనోహర కవిత్వముతో ప్రభువు నాశీర్వదించెను. సూరపరాజు సంగీత సుధామాధుర్యము నందించెను. అతని గానవిద్యాచాతుర్యమునకు శిలలు కఱిగినవి. మోళ్ళు చిగిర్చినవి. సభ్యులు తన్మయులైనారు. తిరుమలరాజు శ్రోతల సంతోషము నెఱింగి సూరపరాజునకు వేంకటరాయభూషణ బిరుదము నిచ్చి సత్కరించినాడు. ఈ సభ వేంకటపతి దేవమహారాయల వారిది. ఆయన ముద్దుపేరు వేంకటాద్రిగదా! వేంకటరాయలన్న దాయన సంక్షిప్తనామము. అట్టి వేంకటరాయలసభకు, భూషణమైనాడు గాన, సూరపరాజు వేంకటరాయభూషణుడైనాడు. తిరుమలరాజు కళాపోషణ దీక్షకు ప్రజలు సంతసించినారు. ఈ విషయము అళియరామరాయలు విని ఎంతో సంతసించినాడు. అతడు, భట్టుమూర్తి శ్రేయోభిలాషి కదా, బాలుడైనను వేంకటపతిదేవరాయలు విద్యావ్యసని. మండ రామానుజా చార్యులనెడి మహాపండితునివద్ద నానాశాస్త్రముల నాత డభ్యసించుచు "విద్వన్నిధి" యని పేరందినాడు. విద్వద్గోష్ఠులన్నచో, వానికెనలేని ప్రీతి.

ఈ వేంకటపతిరాయలు పేరునకు మాత్రమే రాజు. రాజ్యకార్యము లన్నియు చూచుకొనునది తిరుమలరాజే. అతని కొక్కక్షణమైనను తీఱికలేదు. కప్పములు కట్టించుకొనుట, బొక్కసములోని రొక్కపు లెక్కలను సరిచూచుకొనుట, పాళియగాండ్రయు, దుర్గాధిపతులయు విజ్ఞప్తులందుకొని, వారికి తగిన సమ్మతు లొసగుట—ఇట్టి కార్యములతో అతనికి రోజంతయు సరిపోవుచున్నది. అతడు నిద్రాహారములు కూడ మాని రేలు పవళ్ళు రాజకీయకార్యములలోనే మునిగి తేలుచున్నాడు.

తిమ్మరాజున కింతటితో తృప్తికలుగలేదు. సింహాసనమును తానే యధిష్ఠించిన బాగుండునను దురాశకలిగినది. అత దందుకోనమై తన కున్న యవరోధములను దొలగించుట ప్రథమకర్తవ్యమని తలంచినాడు. రంగరాయలకొడుకు సదాశివరాయలున్నాడు. అత డే నాటికైనను సింహాసనము నాక్రమింప నర్హత గలవాడు. ఒకానొకప్పుడు తనమీది ద్వేషముచేగాని స్వార్థపరతచేగాని అళియరామరాయలు సదాశివుని గద్దె నెక్కించి తా నధికారము నెఱపవచ్చునుగదా! అందుకని యాతడు సదాశివరాయలను గుత్తిదుర్గమునకు బంపుచున్నాననియు, అచ్చట వానిని కారాగారమున బంధింపవలసిన దనియు గుత్తిదుర్గాధిపతికి కబురుపంపెను అ దుర్గాధిపతి చేజేత నీయన్యాయము నొనర్పజాలనని యెదురుతిరిగెను. తిమ్మరా జందులకు కోపించి, గుత్తిదుర్గాధిపతిని జంపి, అతని స్థానమున తన యనుచరుని నియమింపజేసి, సదాశివుని కారాగారబద్ధు నొనరింప జేసినాడు. చినతిరుమలరా జింకను రాజ్యదాహముతో నెన్ని యో దురంతముల కొడిగట్టినాడు. తనమాట వినని మండలాధిపతులనుశిక్షించు చున్నాడు; కొందఱను చంపుచున్నాడు. ప్రజలపై వివరీతపు పన్నులను వేసి పీడించుచున్నాడు. వాని పరిపాలన మిట్లు దేశమున కుపద్రవకారి యైనది.

ఇట్టి సమయమున మిన్నకుండుట పాడి గాదని అళియరామరాజు రాజకీయములందు జోక్యము చేసికొనెను. అతనికి కొందఱు దుర్గాధిపతు లనుకూలురే. ప్రజలు తిరుమలరాజుపాలన మన్న నేవగింపుతోనున్నారు గాన, రామరాజు వారి బలముతోను, తన కనుకూలమైన సైన్యముతోను గుత్తిలో బద్ధుడై యున్న సదాశివరాయలను చెఱ విడిపించుకొని వచ్చి రాజ్యార్హత సదాశివునికే కలదని తిరుమలునికో తగవు పెట్టుకొనినాడు. తిమ్మరాజు చేయున దేమియు లేకపోయినది. ఇదివఱకే సదాశివుని తన

ముట్టించినచో నీ పితలాటకము వచ్చెడిదికాదు. తానొకరీతిగా పొరపాటే చేసినట్లాతడు నాలుక కొఱుకుకొన్నాడు. సరే ప్రస్తుత కర్తవ్య మేమి! చివరకు పెద్దలయు, మధ్యవర్తులయు మాటమీద రాజ్యమును చెఱిసగము పంచుకొని పాలించునట్లేర్పాటు కుదిరినది. వజ్రసింహాసనము చెఱి యాఱునెల లధిష్ఠింపవలయును. ఎవరి యధీనమందున్న రాజ్యమునందలి లాభనష్టములు, బాగోగులు వారివే. ఒకరి రాజ్యములో మఱియొకరు జోక్యము కల్పించుకొనగూడదు. ఈ యొడంబడిక రాజ్యమునకును, రాజకుటుంబమునకును, సంతృప్తిని గూర్చినది. తమ యల్లుడు సదాశివ దేవరాయల యాధిపత్యమున రాజ్యమునకు మంత్రియైనాడని తిరుమలదేవీ అన్నపూర్ణలును, తనతమ్ముడు, తనకుమారుని యాధిపత్యమున మంత్రి యైనాడని వరదాదేవియు సంతసించినారు. మోహనాంగికిని, నాగినికిని ఒక్కగొడుగుక్రింద నుండవలసిన సామ్రాజ్యము రెండు ముక్కలై నందుకు తీరని విచారము కలిగినది. సదాశివరాయలు పేరునకు మాత్రమే రాజు. రాజ్యవ్యవహారము లన్నియు నడపునది అళియరామరాయలే. ఆతడు వజ్రసింహాసనముపై గూర్చున్నను కాదనువారులేరు.

# 19

ఆశాపాశమున కంతమనునది యుండదు. అదియడ్డమాకలు లేక పెరిగిపోవుచునే యుండును. మేనల్లుని నామమాత్రపు రాజు నొనర్చి తాను రాజ్యకార్యములు నడుపుచున్నను, తిరుమలరాజునకు తృప్తికలుగ లేదు. తానే స్వయముగా సింహాసనము నెక్కి యేలుబడి చెలాయింప వలయునని దురాశ పుట్టినది. విక్కమాలోచించిన తిరుమలు డిప్పుడు రాజ్యభోగముల నే కొఱతయు లేక అనుభవించుచునే యున్నాడు. తన్ను కాదనువారు లేరు. ఎవరు కాదందురు. రాజమాత వరదాదేవి తనకు

అక్కగారే. మేనల్లుడు వేంకటపతిదేవరాయలు నోట ప్రేలిడిన కొఱక లేనివాడు. తన కడ్డమేమి? అయినను గద్దెనెక్కి, నెత్తిపై కిరీటము పెట్టుకొని యూరేగవలయు ననుకోరిక వానికి బలమైనది,

"వినాశకాలే విపరీత బుద్ధిః" కదా।

తాను గద్దెనెక్కవలయునన్న ఇప్పుడున్నవానిని దింపవలయును. ఎట్లు దింపుట? అందుకేదో నెపము చూపవలయును. న్యాయమాలోచించిన తా నెవరు? కృష్ణరాయల తమ్ముని బావమఱది. ఆతమ్ముడుగూడ సొంతవాడు కాడు. సవతితమ్ముడు. అట్టి సవతితమ్ముని, బావమఱదియేకదా తాను. తనకు రాజ్యార్హత లేనేలేదు. అయినను పరిస్థితు లనుకూలించి తనకీ మహాయోగము పట్టినది. మేనల్లుని తొలగింపవలయు నన్న, చిన్నవాడన్న నెపము చూపవలయును. అతడు చిన్నవాడైనందున కలిగిన లోపమేదియు లేదు కదా। తానే మాఱటరాజుగా సర్వకార్యములను నిర్వహించుచున్నాడే. తన రాజ్య భోగానుభవములకు అక్కగాని, మేనల్లుడుగాని అడ్డుచెప్పుటలేదే, ఇక తన కేమి కొఱత. ఏమో, తెలియదు. ఏ కొఱత లేకున్నను, మేనల్లుని తొలగించి తానే రాజు కావలయుననుకోరిక అతనిని బాధించుచున్నది. అతడా కోరిక నణచుకొనలేక పోయినాడు. మేనల్లుని తొలగించుటకును వానికే యుపాయమును తోచలేదు. ఇక చేయవలసిన దేమి?

చిన తిరుమలరాజునకు పూర్వరాజుల చరిత్రము తెలుసుకయే. కృష్ణరాయలయన్న వీరనరసింహరాయలు తమ్ముడని మైన నెంచక కృష్ణరాయల నేల చంపింప యత్నించినాడు? నిన్నగాక మొన్న, పెక్కురు మహమ్మదీయ ప్రభువులు అన్నదమ్ములనెడి రక్తసంబంధమును గూడ పాటింపక, ఒకరి నొకరు వధించుకొని ఏల రాజులైనారు? రాచజీకము

కావలయు ననుకొన్నప్పుడు, కొందఱి కపకారము చేయక తప్పదు. కేవల ధర్మమార్గము రాజ్యభోగములకు దూరముగా నుండును. దుర్యోధను డేదో యన్యాయము చేయుటవలననే పెక్కేండ్లు రాజ్య మేల గల్గినాడు, పాండవులు ధర్మము నంటిపెట్టుకొని అడవులపాలై ఆపదలు గుడిచినారు.

తిరుమలు డా రాత్రి భోజనమయినపిమ్మట పడకగదిలో శయ్యపై మేను వాల్చినాడు. మఱల నాతని మన స్సాలోచనా వీథిలో సంచరింప మొదలిడినది. వేంకటపతిరాయలను తొలగించు టెట్లు? వానిని చంప వలయును. ఈ యూహ కలుగునప్పటికి, అత డులికిపడినాడు. అతని వీపుపై నెవరో అఱచేతితో చఱచినట్లనిపించినది. అతడు తన్ను తాను విగ్రహించుకొనినాడు. "ఏ చేతులతో వేంకటాద్రి నెత్తుకొని పెంచి పెద్ద వానిని చేసినాడో, ఆ చేతులతోనే వాని కుత్తుక నులుముటయా!" వాని మనస్సున రక్తసంబంధముచేత నైన అక్కటికము కలిగినది. "అయినను సింహాసనముకోసమై మేనల్లుని చంపకతప్పదు. అతనిని చంపకున్నచో, నెంతకాలము తన యధికారము సాగును? అతడు పెద్దవా డగువంత వఱకు! పిమ్మట, వాడు తన యాటలు సాగనిచ్చునా యేమి! వాడే సర్వాధికారములను చేపట్టును. ఇక నప్పుడు తాను కోఱలు తీసిన త్రాచు. వాని కొక తాబేదారు. ఇది తనవంటి పౌరుష పరాక్రమశాలి సహింప దగినది గాదు. అతని నెదుగనిచ్చు టేల, తత్ఫలితములను తా ననుభ వించు టేల! మొక్కగా నున్నప్పుడే త్రుంచివేయక, మ్రానైన పిమ్మట గొడ్డళ్ళు వెదకుకొననేల?" తిరుమలు డిట్లు తలంచుచున్నాడే గాని నడుమ నడుమ వరదాదేవి తలపున మెఱసి, అతని యాలోచనలు కటికి కసాయి చేతలని చెప్పుచునే యున్నది. అత డే నిశ్చయమునకును రాలేక పోవుచున్నాడు.

"పురుషార్థము లందురు కదా! వానిలో నేవి మంచివి? ధర్మ మోక్షము లెవ్వరినిగాని సుఖపెట్టినట్లు లేదు. ఇక అర్థకామములే ఆరాధ్యములు. తాను కామపురుషార్థమును జుబ్బనచూఱగా ననుభవించినాడు. తన జీవితములో ఒక్క బసివి తక్క తన కెదురు తిరిగిన సుందరాంగియే లేదు. బసివికథ మాత్ర మప్పుడే యెక్కడ ముగిసినట్లు? తాననుభవింపక విడుచునా? బసివి తన బాహుబంధమున జిక్కు రోజు రాకపోదు. ఇక అర్థపురుషార్థ మున్నది. ఇది యన్నింటికి మూలమైనది. అర్థమున్ననే, ఏ యాటయైనను సాగును.

"అస లీ ధర్మమోక్షము లనున వెక్కడినుండి వచ్చినవి? అవి సోమరులు సృష్టించిన వింత కల్పనలు. అవి పరలోకమున శ్రేయస్సును గూర్చునట. ఏటిమాటలు! అసలా పరలోకమెక్కడ? అక్కడకు పోవున దెవరు? శరీర మిచ్చటనే కూలిపోవుచున్నది కదా? ఎవడో జీవుడట. ఆతడు చావడట. వాడు పరలోకమునకేగి పాపపుణ్యము లనుభవించునట. ఎంత వింతయైన కల్పనలు చేసి సమాజమును నిర్బంధములో పెట్టినారు. అట్టి జీవుడున్నా డన్ననే కాని, వాని యుద్గతికోసమై యజ్ఞయాగాదులు చేయ వలసి పడదు; నోములు, వ్రతములు, తద్దినములు, మాసికములు, అవీ, యివీ, కొనసాగించుటకు వీలుకాదు. ఈ కర్మకాండము సంఘము లోని కొందఱి పొట్టకూటి కుపయోగించుచున్నది. ఈ జీవుడు, కర్మములు, పుణ్యాపాపములు లేవన్నచో, వారి బ్రతుకు దెబ్బ దెబ్బతిని పోవును. ఈ దేవాలయము లన్నియు అందుకే తల యెత్తినవి కదా! దేవళములో ఒక ప్రతిమ. అది తినదూ, పెట్టదు. దానికి దిన దినము నైవేద్యములు, ఏటేటను కల్యాణములు; అంగ రంగ వైభవములు. వీనిచే సోమరిపోతుల పొట్టలు నిండును. కనుక ధర్మమోక్షములు లేవు. అర్థకామములు మాత్రమే పురుషార్థములు. ఆ రెంటిలో గూడ అర్థమే అన్నింటికి

మూలము. నిర్ధనుడు నిజముగా నిరర్థకుడే. బొక్కసము తనకు కైవస మైనప్పటినుండియు తా ననుభవించిన వైభవము వేఱు. అదివఱకు తా ననుభవించిన రశ వేఱు. సర్వసౌఖ్యములకు మూలమైన సామ్రాజ్యమున కేదియు సాటిగాదు. ఈ విద్యానగర సామ్రాజ్యమును చేతినుండి జాఱ విడుచుకొనరాదు. దీని కడ్డముగా నున్నవారిని, వా రెట్టి చుట్టములైన నగుదురుగాక, చంపవలసినదే."

ఇట్లాలోచించి వేంకటాద్రిని చంపుటయే కర్తవ్యమని తిరుమల రాజు నిశ్చయించుకొన్నాడు. అంతటితో వాని యాలోచనము కడ ముట్ట లేదు. "ముందుగా వేంకటాద్రిని మడియింప వలయును ఆపై సదాశివుని పని పట్టవలయును. వీరిద్దఱును చచ్చినచో, తుళువ వంశము తుది ముట్టును. వీరనరసింహరాయల కొడుకు ఉన్నను లేనివానిలోనే లెక్క. ఇక మిగులునట్టి ప్రత్యర్థి రామరాజుమాత్రమే. తగిన బలముచేతనో, మోసమును ప్రయోగించియో పిమ్మట వానిని గూడ చంపుటొక ఘన కార్యము కాదు. అతని చావుతో మోహనాంగికి వైధవ్యదుఃఖము కలుగును. అప్పుడు "తిరుమలరాజు నేల పెండ్లాడక పోతినా" యని ఆమె పశ్చాత్తాప మందు తీరును. ఇక విద్యానగర సామ్రాజ్యమునకు ఏకైక సార్వభౌము డెవరు? తిరుమలరాజే కదా! బలే! విజయనగర సామ్రాజ్య చరిత్రను కొత్తమలుపు పట్టించు చక్కని పథకము తోచినది." తిరుమలరా జిట్లు గగనసౌధములను నిర్మించుకొని మురియుచున్నాడు.

చిన తిరుమలరాజు వేంకటపతిని చంపవలసినదని తన భృత్యుల కాజ్ఞ ఇచ్చినాడు. ఒక్కడును అంగీకరింపలేదు. ఆ యంగీకరింపక పోవుట అతని కొక విధముగా మెఱుపే యయినది. వారి మూలమున తిరుమలుడు వేంకటాద్రిని చంపవలయునని దురాలోచన చేయుచున్నట్లు పౌరులు తెలిసికొందురు గదా! అందుకని యాతడు చంపజాలమని తన

కెదురు తిరిగిన సేవకు లందఱిపై ఏవో నేరములు మోపి వారికి మరణ దండనము విధించుచున్నాడు. నగరమున తిరుమలునికి వ్యతిరేకత ప్రబల జొచ్చినది. కడ కాతడు మేనల్లుని తానే తుదముట్టింప నిశ్చయించు కొనినాడు.

వేంకటపతిదేవరాయలు ప్రతిదినమును సాయంవేళల చెలికాండ్రతో గూడి గుఱ్ఱపుస్వారీ చేయుచు తుంగభద్రాతీరమున కేగి విహరించు చుండును. రాత్రి మూడు నాలుగు గడియల ప్రొద్దు పోవువఱకు నటనే యుండి, పిమ్మట ప్రాసాదమునకు చేరుకొనుచుండును. ఒకనా డట్లాతడు విహరించుచుండగా మేనమామ తిరుమలరాజు వచ్చినాడు. అతడు రాగానే వారేమి రాచకార్యములనుగూర్చి మాటాడుకొందురో యని వేంకటాద్రి స్నేహితులు, వారిరువురికి ఏకాంతము కల్పింప నెంచి, అటనుండి వెడలి పోయినారు. కొంత పడి, మామయు నల్లుడును పెక్కు సంగతులను మాటాడుకొనినారు. దీని నంతటిని వారి కనతిదూరములో విహరించుచున్న వేంకటరాయభూషణుడును, భట్టుమూర్తియు గమనించుచునే యున్నారు. వా రేలికలై నందున నప్పుడు దగ్గఱకు వచ్చి మాటాడుట మర్యాద గాదని ఆ తండ్రికొడుకు లావని చేయలేదు.

అది శ్రావణ కృష్ణతృతీయ. ఆఱు గడియల ప్రొద్దుపోయిన గాని చంద్రోదయము కాదు. తుంగభద్రానది గట్టు లొఱసికొని పాఱుచున్నది. అప్పటి కైదు గడియల ప్రొద్దుపోయినది. మామ యున్నాడు కదా యని వేంకటాద్రి ఇంటికి మరలలేదు. ఏ వే వో రాజకీయములను మాటాడు కొని కొంతసేపటికి వారిరువురును గృహోన్ముఖు లైనారు. ముందు మేనల్లుడు, వెనుక మేనమామ. కొంతదూరము నడచిన పిమ్మట, తిమ్మరాజు ముందుకు వచ్చి, మేనల్లుని కుత్తుకను రెండుచేతులతో పట్టు కొన్నాడు. ఆ పట్టు విట్లు పట్టినాడు. తన రెండు బొటన వ్రేళ్లను అంగిలి

గుంట వద్ద నానిచ్చి, తక్కిన రెండుచేతుల యెనిమిది వ్రేళ్ళను మెడచుట్టును త్రిప్పి పట్టుకొనినాడు. బొటమన వ్రేళ్ళతో కంఠకుహరమును గట్టిగా నులిమినాడు. ఈపట్టు మానిసి నలవనీయకయే ప్రాణములను దీయును. వేంకటాద్రికి నోరెత్తుటకు వీలు కాలేదు. కొన్ని నిముసములలోనే నిశ్శబ్దముగా వేంకటరాయల ప్రాణములు మింటి కెగిరి పోయినవి. తిరుమలు డా శవమును బలము కొలది నట్టేటిలో విసరివైచి నిశ్చింత ముగా నింటికి చేరుకొనినాడు. తదియనాటి చంచురు డీ దృశ్యము నప్పుడే తొంగి చూచినాడు. భట్టుమూర్తియు, సూరపరాజును దీనిని గమనించుచునే యున్నారు. వా రదే మన్నచో, తమకుగూడ నట్టి గతియే పట్టునని కుక్కిన పేలై యింటికి చేరుకొన్నారు. ఇది రాజకుటుంబ రహస్యము గదా!

ప్రతిదినము వేళకు ఇంటికి వచ్చు కుమారుడు. అనాడు రా నందున వరదాదేవి తమ్మునికి కబురంపినది. అతడు భృత్యులను విజయ నగరము నాలుగు మూలల వెదుక బంపినాడు. వేంకటాద్రి ఎక్కడ దొరకును? రాజుగారి నెవరో హత్యచేసినారను వార్త నగరమున వ్యాపించినది. ఆ నాడు వేంకటపతిరాయలతో తుంగభద్రాతీరమున విహ రింప వచ్చిన యతని సావాసగాండ్రు, ఆ సాయంకాలము తిరుమలరాజు తమవద్దకు వచ్చినాడనియు, అతడు రాగనే తా మింటికి వచ్చితి మనియు తమ యిండ్ల వద్ద చెప్పిరి. తిరుమలుడు కొన్ని నాళ్ళనుండియు దుర్గాధి పతులను, భృత్యులను, ప్రజలను నిష్కారణముగా చంపుచున్నాడనియు, అతనికి సామ్రాజ్యతృష్ణ కలిగి చండశాసనుడైనాడనియు తలంచుచున్న ప్రజలమూలమున వరదాదేవికి తన కుమారుని చంపినది తన చినతమ్ము డేయని తెలిసినది. దీనికి తో డాతడు ముఖము తప్పించి తిరుగుచున్నాడు. వరదాదేవి యెదుటికి రాడు, ఆమె నోదార్పడు. ఆమె సంగతియే పట్టించు

కొనడు. అతనికి బావగారైన కృష్ణరాయల కూతురు మోహనాంగి విప్పింపవలయునని ప్రయత్నించిన వరదాదేవికి, తమ్ముడు చేసిన బహుమాన మిట్టిది.

పూర్వము కృష్ణరాయల కుమారుడైన తిరుమలరాయల మరణ మునకు తిమ్మరుసు కారణమనుకొని, రామరా జాతనిని కారాగారమున నుంచినాడు. నిక్క మాలోచించిన తిమ్మరుసయ్య రాయల కుమారు నేల చంపును? అతనిని చంపినదికూడ ఈ తిమ్మదే యేల కాకూడదు! తన యొక్క కుమారునే-మేనల్లుడని కనికరమైనను లేక క్రూరముగా చంపిన వాడు, రాయలవారి పుత్రుని చంపుట కేల యొడిగట్టడు! రాకుమారు నట్లు చంపి ఆ నేరము నాతడు ఉపాయముతో తిమ్మరుసు మీదికి త్రిప్పియుండ వచ్చును. ఈ యనుమాన మానాడే కొందఱకు కల్గినది. అయినను రాజ బంధువును, రాయల శ్రేయోభిలాషియునగు తిమ్మరా జిట్టి పని చేయు నని పెక్కురు నమ్మలేకపోయినారు. ఈనాడు సొంత మేనల్లునే చంపుటచే, తిరుమలరాజు తొంటి దుర్మార్గము కొట్టవచ్చినట్లెల్లరికిని తెల్ల మయినది. భట్టుమూర్తికి అళియరామరాయలవారి వద్ద చన వున్నందున, ఒకనా డాతడు వేంకటపతిదేవరాయల మరణవృత్తాంతమును రామరాజున కెఱింగించినాడు.

# 20

తిమ్మని దురంతములకు అళియరామరాజు క్రుద్ధుడైనాడు; అతని నెట్లైనను తుదముట్టించి సామ్రాజ్యమును, ఉపద్రవములనుండి కాపాడ వలయునని కంకణము కట్టుకొనినాడు. ఇంతవఱకును వేంకటపతి దేవరాయలు జీవించియున్నందున, వానిమీది యభిమానముచేత తిమ్మ రాజును క్షమింప వలసి వచ్చినది. ఇప్పుడట్టి యభిమానమునకు పాత్రులు

కాదగిన వారెవ్వరును తిమ్మని పక్షమున లేరు. వరదాదేవి యున్నదన్నచో, తన కుమారునే పొట్టను బెట్టుకొన్న తమ్ముని క్షేమము నామె ఏల కోరును? కడుపుకాలిన యామెకు ప్రతీకారేచ్ఛ సహజమే కదా। తిమ్మరా జిప్పుడు తనగోతిని తానే త్రవ్వుకొన్నట్లైనది. మేనల్లుని కాపాడుకొనుచు కాలము గడపినచో, అతని కందఱి సానుభూతి సహకారము లుండెడివి. ఆతని నెంతగనో, ఆ మేనల్లుడు, ఆ సోదరి, ఆ రామరాజు, ఆ ప్రజలు అందఱు ఆదరించెడివారు. పాపము, దురాశతో తిమ్మరాజంతయు పాడు చేసికొనినాడు. తన్ను గట్టిత్రాళ్ళు తానే తెచ్చుకొనినాడు. ఇప్పుడాతని కెవరి సానుభూతియును లేదు. రామరా జాతని ప్రబలశత్రు వైనాడు. రామరా జట్లు కాలేదు. తిమ్మరాజే రామరాయలను శత్రువుగా మార్చు కొన్నట్లైనది. ఇట్టి విషమఘట్ట మేర్పడినను, తిమ్మరాజు చలింపలేదు. రామరాజునుగూడ సంహరించి తాను చక్రవర్తి కావలయుననియే చూచు చున్నాడు.

రామరాజు నలుగురు సోదరులును అరిభయంకరులు. వారు కొన్ని దుర్గముల కధిపతులై రామరాజునకు బాసటగా నున్నారు. వారు నగరమున, రాయల కుటుంబమునకు జరిగిన విపత్తికి ప్రతీకారము చేయ దలచి తిమ్మరాజును చంపలవయునను తలంపుతో రామరాజుమాట కెదురు చూచుచున్నారు. ఈ యేవురు సోదరుల సైన్యమును కత్తులు నూఱు చున్నది. నాగిని అకొన్న యాడుబెబ్బులివలె నాలుక సాచి కూర్చున్నది. రామరాజు ముమ్ముందుగా యుద్ధము ప్రకటింపనేల యని తిరుమలరాజున కిట్లు కబురంపెను.

"ఈ సామ్రాజ్యము తుళువ వంశము వారిది.
తద్వంశాంకురమైన వేంకటపతిరాయలు అకాల

మరణము పొందినాడు. ఇక మిగిలియున్నది ఒక్క సదాశివరాయలు మాత్రమే. అతడే ఇప్పుడు సమస్త సామ్రాజ్యమునకును చక్రవర్తి కాదగినవాడు. నేను గాని, నీవు గాని తద్వంశమువా రున్నంతవఱకు రాజ్యార్హులము కాము. నీ మేనల్లుడు మరణించుటచే, అతని దయిన యర్ధరాజ్య మిప్పుడు సదాశివరాయల వారికి చెందవలసి యున్నది. నీ వీ ధర్మమును గుర్తించి వేంకటపతిరాయల రాజ్యమును సదాశివరాయల కప్పగింప వలయును. అతని కిష్టమైన, నీ కేదేని గొప్ప యుద్యోగ మిచ్చు నెడల నీ వా పదవి నలంకరింపవచ్చును. ఈ విషయము సదాశివరాయల యనుమతితోనే నీ కెఱింగించుట యైనది."

ఈ మాటలు తిమ్మరాజునకు రుచించునా? అతడు సామ్రాజ్య దాహముచేత గదా మేనల్లుని చంపినది, ఈ యొప్పందమున కిష్టపడిన, స్థితిగతు లెట్లు మాఱెడివో గాని, తిమ్మరా జందు కంగీకరింపక, రామరాజున కీ రీతిగా జవా బంపినాడు.

"కర్ణాట మహాసామ్రాజ్యము, తుళువ వంశమువారి సొత్తేమియు కాదు. అది మొదటినుండియు బలవంతుల చేతనే పాలింపబడుచున్నది. మీ మామగారు కృష్ణరాయలు పాటించిన ధర్మమేమి? వీరనరసింహరాయలపుత్రుడుండగా, తా నేల సామ్రాజ్యమునకు పట్టము గట్టుకొనినాడు? తన పిన్నటనైనను, అతి దేగదా యర్హుడు. అతని, సదాశివ రాయలను గూడ వదలి, మా బావగారికి రాజ్యము నొసంగుటలో ఆయన యభిప్రాయమేమి? మా బావగారు సమర్థుడును, యోగ్యుడు ననియే గదా! అట్టి పిదప,

అయన బావమఱదిని-అన్నియోగ్యతలు గలవాడను నేనే రాజ్యార్హుడను। ధర్మాధర్మముల కెప్పుడును తావు లేదు. రాజ్యము వీరభోజ్యము. సదాశివరాయల కంతటి బలమే యున్నచో, మమ్ము గెలిచి, మాయధీనమున నున్న రాజ్యమున కాధిపత్యము వహింపవచ్చునుగాని "నేను హక్కు-దారుడ"నని యాచించుట వీరలక్షణముకాదు. ఇంతకన్నను ఎక్కువగా నేను మీకు సమాధానమీయవలసిన యవసరము లేదు."

తిమ్మరా జిచ్చిన తలబిఱుసుతోడి సమాధానము, రామరాజున కాగ్రహ మొదవించినది. అతడు, కార్యఖడ్గములకు జాలినవాడు గదా, దండోపాయమును ప్రయోగించుటకే, ఆ వీరుడు నిశ్చయించినాడు. యుద్ధము ప్రకటింపబడినది. పెదతిరుమలరాజు సాత్త్వికస్వభావుడు. మొదటినుండియు తమ్ముని దుండగముల కాతడు వ్యతిరేకియే. దానికితోడు మేనల్లుని చంపిన బంధుద్రోహి యని గూడ అతడు చినతిరుమలయ్య నేవగించుకొనినాడు. అక్కగారి యేకైకపుత్ర మరణము పెదతిరుమల రాయల హృదయము నెరియించినది. అతడు వరదాదేవి నోదార్చు చున్నాడు. ఆమె కెట్లోదార్పు కలుగును ? దేనిని పూలమాల యని మెడను దాల్చినదో, అదే కాలసర్పమై కాటు వేసినది. ఆమె పెదతిరుమలునికి దుష్టుడైన తమ్ముని పక్షము వీడి, రామరాజు నాశ్రయించి బ్రతుకవలసిన దని హితము చెప్పినది. ఆతని కామె సదుపదేశము నచ్చినది. అతడు రామరాజు పక్షమునే ఆశ్రయించినాడు. చినతిరుమలుని కిప్పుడు, అన్న గారు సహితము దూరమై పోవు దుస్థితి దాపురించినది. అపమార్గమున నడచు రావణుని విభీషణుడు పరిత్యజింపలేదా ! ధర్మములో నున్న రహస్య మట్టిది!

యుద్ధ మారంభ మగుచున్న దనగా, నాగిని మోహనాంగి నిట్లు వేడుకొనినది.

"అమ్మా! ప్రభువులు తిమ్మరాజుపై యుద్ధము ప్రకటించినారు. నేను వారికి బాసటగా పోవ నెంచుచున్నాను. నా కనుజ్ఞ దయచేయుము."

ఈ మాటలకు మోహనాంగికి నవ్వు వచ్చినది. ఆశ్చర్యమును కలిగినది. ఆమె పరిహాసముగా నిట్లన్నది.

"ప్రభువులకు నీ బాసట యేమిటే? వారికి నీ వెట్లు సాయ మొనర్తువు?"

"నేను శ్రీవారికి, అంగరక్షకురాలుగా పని చేయుదు నమ్మా!"

"అంగరక్షకురాలవా? అందుకు యుద్ధవిద్య తెలిసియుండవలయును గదా! నీవు సమరప్రకారములనుగూడ నెఱుంగుదువా?"

"ఔనమ్మా! నేను ప్రతిదినము సాయంకాలము అంతఃపురము నుండి వెడలి, సైనిక శిక్షణశాల కేగుదానను. అచ్చట కొన్నిమాసములు సమరశిక్షణ మందినాను."

"ఎంత సాహసము చేసినావే! మఱి, ఆడుదానికి వారెట్లు యుద్ధ విద్య నేర్పినారు!"

"నేను అంతఃపురమున నున్నప్పుడును, గురువుల వద్ద యోగ విద్య నేర్చునప్పుడు మాత్రమే ఆడుదానను. తక్కిన సమయములందు పురుషుడనే నమ్మా! ఆ పురుష వేషముతోనే రామరాయలవారి యాదరమును పొంది, వారి కంగరక్షకురాలనైతిని. వారివద్ద నాపేరు రుద్రవర్మ. వారికి నా స్వామిని పై అనురాగ మంకురింపజేసి, పెండ్లాడునట్లు చేసిన దీ సేవకురాలే"

"యుద్ధవిద్య నేర్చి మీ తండ్రి యభిప్రాయమును సార్థకపఱచినా వన్నమాట!"

"అది సరియే కాని, కడుపు తరుగుకొని పోవు నింకొక పరమ రహస్యమును గూడ, నీకు విన్నవించుచున్నా నమ్మా! నేను ప్రతిదినమును మునిమాపు వేళల తుంగభద్రాతీరమున నున్న యొక క్రొమ్మావి చెట్టుక్రింద యోగసమాధి నభ్యసించు చుండెడిదానను. వేంకటాద్రిరాయల వారు మరణించినప్పుడు, నే ననుష్ఠానములో నుంటిని. ఆనాడు నా కెక్కువసేపు సమాధి కుదిరినది. ఇంతలో తుంగభద్రానదిలో నెవరో దూకినట్లు పెద్ద చప్పు డైనది. అది నా సమాధికి భంగము కల్గించినది. నేను కన్నులు తెఱచి, లేచి, పది బారలు ముందుకు వచ్చి చూచితిని. సలకముతిమ్మ డొంటరిగా గుఱ్ఱము నెక్కి పోవుచున్నాడు. ఆ మఱునాడు వేంకటాద్రిరాయల మరణవార్త విని ఈ కీడు చేసినది తిరుమలుదేమో యనుకొంటిని. సత్య మా దేవునకే ఎఱుక! ఈ మాటలు వినునప్పటికి మోహనాంగికి శోకము ముంచుకొని వచ్చినది. ఆమెకు రామరాజు "తిమ్మరాజే మేనల్లున చంపి నట్టేట బాఱవైచినాడని తనకు భట్టుమూర్తి తెలిపినాడని" చెప్పియున్నాడు. దానికిని, ఇప్పుడు నాగిని చెప్పినదానికిని సరి దాకినది. అంత మోహనాంగి యిట్లనినది.

"ఓసి నాగినీ! నీ వెంత దానవే! మాకేదో సాకు చెప్పిపోయి సాయంవేళల యుద్ధవిద్యను, యోగవిద్యను నేర్చినావు! ప్రభువులవద్ద అంగరక్షకోద్యోగమును సంపాదించినావు. నేను నేర్చిన సర్వవిద్యలలో తోడ్పడినావు! నారోగమునకు చికిత్స చేసినావు! ఇప్పుడు, నా పతిదేవులకు బాసటగా యుద్ధమున కేగుదు ననుచున్నావు! నీ ఋణమును నే నెట్లు తీర్చుకొందునే! నీకు తుంగభద్రాతీరమున, ముందుగనే తిమ్మరాజును

వేంకటాద్రియు నగపడినచో, ఏదోయొక ఉపాయముతో తమ్మునికి కీడు వాటిల్లకుండ చేసెడిదానవే! విధి విధాన మట్లుండ ముందే నీకు వారేల కనబడుదురు?" అని యామె కన్నుల నీరు నింపుకొన్నది. కడకు నాగిని "నాకును, నా ప్రభువులకును గెలుపు గలుగ దీవింపుమమ్మా!" యని మోహనాంగి పాదములపై వ్రాలినది. మోహనాంగి సంతోషము వెల్లి విరియ నాగినిని లేవనెత్తి "విజయోఽస్తు" అని దీవించి పంపినది.

ం ం ం

యుద్ధమునకు సిద్ధమైనాడేకాని, తిరుమలరాజునకు అళియరామరాజు నెదుర్కొని తన దుర్గములను కాపాడుకొనుట కష్టమని తోచినది. అతడొక కూటోపాయము నాలోచించినాడు. కృష్ణరాయల నాటినుండియు-బహ్మనీ సుల్తానులకును, రాయలకును యుద్ధములు కొనసాగుచునేయున్నవి. వారవకాశము చిక్కినచో, కర్ణాట సామ్రాజ్యమును కబళించుట కెదురు వేచియున్నారు. తిమ్మరాజు మనసున కిప్పుడు వారు పొడగట్టినారు. ఈ సమయమున, సుల్తానుల అండ సంపాదించుకొన్నచో, రామరాజును గెలుచుట కష్టము కాదని అతనికి తోచినది. ఇది దేశద్రోహ మనికూడ తిమ్మభూపతికి తట్టలేదు. అతడు బిజాపురసుల్తానైన ఇబ్రహీంఆదిల్షాహున కిట్లు లేఖ వ్రాసినాడు.

"నాకును అళియరామరాజునకును యుద్ధము సంభవించినది. ఈ సమయమున మీ సాయము నాకు కావలసియున్నది. మన మిరువుర మేకమైనచో, మనకు గెలుపు తప్పదు. మనము గెలుచుకొన్న రాజ్యభాగములను చెరి సగము పంచుకొందము. అప్పుడు నా రాజ్యమును, నీ రాజ్యమును విస్తృతి నందగలవు. మనము రామరాజు

నడంచి, యైకమత్యముతో మెలగవచ్చును. నాకు వెంటనే
సమాధాన మంపుచు, మీరు రాణువతో కదలి రావలసినది."

ఈ లేఖ అదిల్షాహునకు ఆశ గొల్పినది. అత డందు కంగీకార మంపి సైన్యముతో విజయనగరముపై దాడి వెడలినాడు. కొంతదూరము వచ్చునప్పటికి, తిమ్మరాజు మేనల్లుని చంపుట సామంతులను, సర్దారులను హింసించుట, రాజ్యమున చండశాసనుడై ప్రవర్తించుట మున్నగుసంగతు లాతనికి తెలిసినవి. ఇట్టి విశ్వాసఘాతుకునితో, ద్రోహితో నెయ్యమెప్పటి కైనను ముప్పు తెచ్చునని యూహించి, యాతడు సైన్యముతో వెనుకకు మఱలిపోయినాడు. పాపము! తిరుమలయ్య యెత్తులుసాగి నన్నినాళ్ళు సాగినవి. ఆతడంతటితో తృప్తిపడినచో నెట్లుండెడిదో; దురాశ పైకొనగా దుష్కృత్యములకు దిగినాడు. ఇప్పు డాతని స్థితిగతులన్నియు నెదురు తిరుగుచున్నవి.

"అధర్మైణైధతే తావత్ తతో భద్రాణి పశ్యతి,
తత స్సపత్నాన్ జయతి సమూలం చ వినశ్యతి".

అధర్మము తొలుదొలుత నరున కభివృద్ధిని గూర్చి, భద్రముల నొసంగును. పిమ్మట శత్రువిజయమునుగూడ గలిగించి, తుదికి సమూల నాశనమునకు దారితీయును. ఇందు తొలి మూడుదశలును తిమ్మరాజు పొందియే యున్నాడు.

* * *

రామరాజ తిరుమలరాజుల సైన్యములకు పెక్కు దుర్గప్రదేశము లందు పోరాటములు ఘోరముగా జరిగినవి. రామరాజు సోదరులు — గండికోటను కోనరాజును, గుత్తిదుర్గమును తిమ్మరాజును, కందనవోలును

వేంకటరాజును ఆక్రమించుకొనినారు. ఇప్పుడు చినతిమ్మరాజు నాట కట్టినది. యుద్ధములో చాల సైన్యము మడిసినది. చేతిలో నున్న ప్రబల దుర్గములన్నియు జాఱిపోయినవి. అయినను, అతడు నిరుత్సాహపడలేదు. రామరాజు నధీనమున నున్న కొన్ని క్షుద్రదుర్గముల సైనను ఆక్రమింప దలచి, హతశేష సైన్యముతో-కోమలి, బేతంచర్ల, జూటూరు, పెదకల్లు, ఆదవాని మున్నగు ప్రదేశములందు తలపడి పోరాట మొనర్చినాడు. ప్రతి చోటను వానికి పరాజయమే యెదురైనది. అయినను, అతడు డిల్లపడ లేదు. ధైర్యముతో సైన్యములను కూర్చుకొని, ఈతూరి విజయనగరము మీదనే దెబ్బతీయవలయునని, తుంగభద్రాతీరమున శిబిరము నేర్పాటు చేసికొనినాడు.

ఆ నదియొడ్డున ఉభయసైన్యములకు ఏడు దివసములు భయంకర యుద్ధము జరిగినది. అంగరక్షకురాలుగానున్న నాగిని, రామరాజును వేయి కన్నులతో కనుపెట్టి కాపాడుచుండెను. ఉభయ సైన్యములు నేటితో విజయమో, వీరస్వర్గమో తేలవలయునని తలపడి పోరుచున్నవి. చినతిరుమలుడు సామాన్యుడు కాడు. అచ్యుతదేవరాయలు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో, చెల్లప్ప దక్షిణదేశమునకేగి తిరుగుబాటుల చెలరేపగా తాను పోయి ఆ యల్లరుల నణచిన మహావీరుడు. రామరాజును కేమాత్ర మును తీసిపోని ప్రతిజోదు. ఇట్టి మహావీరులిరువురికిని వాలుగుగడియలు తీవ్రముగా ఖడ్గయుద్ధము జరిగినది. నాగిని తనప్రభుని తలపూవాడకుండ కాపాడుచున్నది. తిరుమలునికి "ఈ యంగరక్షకుడెంతటి తెలివిగలవాడా!" యని యాశ్చర్యము కలుగుచున్నది. తాను ప్రయోగించు కత్తిదెబ్బ యొక్కటియు రామరాజునకు తగులనీయక, అంగరక్షకు డడ్డుకొనుచున్నా డని తిరుమలుని రోష మినుమడించినది. అతడు చిత్రభంగులతో ఖడ్గ మును త్రిప్పుచు రామరాజుపై విసరినాడు. రామరాజా దెబ్బను తప్పించు

కొని తిరుమలుని శిరస్సుపై గాటముగా నాటుకొనునట్లు కత్తి విసరినాడు. అత డా దెబ్బతో సొమ్మసిల్లి "అమ్మా" యనుచు నేలపై కొరగి తన్ను కొనుచున్నాడు. తిమ్మరాజు చచ్చెనని రామరాజు తలంచినాడు.

తిమ్మరాజు పడుటతోడనే అతనిసైన్యము రామరాజుపై కవిసినది. రామరాజు వారి నెదుర్కొని పోరాడుచున్నాడు. ఈ లోపల తిమ్మరాజు తేరుకొని, పునర్యుద్ధమునకై యెట్లెట్లో లేవ ప్రయత్నించుచున్నాడు. నాగిని ఆ యదను కనిపెట్టి, ఇక ఆలసించుట తగదని లంఘించి తిరుమలుని గుండెపై కెక్కి కూర్చున్నది. కొనయూపిరితోనుండి, అతడు చేయుచున్న ప్రయత్నము వ్యర్థమైనది. నాగిని రుద్రాంబయై వానితో నిట్లన్నది—

"పలకము చినతిరుమలరాజా! నే నెవరి ననుకొంటివి! అలనాడు ఔకు గ్రామములో నన్ను నీవు చెఱుప బూనినప్పుడు "నేను నీ పాలిట రుద్రాంబ నగుదును రా!" అన్న బసివిని. అంతియే కాదు, హజార రామాలయము ముందు "నిన్ను సాధించి తీరెద" నని నీవన్నప్పుడు - నీ ప్రాణవాయువులను పీల్చి ఆడుత్రాచును కాగలనన్న నాగినిని, తెలిసినదా! ఇదిగో! నా ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుచున్నాను. ఇది, రాకుమారుడైన తిరుమలరాయలను విషప్రయోగముచేసి చంపినందులకు శిక్ష" అని కత్తితో వాని తొమ్ముపై నొక్కపోటు పొడిచినది. "మేనల్లుడవి యైన నెంచక వేంకటపతి దేవరాయలను ఈ ప్రదేశముననే చంపినాడవుకదా! ఆ పాప మున కిదిగో ప్రాయశ్చిత్త"మని ఇంకొక పోటు పొడిచినది. ఆ రెండు పోటులతో అతని కొనయూపిరి గూడ మింటి కెగిరిపోయినది.

ఇది యంతయు రామరాజు గమనింపనేలేదు. తిమ్మరాజు మృతికి వెఱగంది కొందఱు భటులు పాఱిపోజొచ్చినారు. కొందఱు

రామరాజు నెదిరింపగా, అతడువారిని చంపుచున్నాడుగదా! తుదకుయుద్ధము ముగించి నాగినీ రామరాజులిరువురును విజయగర్వముతో ప్రాసాదమునకు విచ్చేసినారు. మోహనాంగి వారికి వీరగంధ మలది, వీరమాల్యములు గై సేసి, విజయమంగళ గీతికలతో నీరాజన మిచ్చి యభినందించినది. రామరాజు, తనయంగరక్షకుడైన రుద్రవ్వనేర్పరితనమును మోహనాంగికి వివరించుచుండ, ఆమె నవ్వుచు "నాగినీ! ఇకనైనను నీ పిచ్చివేషములను గట్టిపెట్టవే!" యనినది. నాగిని పెదవులలోనే నవ్వుకొనుచు, లోనికేగి స్త్రీ వేషముతో వచ్చి నిలిచినది. ఆమెనుగాంచి విస్మితుడగుచున్న భర్తకు మోహనాంగి, నాగిని కథ తెలియఁగించినది.

## 21

సలకము చినతిరుమలరాజు మరణముతో దేశము నిష్కంటకమైనది. ప్రజల యానందోత్సాహములకు మితి లేదు. ఈ శుభ సమయమున విజయోత్సవసూచకముగా మహా వైభవముతో భువనవిజయ సభ నేర్పాటుచేసినారు. చక్రవర్తి సదాశివదేవరాయలైనను సింహాసనమును రామరాజు పైత మధిష్ఠింపవలెనే యుండును. అది సదాశివరాయల యౌదార్యమునకు చిహ్నము. నేటిసభ చినతిరుమలుని గెలిచినందుకు విజయమంగళ సూచకముగా జరుగుచున్నందున, రామరాయలే సింహాసనము నధిష్ఠింప వలయునని సదాశివరాయల యభిమతము. స్వర్ణసింహాసనమును రామరాజధిష్ఠించినాడు. ఆయన ప్రక్కనే పట్టమహిషి మోహనాంగి మణిమయాసనము నలంకరించి యున్నది. ఆమె ప్రక్కన నాగిని కూర్చున్నది. వేంకటరాయభూషణ బిరుదాంకితుడైన ప్రబంధాంకము సూరపరాజు, ఆయన కుమారుడు భట్టుమూర్తి, రామయామాత్యుడు, మరి కొందరు తమిళ కన్నడ కవులు ఉచితాసనముల నలంకరించి యున్నారు.

పురుషోత్తమస్థపతి ఒక సమున్నత ప్రత్యేకాసనమును అలంకరించి యున్నాడు. వందిమాగధులు....

"శ్రీమన్మహా రాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరియ విభాడ భాషగె తప్పువరాయర గండ, యవనరాజ్య స్థాపనాచార్య, విద్యానగర వజ్రసింహాసనాధీశ్వర, వీరప్రతాప, ఆరవీటి రామరాజ సార్వభౌములకు జయము, జయము!"

అని కైవారములు చేసినారు. తరువాత యుగాది వేదములలోని మంత్రములు చదువబడినవి. మంగళతూర్యములు ధ్వనించినవి. అంతట రామరాజు "భట్టుమూర్తి కవీంద్రులు తమ కవితామృతమును వర్షించి, శ్రోతల నానందింప జేయ గోరుచున్నాము". అనినాడు. భట్టుమూర్తి సంగీతసుధలు జాలువాఱ నిట్లు చదివినాడు....

"పట్టాభిషేక విపర్యయంబునఁ బ్రోలు
వెడలి ప్రియానుజుల్ వెంట రాఁగఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండ, సాం
ద్ర హరి ద్విపేంద్ర నాదవనిఁజేరి,
ఖల జనస్థానవాసులఁ బల్వుర వధించి
మహి మసలక ఖర స్మయ మడంచి,
హరివీర భట మహోద్ధతి నబ్ధి గంపింప
దురమునఁ గదిసి తద్ద్రోహి దునిమి,

అనఘతర పార్థివేందిర నధిగమించి,
సాధు కర్ణాట విభవ సంస్థాపనంబు
పూని శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజచరితంబు రామాయణముగ!"

భట్టుమూర్తి యీపద్యమున శ్రీరామచంద్రునికిని, రామరాజునకును పోలిక పెట్టి, ద్రోహి యైన సలకము తిమ్మరాజును రావణునిగా పోల్చి తద్విజయముచే, తనచరిత్రమును రామాయణము చేసికొన్నట్లు వర్ణించినాడని సభ్యులు గ్రహించినారు. వారు తమ యానందమును కరతాళ ధ్వనులచే సూచించిరి. తరువాత రామరాయలు "వేంకటరాయభూషణులు మారీచీపరిణయ కావ్యమును ఆవిష్కరింప గోరుచున్నా" మనెను. నాగిని ఒక బంగారు పళ్ళెరమున, తాళపత్ర లిఖితమైన మారీచీపరిణయ కావ్యము నుంచి, సూరపరాజుచేతి కిచ్చినది. అంతట ఆయన ఇట్లుపన్యసించినాడు.

"సాహితీ సమరాంగణ సార్వభౌములైన శ్రీకృష్ణదేవరాయలవారి పుత్రికారత్నము తిరుమలాంబా మహాదేవిగారు అపరసరస్వతులు! సంగీత సాహిత్య కవిత్వ చిత్రలేఖనములయందలి యామె ప్రజ్ఞ అసామాన్యము. ఆమెకు దగిన పతిదేవులే రామరాట్ప్రభువులు. మహారాజ్ఞీమణిగారి మారీచీ పరిణయకావ్య మొక రసపేటి. ఇది అత్యాశ్వాసముల కావ్యము. ఇందలి కథ రామాయణమే. లక్ష్మణునికి మారీచి యను కన్యను పరిణయము చేయుట ఈ మహాకవయిత్రి చేసిన నవ్య కల్పనము. ఈ కల్పనములో కవయిత్రి చూపిన ప్రతిభ అద్వితీయము. తిరుమలాంబాదేవి అలనాటి గంగాదేవికి సాటియైన కవయిత్రి, యని ఈ కావ్యములోని ప్రతి పద్యమును చెప్పుచున్నది. కవయిత్రి, తన గురువర్యులగు అల్లసాని పెద్దనార్యు నెట్లు స్తుతించినదో సభ్యులు చిత్తగింతురుగాక....

"పెద్దన విద్దెలందుఁ గడుఁ బేర్వడ, నీయన వేల్పుటొజ్జ పెం
పెద్దనఁ, దక్కినట్టి కవి యెట్టిఁడు సీతవిశోడఁ బోల్పగా
ప్పెద్దనఁ దెల్గుకైత కిజుదే యగు నా యలసాని వంశపుం
బెద్దన మద్గురూత్తమునిఁ బెద్దయు గౌరవబుద్ధిఁ గొల్చెదన్".

ఈ సాధ్వీరత్నము నారీలోకమున కొజ్జబంతి. తన భర్తృదేవు నెట్లు స్తుతించి వనితాలోకమున కాదర్శప్రాయురాలై నదో అవధరింపుడు....

"జిగి బిగి ప్రాయంపు వగలాండ్రు పొగడు సో
యగమందుఁ దొగతేవి యల్లుఁడగుచు,
జోగులన్ భోగులఁ గాఁగఁ జేయఁ గల ద
యా గుణంబున వార్ధి యల్లుఁడగుచు,
విశ్వ విశ్వంభరా ధీశ్వరులున్ మెచ్చు
నైశ్వర్యమునఁ గొండ యల్లుఁడగుచు,
కవిసి ఖానుల తవతవ లాడఁజేయు నా
హవకేళి వసుదేవు నల్లుఁడగుచు,

కృష్ణరాయ వసుంధరాధీశు నల్లుఁ
డౌట, నల్లురయం దల్లుఁ డగుచు నళియ
బిరుదు నరుదుగాఁ గొన్నట్టి బిరుదుమగని
మగని మదిలోన నిల్పి నమస్కరింతు."

ఈ పద్యమున, రామరాజు చక్కదనములో మన్మథు డనియు, దయాగుణమున శ్రీమహావిష్ణువనియు, ఐశ్వర్యమున పరమేశ్వరుడనియు, యుద్ధమున అర్జునుడనియు వర్ణించిన రీతి అతిశయోక్తిగాక సత్యమేయని సభ్యులనుకొనినారు.

"తిరుమలాంబామహాదేవి, ఈ కావ్యమును తన తండ్రిగారి కంకితము చేసి, పితౄణమునుండి విముక్తురాలైనది. ఆ మహనీయుని ఈమె వర్ణించిన తీరు అనన్య సాధారణము. రాయలవారిని వర్ణించు పట్టున,

వారిచే చంపబడిన తురుష్కులు వీరస్వర్గమున కేగినప్పుడు, మేనకాదులు తమ వేషములను మార్చుకొన్న రీతి నెంత చమత్కారముగా వర్ణించెనో చూడుడు.

"ఊర్వశి నెమ్మేని హొయలు చూపుట మాని
బురఖాను ధరియించి తిరుగ సాగె,
మేనక చీరలు మాని యిజారులుఁ
గుడితిసీలున్ వేసికొనఁగ సాగె,
అవికల విడనాడి రంభ జుబ్బాలు, క
బ్బాలు బిబ్బీలట్లు వాడ సాగె,
లోచనంబులకు తిలోత్తమ కాటుక
మాని సుర్మా విత్య మూన సాగె,

కృష్ణరాయ కరాసిచేఁ ఢిల్లి, గోల
కొండ, బీజపురంబులనుండి స్వర్గ
పట్టణంబున కరుదెంచినట్టి దొడ్డ
ఖాను బిడ్డల కుంపుడుకత్తె లగుచు."

ఈ పద్యమును విన్న సభ్యుల మోములు నవ్వులతో నిండిపోయినవి.

"మారీచీపరిణయ కావ్యము పెద్దనగారి మనుచరిత్రమునకును, తిమ్మనగారి పారిజాతాపహరణమునకును, ధూర్జటిగారి కాళహస్తీశ్వర మాహాత్మ్యమునకును, రుద్రయ్యగారి నిరంకుశోపాఖ్యానమునకును దీటైన దని భావించుచున్నాను. ఇట్టి మహాకావ్యమును రచింపగలిగిన సుపుత్రికను గన్న కృష్ణరాయలవారు ధన్యులు. అట్టి కావ్యనిర్మాత్రి నిల్లాలిగా బడయ జాలిన రామరాయలవారు కృతార్థులు, ఇట్టి ప్రియదంపతుల యేలుబడికి

నోచుకొన్న ఆంధ్ర, తమిళ, కర్ణాట దేశముల ప్రజలు ధన్యులు. కావ్య నాయికయైన మారీచివలె వనితాలోకము భర్తృహిత పరాయణమై వర్ధిల్ల గలదని ఆశించుచు, ఈ కావ్యము నావిష్కరించుచున్నాను." అని సూరవరా జాసనమునందు కూర్చుండెను. రామరాయలు కవయిత్రి తన భార్యయైనందున, ఆమెను గూర్చిగాని, కావ్యమునుగూర్చిగాని ప్రశంసింప లేదు, తరువాత నాగిని "స్వరమేళ కళానిధిని" బంగారు పళ్ళెరమున నుంచి, రామరాయల కందించినది. అతడు "రామయామాత్యుడు సంగీత మున సాటిలేని పండితుడనియు, ఆయన శాస్త్రజ్ఞానముకూడ కలిగి యుండుట విశేషమనియు, రామయామాత్యుని ఈ "స్వరమేళ కళానిధి" యను గ్రంథము చక్కనిప్రచారము నందగలదని ఆశించుచున్నామని"యు పలికి దాని నావిష్కరించి, మఱల నిట్లనెను.

"వేంకటరాయభూషణ సుపుత్రుడు భట్టుమూర్తి మహాకవీశ్వరుడు. ఈయన వయసున చిన్నయైనను, పాండిత్య కవిత్వములందు పెద్దయే! విశేషించి సరస సంగీత చాతురి ఈయనను వరించినది. ఈయనను "సంగీత కళారహస్యనిధి"గా మేముగుర్తించుచున్నాము, ఈయన మమ్ము వర్ణించుచు చదివిన పద్యమును సభ్యులు వినియే యున్నారు గదా! శ్లేష నెంత చమత్కారముగను, సులభముగను భట్టుమూర్తి నిర్వహింప గలడో ఆ పద్యము వ్యక్తీకరించుచున్నది. ఈతడు ముమ్ముందు మహా కావ్యములు వ్రాసి గణుతికెక్క గలడని మా యాశయము. ఈ కవి చంద్రుని మా సభకు భూషణముగానెంచి "రామరాజ భూషణ" బిరుదము నిచ్చి గౌరవించుచున్నాము. అంతియేగాదు. భట్టుమూర్తి కవీంద్రుడు తనకు కావలసిన హయ వేదండాదులను గూడ స్వేచ్ఛగా మానుండి పొందవచ్చును.

ఈ మాట లనుచుండగనే సభ్యులు తమ హర్షమును వ్యక్తము చేసిరి. నాగిని, బిరుదనామమును చెక్కిన బంగరుపతకమును, ఒక రత్న హారమును, కర్పూరతాంబూలమును పసిడి పళ్ళెరమునందుంచుకొని, దానిని భట్టుమూర్తికి సమర్పించినది. ఇంతలో భటు డొకడు, శ్రీముఖము నొకదానిని తెచ్చి ప్రభువుల కిచ్చినాడు. అది అహోబిల మఠమునుండి రామరాయల వైష్ణవగురువులు తాతాచార్యులవా రంపిన శ్రీముఖము. అందిట్లున్నది.

"వజ్రసింహాసనాధీశ్వరులైన అళియరామరాయలవారి నాశీర్వదించి గురువు లంపు సందేశము. మేము కారణాంతరములచే విజయమంగ ళోత్సవమునకు రాలేక పోవుచున్నాము. మేము లేని కొఱతను, సర్వ మంత్ర యంత్ర దేవతాస్వరూపులును, యోగీశ్వరులునగు బ్రహ్మశ్రీ పురుషోత్తమ స్థపతులు దీర్చగలరని విశ్వసించుచున్నాము. సమస్త సన్మంగళాని భవంతు."

రామరాయ లా లేఖను కమల కద్దుకొని మోహనాంగి కిచ్చినాడు. మోహనాంగి సింహాసనమునుండి లేచి—

"మా సర్వాభ్యుదయములకు కారణమైన మహేంద్రనీలాలంకృత తారహారమును ప్రసాదించి, మా కీ యభ్యుదయమును గూర్చిన స్థపతి వర్యుల ఆమోఘాశీస్సులను సభక్తికముగా అర్థించుచున్నా" మనెను. ఈ మాటలు వినుటతోడనే నాగిని మోము విప్పారినది. పురుషోత్తమస్థపతి ఇట్లనినాడు.

"మే మానాడే మీ సర్వాభ్యుదయములను కోరి దీవించినాము తల్లీ! అయినను ఇట్లగుగాక !"

"భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః ।
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః ।
స్థిరై రంగైస్తుష్టువాంస స్తనూభిః ।
వ్యశేమ దేవహితం యుదాయుః ।"

"మన చెవులతో శుభమును విందుము గాక। కన్నులతో మంచిని చూతుము గాక. దృఢతరావయవములు గల శరీరములతో బ్రతికినంత కాలము విశ్వహితమునకై పాటుపడుదుము గాక." అని పురుషోత్తమ స్థపతి చేసిన వైదికాశీస్సున కంతరార్థము. ఈ విశ్వమంగళాకాంక్షకు సభయెల్ల ఆనంద తన్మయమై పులకించినది. నాటి భువనవిజయసభ భవిష్య ద్రామరాజ భువనవిజయ సూచకమైనది.

కడకు రామరాయలు "ఇక మీదట సామ్రాజ్యమున ఏ కుటుంబమున గాని, తల్లిదండ్రులైనవారు తమ యాడుపడుచులను బసివి రాండ్రనుగా విడువరాదనియు, అట్లు చేసినవారు కఠిన దండనము పొలగుదురనియు, ఇది ప్రభుత్వాజ్ఞయనియు ప్రకటించెను. ఈ ప్రకటనకు నాగిని పొందిన సంతసమునకు హద్దు లేదు. ఆమె హర్షపూర్ణములైన తన కన్నులవెన్నెలతో రామప్రభు నభిషేకించినది. ఆ మఱునాటినుండియే ఈ రాజశాసనము సామ్రాజ్యమునందలి పల్లీ పత్తనములలో చాటింప బడుటకు తగిన యేర్పాట్లు చేయబడినవి.

అంతట "అయ్యనమల్కు" అను సేనాధిపతి యొకడు లేచి "ప్రభువులు దివ్యచిత్తముతో నవధరింపవలయును. తమ రాజ్యములో తమకు లోబడి యుండువారే మతము వారైనను సుఖజీవనము చేయు చున్నారు. ప్రభువులకు దండయాత్రలలో సాయపడిన సైనికు లేమి, వారి బంధుమిత్రులేమి మహమ్మదీయులలో అధిక సంఖ్యాకులున్నారు.

వారికి నమాజు చేసికొనుటకు మసీదులు లేవు. ప్రభువులా కొఱత దీర్ప ప్రార్థించుచున్నా"ననెను. అందుకు వలసిన యేర్పాటులు చేయవలసినదని రామరాజు కోశాధిపతి కాజ్ఞ యిచ్చెను.

కొంతకాలమునకు శ్రీకృష్ణానుగ్రహమున మోహనాంగి కిరువురు కుమారు లుదయించినారు. పెద్దవానిని తండ్రిపేర కృష్ణరాజనియు, చిన్న వానిని తమ్ముని పేర తిమ్మరాజనియు నామె పిలుచుకొని ముద్దుచేయు చున్నది.

## 22

రామరాజు రాజ్యమునకు వచ్చినపిమ్మట, సామ్రాజ్యమున పెక్కు సంస్కరణములు జరిగినవి. ఎవ్వరుగాని విద్యావిహీనులు, ఉద్యోగ రహితులు గారాదని అతని తలంపు. ఏ జాతివారైనను, చదువు సంధ్యలు లేక మన రాదు. బాలికలుగూడ చదువను వ్రాయను నేర్చి యుండవలసినదే. ఒక మహాకవయిత్రిని భార్యగా జేసికొని, విద్యవలన గలిగిన ఫలితముల ననుభవించినవాడు రాజైనచో, తన రాజ్యమున స్త్రీలు విద్యావతులు కావలయునని తలంచుటలో అబ్బుర మేమి! విద్యావతియైన నాగిని జీవితమునుబట్టిగూడ, అతడు స్త్రీలు విద్యావతులైన దేశమునకు క్షేమమని గ్రహించి విద్యాభివృద్ధికి పాటుల జేసినారు. రామరాజు క్రమముగా దుర్గాధిపతులను, పాళెయగాండ్రను, రాజోద్యోగులను గూడ తన సంస్కారములకనుకూలురైన వారినే నియమింప జొచ్చెను. వీరిలో క్షత్రియులు, వెలమలు, కమ్మలు, కాపులు ఎక్కువగా నున్నారు. ఆయుధోపజీవులైన పెమ్మసాని, కటికము, వెలుగోటి, రావెల, సాకు మొదలగు ఇంటిపేర్లవారు రాజ్యమున నున్నతోద్యోగములను పొందగల్గిరి.

సలకము పెద తిరుమలరాజునకుగూడ, అతని సౌజన్యమునుబట్టి, మన్నించి యున్నతోద్యోగము నొసంగెను. అంతియేకాదు. ప్రత్యర్థులని యైన నెంచక తన్నాశ్రయించిన మహమ్మదీయులను పెక్కురను సైన్యములో జేర్చుకొనినాడు. ఏ మహమ్మదీయులు విజయనగర సామ్రాజ్యమును నేలబెట్టి కాల రాచ బూనినారో, అట్టివారిని గూడ దరిజేర్చుట రామరాజు దొడ్డబుద్ధికి నిదర్శనము.

రామరాజు కొలువులో- ఔకు చినతిమ్మన, విఠలరాజు, జగదేవ రాయలు, అయ్యనమల్కు, కెళది సదాశివనాయకుడు - అనువారలు బలవంతులేగాక నేర్పరులైన సేనాపతులు. సదాశివనాయకుడు కర్ణాటకుడు. నాడు తమిళ కేరళ కర్ణాట ప్రాంతములు తిరుగుబాటుచేయ బూనుకొన్నవి. ఇందుకు కారణము నిన్న మొన్నటి వఱకును విజయనగర సామ్రాజ్యమున చెలరేగుచున్న అంతఃకలహములే. రామరాజు రాజబంధువులైన ఔకు చినతిమ్మనను, విఠలరాజును – దక్షిణదేశపు సామంతులను లోబఱచుకొని అచ్చట శాంతిని సంస్థాపింప నియోగించినాడు. వారు దక్షిణ దిగ్విజయమున కృతార్థులై సామ్రాజ్యమును కన్యాకుమారి వఱకు వ్యాపింపజేసిరి. రామరాజందుకు సంతసించి ద్రవిడ, కేరళ రాజ్యములపై విఠలరాజును రాజప్రతినిధిగా నియమించెను.

నాడు దక్కనులో మహమ్మదీయ రాజ్యము-అహమ్మద్‌నగరము, బిజాపురము, బీదరు, గోల్కొండ అని నాల్గుభాగములుగా నున్నది. ఈ రాజ్యముల సుల్తానుల కెప్పుడును, ఒకరితో నొకరికి పోరాటములే. వారు రాజసస్వభావులును, స్వార్థపరులునై యున్నందున తండ్రిని కొడుకు, అన్నను తమ్ముడు, రాజ్యతృష్ణతో చంపుకొనుచుండువారు. అట్టితఱి, వారు పరరాజ్యముల నాక్రమింప జూచుటలో వింత యేముండును! గోల్కొండ

రాజ్యసంస్థాపకుడు కులీకుతుబ్‌శాహు. ఈ కుతుబ్‌శాహు మరణించినపిదప, అతని కొడుకు జమ్‌షీద్‌ఖాను రాజ్యాధిపతియైనాడు. ఇకడు తన తమ్ముడైన, ఇబ్రహీంఖానువలన తన కేనాటికైనను ముప్పురావచ్చునని యెంచి అతనిని మట్టుపెట్ట దలచెను. ఈ విషయమును పసికట్టిన ఇబ్రహీంఖాను రామరాజును శరణువేడెను. రామరా జాతనికి అభయ మిచ్చుటయేగాక, ఉన్నతోద్యోగమునుగూడ నొసంగి మన్నించినాడు. ఆ ప్రభుని యాశ్రిత పక్షపాతమట్టిది. కృష్ణరాయల మరణానంతరము సామ్రాజ్యదౌర్బల్యమును గనుపెట్టి సుల్తానులు విజయనగర భాగములను కొన్నింటి నాక్రమించుకొనినారు, అట్టివారిలో బీజపూర్ సుల్తానగు ఇబ్రహీం అదిల్షాహు యొకడు. రామరాజు చాణక్యనీతిని ప్రయోగించుటయందు దిట్ట. మంచి వారికి ప్రాణములనైన నిచ్చును. దుష్టులను నేల బెట్టి కాలరాచును. ఇబ్రహీం ఆదిల్షాహు నిన్న కాక మొన్ననే నలకము చినతిరుమలునితో చేయికలిపి రామరాజుపై దండెత్తబూని, ఆయెత్తు పాటిక తిరిగిపోయిన వాడే కదా! అట్టివాని పనిపట్టుటకు రామరాయలు పూనుటలో అన్యాయమే మున్నది? రామరాజు, బిజాపుర సుల్తానుడాక్రమించినతమ రాజ్యభాగములను వశము చేసికొనుటకై అహమ్మద్ నగరపాలకుడైన నిజామనమల్కుతో నెయ్యి మొనర్చెను. ఆ బహ్మనీసుల్తానుల కెప్పుడును నంతఃకలహములే గావున, నిజామనమల్కుగూడ అదిల్షాహు నణంప తరుణము దొరకినది గదా యని రామరాజునకు బాసట యాయెను. ఉభయ సైన్యములను గలసి ఆదిల్షాహు నోడించినవి. రామరాజునకు తన రాజ్యభాగములేగాక శత్రురాజ్యభాగములును చేజిక్కినవి. ఈ దెబ్బతో ఓటమి అదిల్షాహు రామరాజునకు పాదాక్రాంతుడై, ఆయన నెయ్యము నర్థించెను. శత్రువునైనను శరణన్నచో రక్షించునే గదా రామరాజు స్వభావము. ఆతడు ఇబ్రహీం ఆదిల్షాహునకు తన స్నిగ్ధహస్తము నందించెను. కల్యాణి,

కలుబరిగె (గుల్బర్గా) దుర్గములప్పటికి బీదరు రాజ్యములకుచెందియున్నవి. వానిని గూడ రామరాజు వశము చేసికొన వలసి వచ్చినది. అట్లు వశము చేసికొన్న పిదప కొంతకాలమునకే తనతో మైత్రి నెఱపుచున్న బిజాపుర సుల్తానుని ప్రార్థనముచే కల్యాణి కలుబరిగె ప్రాంతములను రామరా జతనికే యిచ్చివేసెను. రామరాజు చేయు నిట్టి పనులు రాజకీయో ద్యోగులైన కొందఱు హిందువుల కిష్టములేకున్నను, అతనిని వారేమియు ననజాలెడువారు కారు. మొత్తముమీద బహ్మనీసుల్తానులతో రామరాజున కిట్టి కయ్యములు, నెయ్యములు ఎన్ని జరిగినవో చెప్పజాలము. ఒక సారి శత్రువులైనవారే ఇంకొకసారి మిత్రులై తమవారి ననుచుటకే రామరాజు సాయమును పొందుచుండువారు. ఆశ్రిత పక్షపాతమునకు పేరందిన రామరాజు తన బాహుబలమును తురుష్కప్రభువులకు గూడ పంచి యిచ్చిన మహోదారుడు. అయినను ఇబ్రహీం ఆదిల్షాహు పుత్రు డైన అలీఆదిల్షాహు డొక్కడు తక్క తక్కిన వాఱందఱు కడకు రామరాజునకు శత్రువులే యయినారు. కల్యాణనగరమును కట్టబెట్టి నందున, నీతడు కృతజ్ఞుడై యుండక తప్పినదిగాదు.

రామరాజు యుద్ధముల కేగినను భట్టుమూర్తిని వెంటదీసికొనిపోవు చుండెడివాడే. శిబిరమున విశ్రాంతి తీసికొనినప్పుడు అయనకు కవితా కాలక్షేపము, సంగీతము కావలయును. ఆ రెంటి కుపయోగించువాడు భట్టుమూర్తియే గదా! భట్టుమూర్తి, రామరాజు కల్యాణ నగరము నాక్ర మించుకొనిన సందర్భమును మనోహరముగా వర్ణించి ప్రభువున కిట్లు వినిపించెను—

"విశ్వామిత్రువిఁ గొల్చి రాముఁడతఁ డుర్వింజెందెఁగల్యాణమున్,
విశ్వామిత్రులు గొల్వ రాముఁడితఁ డుర్వింజెందెఁ గల్యాణమున్ !

శశ్వత్కీర్తులు రాము లయ్యిరుపురున్ సాధించు కల్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబన వ్యక్తముల్."

అలనాడు విశ్వామిత్రమహర్షి వెంట నేగి శివధనుర్భంగ మొనర్చి శ్రీరాముడు సీతాకల్యాణము నందినాడు. నే డీ రాముడు, (రామరాజు) విశ్వమున కమిత్రులైనవారిని గెలిచి, వారినుండి కల్యాణనగరమును సంపాదించినా డను నర్థము కల ఈ పద్యమునకు రామరాజే గాక పీర భటులును సంతసించినారు. తురుష్కులమీద రామరాజు చేసిన దండ యాత్రలను కనులార జూచిన రామరాజభూషణుడు ఇట్టి పద్యముల నెన్నింటినో చెప్పి తన ప్రభువు నలరించుచుండెడివాడు.

# 23

ఇరువది రెండేడ్ల నుండి సుల్తానుల నెదిరించి రామరాజు పొందు చున్న విజయము లిట్లంతు లేకుండ నున్నవి. రామరాయల రాజ్యము సింహళమునుండి నర్మదానది వఱకు వ్యాపించి చూచువారి కసూయ గొలుపుచున్నది. దక్కను సుల్తానులు ఆయన యాజ్ఞలకు బద్ధులై మెలగ వలసిన దుర్గతికి లోనైనారు. వా రిప్పు డొక నీతిపాఠమును నేర్చు కొన్నారు. అంతఃకలహముల మూలముననే తాము రామరాజునకులోబడ వలసి వచ్చినదనియు, ఐకమత్యముతో నంచఱు నొక్కటైనచో, అతని పని పట్ట వచ్చుననియు వారికి తోచినది. ఈ దృష్టితోవారు రామరాయలను జయించుటకు, కుట్రలు పన్నదొడగిరి. వీరిలో ఇబ్రహీంకుతుబ్‌షాహాను, హుస్సేన్ నిజామ్‌షాహాను అగ్రేసరులు. వీరు తక్కిన నవాబులను, వజీర్లను మేలుకొల్పి, మత దురభిమానమును నూరిపోసినారు. ఆ మందు వారికి పనిచేసినది. ఈ పాదుషా లంచజీలోను ప్రబలతముగు అసూయ

బీజపుర సుల్తానైన ఆలీ అదిల్షాహా. అతని తోడ్పాటు లేనిదే తమయెత్తు సాగదని వా రెఱుంగుదురు. వారు ఆలీఆదిల్షాహా సాయము నర్థించినారు. అత డిప్పటివఱకును, రామరాజు నండచేతనే కల్యాణి, కలుబరిగె దుర్గములను పొంది ఆతనితో బద్ధస్నేహుడై యుండుటచేత, వారితో చేయి కలుప నంగీకరింప డయ్యెను. అయినను, వా రిరుపురును ఆలీఆదిల్షాహానకు గూడ ఎన్నో దుర్బోధలు చేసి మతద్వేషమును నూరి పోసినారు. ఆదిల్షాహా అంగీకారము నీయకమాత్రము తప్పలేదు.

అది 1565వ సంవత్సరము. ఈ తూరి యుద్ధము 'రక్షసి-తంగడి' అను గ్రామముల నడుమ జరిగినది. దీనిని తళ్ళికోట యుద్ధ మనియు నందురు. దక్కన్ సుల్తాను లందఱు నేకమై, సైన్యములతో సిద్ధపడినారు. రామరాయల సోదరులును, అయ్యనమల్కు-మున్నగు మహమ్మదీయులును విజయనగర పక్షమున తలపడిరి. నాగిని రామరాయల కంగరక్షకురాలై వేయికన్నులతో ఆయనను కనిపెట్టుకొనిచూచుచున్నది: అవృద్ధ సింహము, మహమ్మదీయులతో నెలదినములు పోరు ఘోరముగా సాగించెను. రామరాజు తమ్ములు వేంకటాద్రియు, తిరుమలరాయలను, పుత్రులైన కృష్ణరాజ-తిమ్మరాజులును, తిరుమలరాయల కొడుకైన రఘునాథరాజును మహాపరాక్రమము చూపిరి. హిందూసైన్యముల బలమునకు మహమ్మదీయవాహిని తట్టుకొనలేక పోయినది. ఆలీఆదిల్షాహా నవాబులకు మాట యిచ్చినాడేగాని, రామరాజునకు ద్రోహము చేసినట్లగునని యుద్ధమున మధ్యస్థుడుగానే యుండెను. కుతుబ్‌శాహా-నిజామ్‌శాహాలు, పరాజయము నందక తప్పలేదు. వారు తమ యోటమి నొప్పుకొని, సంధిచేసి కొందమని రామరాయలకు రాయబార మంపినారు. అత డిది నిజమే యనుకొని సైన్యమును సమరసన్నాహమునుండి విరమింపజేసెను. కాని నాగిని కిందేదో మోస మున్నట్లు తోచినది. ఆమె రాయలతో—

"ఇది యంతయు నొక యెత్తుగా నున్నది. ప్రభువులు దీర్ఘముగా నాలోచింప వలయును. నిన్నటి వఱకు మీసములు మెలిద్రిప్పిన తురక రాజులు, ఒక నాటికే చల్లబడి పాదాక్రాంతులగుదురా యేమి? పూర్వానుభవమునుబట్టి చూచినను, వారు నయవంచకులని మన మెఱింగియే యున్నాముగదా! కనుక సంధియనున దెంతమాత్రము తగదు." అని నొక్కి చెప్పినది. అయినను, మానవ సహజమైన భూతదయ రాయల హృదయమును మెత్తపఱుప, వ్యర్థముగా రక్తపాత మేల యనియు, వారంతగా మోసగించిన, అప్పుడు చూచుకొందమనియు ఆయన సంధికే యొడంబడినాడు. సంధి యత్నములేవో సాగుచున్నవి. ఈ యుద్ధములో తిరుమలరాయల కంటికి గట్టిదెబ్బ తగిలినది. ఆయన కొడుకు రఘునాథుడు మరణించినాడు. రామరాజు, కొంత సైన్యముతో తిరుమలరాయలను, వేంకటాద్రిని విజయనగరమునకు పంపివేసినాడు. యుద్ధమున గెలుపు దెచ్చిన సేనాధిపతులకును, సైనికులకును బహుమానము లొసంగనెంచి, శిబిరమున ధనమును, నవరత్నములను రాసులుపోసికొని వారికి పంచుచున్నాడు. సైన్యమంతయు విజయగర్వముతో క్రేళ్లుఱుకుచున్నది.

ఈలోపల ఇంతవఱకును మధ్యస్థుడుగానుండిన బిజాపురనవాబైన ఆలిఆదిల్షాహానకు పురి పెట్టి, కుతుబ్‌శాహా నిజామ్‌సాహేబు లతనిని తమ పక్షమునకు త్రిప్పుకొని యుద్ధమునకు సిద్ధము చేసినారు. అంతియే కాదు. రామరాజు పక్షమున నున్న తురకసర్దారులకు గూడ ఉద్బోధలు చేసియు, లంచము లిచ్చియు రామరాజును వంచింప ప్రేరేచి తమ పక్షమునకు త్రిప్పుకొనజాలిరి. ఆ సర్దారు లదను గనుపెట్టి మోసగింప వాగ్దానములు చేసి యుండిరి. అందొక స్వామిద్రోహి లంచము మేసి

రామరాజును తుదముట్టించుటకు గూడ నంగీకరించెను. సుల్తాను లీ విధముగా పన్నాగము లన్నియు పూర్తిచేసికొని పునర్యుద్ధము ప్రకటించినారు.

# 24

రామరాజు యుద్ధములకేగినప్పుడెల్లను, మోహనాంగి పురుషోత్తమ స్థపతి యిచ్చిన తారహారమును సర్వకాల సర్వావస్థల యందు నేమఱక ధరించి దైవారాధనము చేయుచుండెడిది. అభ్యంగ సమయమున గూడ ఆమె, ఆ ముత్యాలసరమును తీయదు. ఇదివఱకు తమ్ముడు మరణించిన తఱి తాను వ్యాధిగ్రస్తయైనది. అప్పుడు హారమును తీసి యున్నందున, తన వ్యాధి ఎంతకాలమునకు తగ్గకుండుట, దానిని ధరింపగనే తగ్గుట ఆమెకు గుర్తున్నది. అసలు వృద్ధుడైన రామరాజును తళ్ళికోట యుద్ధమున కేగవలదని ఆమె ప్రార్థించినది. ఆ వీరశిఖామణి వినునాయేమి? ఆయనకు సంగ్రామ మన్న పండువు గదా! తళ్ళికోట యుద్ధ మారంభమైనప్పటి నుండియు, మోహనాంగి దినమున కొక్క దేవాలమున కేగి, భగవదారాధనము సలుపుచునే యున్నది. ఆమెకు శైవవైష్ణవాది భేదములు లేవు గదా! ఏ నామరూపములలో నున్నను. ఈశ్వరుడొక్కడే యని ఆమె నిశ్చయము. ఒకనాడు, హంపీ విరూపాక్షస్వామిని సేవించెడిది. ఇంకొక నాడు ఉగ్ర నరసింహుని, వేఱొక రోజున హజార రామస్వామిని, ఇంకొక దినమున అచ్యుత రామస్వామిని, ఒండొక నాడు, సాశివగణేశుని-ఇట్లే తక్కిన దైవతములను గూడ అరాధించుచున్నది. కడకు జైన దేవాలయములకు సహిత మేగి పూజలు సలుపుచున్నది.

విజయనగరమున కేతెంచిన వేంకటాద్రియు, తిరుమలరాయలును "రామరాయలకే విజయము చేకూరిన దనియు, నవాబులతో సంధిషరతుల

నేర్పాటు చేసికొని, అన్నగారు కొలది దినములలోనే విద్యానగరము చేర కొందు"రవియు వదినగారికి చెప్పినారు. ఆమె తన పూజలు ఫలించి, విజయశ్రీ తనభర్తనే వరించినందుల కెంతయో సంతసించినది, "నాగిని రాలే దేమి" అని మాత్ర మెవ్వరి నడుగలేదు. ప్రభువుల నొంటరిగా వదలి నాగిని రాదని ఆమె యెఱుంగును.

తిరుమలరాయల కీ యుద్ధములో గాయము లగుటయే గాక కంటికి సైతము పెద్దదెబ్బ తగిలినందున, ఆతడా బాధను కట్టుకొన లేకున్నాడు. ఆయన భార్య *వేంగళాంబ, మోహనాంగికి తోడికోడలు గదా! ఈవేంగ ళాంబ మోహనాంగి మెడలోనున్న మహేంద్రనీలాలంకృత తారహారము వ్యాధులను పోగొట్టి మనుజున కారోగ్యము గూర్చునని యొకసారి నాగిని చెప్పగా విన్నది. ఆయంశమిప్పు డామె స్మృతిలో మెదలినది. "తనభర్త యుద్ధమునందు గాయపడి బాధపడుచున్నాడు. ఆ హారమును కొలదికాలము ధరించినచో ఆయన యారోగ్యము కుదుటపడును."ఆమె వెంటనే మోహ నాంగి కడ కేగి, సంగతి నెఱింగించి ముక్తాదామము నొక్కసారి యిచ్చి నచో భర్త వ్యాధి తగ్గగనే మరల తెచ్చియిత్తు'నని ప్రార్థించినది. మోహ నాంగి కిందులకేమి జవా బిచ్చుటకును తోచలేదు; ఆమెకు వచ్చివెలగకాయ గొంతున పడినట్లైనది. ఆమె ఇట్లాలోచించినది.

"ఇచ్చుటయా? ఈయకపోవుటయా? తనకుమాత్ర మిచ్చుట కిష్టము లేదు. ఇవ్వకున్న తోడికోడ లే మనుకొనును! ఎంత కఠినాత్ము రాలురా, అనుకొనును. మఱి క్షేమముకాద ఆమెకు పట్టలేదే, అను కొనును. అంతమాత్ర మనుకొన్నచో నిబ్బంది లేదు. తన్ను స్వార్థపరురా లనియు, పరశ్రేయమును కోరని కుటిలస్వభావ యనియు నెంచును.

*మోహనాంగి చెల్లెలైన వేంగళాంబ కా దీమె

నలుగురికి చెప్పి తన్నల్లరిచేయును. ఇందుకు తో డామె పుత్రశోకముతో కూడ నున్నందున, మోహనాంగి మనసు కరగినది. ఇంతలో నింకొక యూహ ఆమెకు తోచినది. "పతిదేవులు సంగ్రామమున తలపూ వాడ కుండగనే విజయలక్ష్మి నందినారు. ఇక నెట్టి యుపద్రవమును రాదు. అయినను, వారు వచ్చువఱకును తాను దైవారాధనము చేయ సిద్ధముగానే యున్నది. ఇక నేమి హాని కల్గును?" కడకు, సంపూర్ణముగా నిష్టము లేకున్నను, మోహనాంగీ మోమోటమునకై వేంగళాంబకు తారాహారము నిచ్చి పదిలమని హెచ్చరిక చేసినది. ఆమె దానినొక వరముగా నందు కొని, దానితో మగని కంఠసీమ నలంకరించినది. తిరుమలరాయలకు గడియ గడియకు బాధలు తగ్గి తేట చిక్కుచున్నది. రెండు మూడు దినములలోనే యాతడు యథాస్థితికి వచ్చినాడు.

మోహనాంగి, రామరాయలరాకను నిరీక్షించుచు పూర్వము వలెనే ప్రతిదినమును దేవాలయముల కేగి పూజా పురస్కారములు చేయుచునే యున్నది, అనా డాదివారము. సాధారణముగా భానువాసరమున, నాగినియు తానును హజారరామాలయమునకేగి పూజలుచేసి వచ్చుచుండుట అలవాటు. నాగిని తళ్ళికోట యుద్ధమున కేగినప్పటినుండియు పరిచారికలతో, తా నొక్కతయే రామాలయమునకు పోవలసి వచ్చుచున్నది. సాయంకాల మింకను నాలుగు గడియల ప్రొద్దున్నదనగా, ఆమె రామాలయమునకేగి సాయంపూజ జరుపుచున్నది. పూజానంతర మామె కొంతసేపు కనులు మూసికొని రామదేవుని ధ్యానించుచుండెను. ఆనాడు ధ్యానప్రారంభము కాగనే మోహనాంగి నొకానొక మైకమావేశించినది. అదియొక స్వప్న సదృశ స్థితి. ఆమెకన్నులకు తళ్ళికోట యుద్ధరంగము సాక్షాత్కరించినది.

శత్రుపక్షమున యుద్ధభేరులు మ్రోగుచున్నవి. సింహనాదములు వినబడుచున్నవి. ఫిరంగులు ప్రేల్చబడుచున్నవి. యుద్ధసన్నాహమును

వీడి యున్న రాయలపక్ష మిప్పుడు విషమఘట్టము నెదుర్కొనవలసి వచ్చినది. ఆ సమయమున రామరాజు శిబిరములో భోజనము చేయు చున్నాడు. సైన్యము కవిసి పైబడుచున్నది. ఇక చేయునది లేక, సగము తిన్న యన్నము నట్టే వదలి రామరాజు కవచ శిరస్త్రాణములను ధరించి, ఆయుధహస్తుడై రణరంగమున దుమికినాడు. ప్రభువులు భుజించిన పిమ్మట భుజింత మనుకొన్న నాగిని యన్నము తినక అట్టె యుద్ధసన్నద్ధ యైనది. దండునకు వర్తమానము పోయినది. ఆ యుద్ధమున రాయల పక్షము చూపుచున్న పరాక్రమ మింతింత కాదు. శత్రుసైన్యము నూచ కోత కోయుచున్నారు. సుల్తానులు రామరాజు దెబ్బకాగలేక పలాయనము చిత్తగించినారు. నాగిని ప్రభువుల కే హానియు జరుగదనుకొని, చివరి క్షణములో విశ్వాసద్రోహిగా మారిన అలీ ఆదిల్షాహు నెదిరించి పోరాడి తుదిముట్టించు యత్నములో నున్నది. ఈ యదను గనుపెట్టి రాయల సైన్యములో నున్న తురకసర్దా రొకడు వెనుకనుండి దొంగపోటుగా రామరాజు శిరమును బల్లెముతో గొట్టి నేల గూల జేసినాడు. రామప్రభుని తల తెగుటకోడనే ధ్యానములో నున్న మోహనాంగి "స్వామీ" యని పెద్ద కేక వేసి కన్నులు తెఱచినది. ఆమె ఎదుట రామరాజు శీర్షమును చేత నిడుకొని కన్నీరు కార్చుచున్న నాగిని సాక్షాత్కరించినది. ఆమె తన ప్రభుని శీర్షమును స్వామిని కొసంగి ఆమె పాదములపై వ్రాలి- "స్థపతి వర్యు లిచ్చిన తారహారము మెడలోనుండగా నిట్టి ఘోరమెట్లు జరిగినది తల్లీ!" అని యాక్రోశించినది. మోహనాంగి యన్నది—

ఆ హారము నా మెడ నెడబాసి నాలుగు దినములైనదే నాగినీ! అందుకే యీ విపత్తు ఘటిల్లినది."

మోహనాంగి పుట్టెడు దుఃఖముతో భర్తృదేవుని శిరస్సును కన్నుల కద్దుకొన్నది. దానికి పునః పునః ప్రణామము లాచరించినది. గుండెలకు

హత్తుకొని, కనులు మూసికొని హజారరామస్వామిని ధ్యానించుచుండ, ఆమె శిరస్సు నుండి ఒక దివ్యతేజము బయల్వెడలినది. అది అలౌకిక మైనతేజము. ఆ వెలుగా యాలయమునేగాక, చుట్టుపట్టుల ప్రదేశములను గూడ జాజ్వల్యమాన మొనర్చుచు బయనింప సాగినది. ముఖమండపమును దాటినది. శుకనాసము నతిక్రమించినది. గర్భాలయమున ప్రవేశించినది. రామస్వామి దివ్యమూర్తి చుట్టును ముమ్మారు ప్రదక్షిణించినది. కడకు రామదేవుని పాదములను ముద్దుగొన్నది. అటనుండి లేచి, ఆ స్వామి నేత్రనాళములద్వారా స్వామిలో ప్రవేశించినది. స్వామి మూలవిరాణ్మూర్తి తొంటికంటెను మిక్కిలిగా కాంతులను చిమ్ముచున్నది. మోహనాంగిని తనలో నైక్యము చేసికొన్న రామస్వామి, పాతివ్రత్యతేజము తన్ను బొందుటచే తాటకావధ సంజాత పాతకమునుండి విముక్తుడై పూర్వమున కంటెను వింత వెలుగులు చిమ్మసాగినాడా యనిపించినది. ఈ వింత దృశ్యమును గాంచుచున్న యర్చకులు దిగ్భ్రాంతి నంది, యచ్చటనే స్థాణువులైనారు. వారి కా భగవద్భక్తురాలి ప్రభావమునుగాంచగనే శివత్వ మబ్బినట్లైనది!

నాగిని కన్నులు కన్నీళ్ళతో నిండిపోయినవి. ఏ మహాస్వామిని కోసమై తన జీవితమును ముడుపుకట్టినదో, ఆ తల్లి కథ నేటితో ముగిసినది. ఇక నిచ్చట తన కేమి పని? నాగిని, ఆ రామస్వామిమూర్తి కెదురుగా పద్మాసనము వేసికొని కూర్చున్నది. ప్రాణవాయువును బంధించినది. ఆ ప్రాణమును జీవునితో గూడ అనాహతమునుండి విశుద్ధచక్రమునకు బంపినది. అటనుండి ఆజ్ఞాచక్రమున కేగి, అందలి ద్విదళములపై "సోఽహం" భావమును అనుసంధించినది. అటనుండి, సహస్రారమునకు పయనింప జేసినది. అచట కోటిసూర్యప్రభ లా జీవుని చుట్టుకొన్నవి. ఆ పరంజ్యోతిలో నాత్మజ్యోతి ఐక్యమై, బ్రహ్మరంధ్రమును భేదించుకొని

బయటకు వచ్చినది. ఆ తేజము రామదేవునిలో ప్రవేశించిన తనస్వామిని తేజమును తోడుచేసికొని సూర్యమండలమును జేరినది. అచట రామరాయల యాత్మతేజము, ఆ తేజోద్వయమునకు స్వాగత మొసగినది. అంతవఱకు మన మెఱుంగుదుము. పిమ్మట నా మూడు వెలుగులును వెలుగులకెల్ల వెలుగైన ఏ మొదటి వెలుగును చేరునో మన మనస్సునకును, మాటల కును అందునది కాదు :

"ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ,
పరివ్రా డ్యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః."

యోగయుక్తుడైన విరాగియు, యుద్ధమున హతుడైన వీరుడును సూర్యమండలమును భేదించుకొని తురీయ పురుషార్థసిద్ధి నందుదు రట! రామరాయలు రణనిహతుడు. నాగినియో, యోగయుక్తురాలు. ఇక తిరుమలాంబయన్న పతివ్రతాతిలకము. ముప్పురుమ సూర్యమండలమును భేదింప గలవారే. ఆ మూడు వెలుగులును సూర్యచంద్రాగ్నులు, ఇడా పింగళా, సుషుమ్నాకారములు; మూర్తిత్రయ స్వరూపములు. "నా విష్ణుః పృథివీపతిః" రామరాజు భూపాలకుడు. అతనిది విష్ణ్వంశ : మారీచీ పరిణయ కావ్యమును సృష్టించిన మోహనాంగిది వాణీ హిరణ్యగర్భాంశ, ఇక నాగినిది, లయకారుడును, మహాయోగీశ్వరుడు నైన రుద్రుని యంశ యని చెప్పనేల ! ఈ మూర్తిత్రయాంశములు త్రయీమయుడును, త్రిమూర్తి స్వరూపుడును నగు సూర్యభగవానుని జేరుటలో వింత యేము న్నది ? నాగినీ మోహనాంగీ రామరాజుల నిర్యాణవార్తను విన్న పురుషోత్తమస్థపతి ఆ యిరువురు సాధ్వీమతల్లుల శరీరములకును అగ్ని సంస్కారములు చేయక, సమాధులు చేయవలసినదని రాజకులమునకు వార్త పంపినాడు.

* *

ముక్తాహారమును ధరించిన రామరాయల సోదరుడు తిరుమల రాయలు, తురుష్కులచే రానున్న విపత్తు నూహించినాడు. ఏనుగుల మీదను, గుఱ్ఱములమీదను రత్నరాశులను, వెండి బంగారములను, ఆభరణములను పదిలపఱచుకొని, సముచిత పరివారముతో పెనుగొండ దుర్గమునకేగి జీర్ణకర్ణాటరాజ్య పునస్సృష్టికై యభిషిక్తుడైనాడు.

—:0:—

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 10 | 4 | నెత్తినందుకు | నెత్తనందుకు |
| 16 | 22 | రాయలు | రాయల |
| 21 | 5 | నట్లున్నానే | నట్లున్నావే |
| 24 | 10 | కవితాకాళా | కవితాకళా |
| 32 | 23 | స్తంభము | స్తంభ |
| 33 | 6 | తాలమీచ | తాలమీద |
| 35 | 11 | నొసంగును | నొసంగెను |
| 39 | 15 | యేనిచాయ | మేనిచాయ |
| 42 | 11 | సృష్టిలో | సృష్టిలోని |
| 51 | 18 | పడ్డమహిషి | పట్టమహిషి |
| 54 | 17 | "దిక్త్రిరాతి"-పంక్తినుండి 5 లైన్లు ఫుట్ నోట్ | |
| 56 | 4 | జలహరణమో | జలాహరణమో |
| 67 | 13 | వ | రావ |
| 81 | 16 | రంబ | రంభా |
| 84 | 10 | అనియు | అన్నియు |
| 91 | 14 | మెచ్చునంతమాత్రమున | మెచ్చునంతమాత్రమున |
| 109 | 2 | కవికదియును | కడకదియును |
| 114 | 4 | బలవరదీ | బలవదరీ |
| 118 | 6 | స్థిని | స్థితి |
| 119 | 10 | ముర్పిరిగొన | ముప్పిరిగొన |